సబ్ కాంట్రాక్టులు, ప్రభుత్వ లీజులు మీకు లభిస్తాయి. ముఖ్యమైన అధికారులు మీకు అత్యంత సన్నిహితం అవుతారు, ఇది మీకు ఎంతగానో ఉపకరించే అంశంగా మారుతుంది. మీరు సాధించిన పురోగతి మాత్రం రహస్యంగా ఉంచుతారు. స్నేహితులకు, సన్నిహితులకు, బంధువులకు మీరు ఆర్థికసాయం చేస్తారు. ఈ విషయం కొంతమంది వ్యక్తుల ద్వారా బయటపడుతుంది. ఈ కారణం వల్ల గృహంలో అశాంతి ఏర్పడుతుంది. చేతగాని వాళ్ళకు, ఎందుకూ పనికిరాని వాళ్ళకు, సోమరిపోతులకు మీరు వివరణ ఇచ్చుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. **"వసుదేవుడు అంతటి మహానుభావుడు గాడిద కాళ్ళు పట్టుకోవలసి వచ్చిందన్న"** విషయాన్ని గుర్తుకు తెచ్చుకుని ఊరట చెందండి. దివాళ తీసిన ఒక పెద్ద ఆర్థికసంస్థ నుండి రావలసిన ధనం రాదు. కొద్దో గొప్పో చేతికి అందుతుంది అని ఆశించిన మీ ఆశ నెరవేరదు. నూతన వ్యాపారం లేక పరిశ్రమ స్థాపించాలనే మీ నిర్ణయం కార్యరూపం దాలుస్తుంది. ప్రభుత్వపరంగా రావాల్సిన అన్ని అనుమతులు వెంటవెంటనే చేతికి అందుతాయి. సేవకాజనం వల్ల, కార్మికుల వల్ల ఇబ్బందులు ఏర్పడతాయి. దేవుడు వరం ఇచ్చినా పూజారి అడ్డుకున్నట్లు కొన్ని సంఘటనలు నిరూపిస్తాయి. స్త్రీల సహాయసహకారాల వల్ల చాలా విషయాలలో ప్రయోజనాలు పొందుతారు. కంటికి సంబంధించిన అనారోగ్యం బాధించే అవకాశం ఉంది. విలాసవంతమైన వస్తువుల మీద, వస్త్రాల మీద మక్కువ పెరుగుతుంది. అష్టమూలికా గుగ్గిలంతో గాని, దైవికం అనే పొడితో గాని ఇంట్లో, వ్యాపార ప్రదేశంలో ఉదయం, సాయంత్రం ధూపం వేయండి, చాలా మంచిది. మధ్యవర్తి సంతకాలు పెట్టవద్దు. స్పెక్యులేషన్‌లో నష్టపోయే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. బంధువులతో ఏర్పడిన విభేదాలను పరిష్కరించడానికి విధిలేని పరిస్థితులలో మీరు మధ్యవర్తిత్వం వహించాల్సి వస్తుంది. ఓ శుభకార్యానికి కూడా మీరే మధ్యవర్తిత్వం వహించాల్సి వస్తుంది, ఇందువల్ల ప్రయోజనం లేకపోగా మీపై అనవసర నిందలు పడతాయి. వివాదస్పదమైన ఆస్తి కలిసివస్తుంది. ఇంటికి సంబంధించి వివాహాది శుభకార్యాల విషయంలో మీకు కొన్ని అభ్యంతరాలు ఉన్నప్పటికీ సర్దుకుపోతారు, మౌనం వహిస్తారు. దైవసంకల్పం ఎలా ఉంటే అలా జరుగుతుంది అనే వాస్తవాన్ని గ్రహిస్తారు. అందుకనే వివాదాలకు, తగాదాలకు తావులేకుండా నిబ్బరంగా ఉంటారు. స్నేహితులతో విందులు, వినోదాలు అధికం అవుతాయి. ఆడంబరాల కోసం ధనాన్ని ఎక్కువ ఖర్చు చేస్తారు. అనాథాశ్రమాలకు, వృద్ధాశ్రమాలకు, ఆధ్యాత్మిక కేంద్రాలకు యథాశక్తి విరాళాలు ఇస్తారు. గతించిన వ్యక్తుల జ్ఞాపకాలు తీవ్ర మనోవేదనకు కారణం అవుతాయి, వాళ్ళ జ్ఞాపకార్థం కొన్ని మంచి పనులు చేస్తారు. దొంగస్వామీజీల వల్ల, దొంగబాబాల వల్ల నష్టపోతారు. ఆధ్యాత్మికరంగంలో తీయని మాటలు చెప్పి మోసం చేసేవారు ఎదురవుతారు. జాగ్రత్త వహించండి. అడుగడుగునా నమ్మకద్రోహులు ఎదురవుతారు. మీ వాళ్ళు ఎక్కడ నష్టపోతారో అని ఆలోచిస్తారు. వీళ్ళు స్నేహితులలోనూ, ఆత్మీయులలోనూ, బంధువులలోనూ ఉంటారు.

## స్త్రీలకు ప్రత్యేకం

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం చాలా బాగుంది. స్వయం సంపాదనతో స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. ఆరోగ్య విషయాలలో జాగ్రత్త అవసరం. అనువంశికంగా రావలసిన ఆస్తిలో పెద్దలు వ్రాసిన డాక్యుమెంట్‌లో కొన్ని లోపాలు మిమ్మల్ని ఇబ్బంది పెడతాయి.

ఆత్మీయవర్గంతో విడిపోవడం కన్నా కలిసి ఉండటం మంచిదని గ్రహించండి, ఇది కేవలం సలహా మాత్రమే. పరిస్థితుల ప్రభావం, మీ ఓర్పు భగవత్ సంకల్పం, పరిస్థితులను ప్రత్యక్షంగా నిర్దేశిస్తాయి. రాక్షస మనస్తత్వం కలిగిన వ్యక్తులతో కొంతకాలం సహజీవనం చేయవలసి వస్తుంది. యోగా, మెడిటేషన్‌కు ప్రాధాన్యత ఇస్తారు. ఆధ్యాత్మిక కేంద్రాలను, మనోహర ప్రదేశాలను సందర్శిస్తారు. పెద్దల ఆరోగ్యం గురించి అధికంగా ధనాన్ని వెచ్చిస్తారు. ఆపద సమయంలో మిమ్మల్ని ఆదుకున్న వారి ఋణం తగిన విధంగా తీర్చుకుంటారు. కొద్ది మంది విషయంలో విడిపోవాలని అనుకునే వ్యక్తులతో శాశ్వతంగా విడిపోతారు. చేయవలసిన మేలు, మంచి చేసి మీ నోటి దురుసుతనం వల్ల స్నేహితుల అభిమానాన్ని, రావలసిన ప్రయోజనాలను చెడగొట్టుకుంటారు. ఓర్పు సంయమనం వహించండి. మంచి ప్రయోజనాలు అందివస్తాయి. అందరూ ద్వేషించే ఓ వ్యక్తిని కాపాడటానికి మీ పలుకుబడిని ఉపయోగిస్తారు. వృత్తి, ఉద్యోగాల పరంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. చాలా సందర్భాలలో ఇతరుల అభిప్రాయంతో విభేదిస్తారు. ఉద్యోగాల పరంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. చాలా సందర్భాలలో ఇతరుల అభిప్రాయంతో విభేదిస్తారు. ఉద్యోగంలో బాధ్యతలు, అధికార దర్పం పెరుగుతాయి. మీరు పడ్డ కష్టానికి ప్రతిష్టాత్మకమైన అవార్డులు లభిస్తాయి. అపార్ట్‌మెంట్ కొనుగోలు చేయాలన్న మీ కోరిక నెరవేరుతుంది. విలువైన ఆభరణాలు కొనుగోలు చేస్తారు. వివాహం కాని వారికి వివాహ ప్రాప్తి, సంతానం లేని వారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది. విద్యా, సాంస్కృతిక, కళారంగాలలో రాణిస్తారు. విదేశాలలో ఉన్నతవిద్యను అభ్యసించడానికి అవకాశాలు కలిసివస్తాయి. నరఘోష అధికంగా వుంది. నిత్యం మీ ఇష్టదైవం సన్నిధిలో అష్టమూలికా తైలంతో జిల్లేడు వత్తులతో దీపారాధన చేయండి. శనీశ్వరుడికి నలుపు వత్తులతో దీపారాధన చేయండి. ఏ వ్యవహారమైనా సంపూర్తి అయిన తరువాతనే చెప్పండి, వ్యవహారాలు మధ్యలో ఉండగా ఇతరులకు చెప్పవద్దు. మీరు కోరుకున్న వివాహానికి చాలా అడ్డంకులు ఏర్పడతాయి, సొంత నిర్ణయాలు ఫలించవు. సంతానం యొక్క పురోగతి బాగున్నప్పటికీ కొన్ని సమస్యలు ఎదురవుతాయి. మొండితనంగా వ్యవహరించి జీవితాన్ని వక్రమార్గంలో వెళుతున్న వారి మనస్తత్వాన్ని, ఆలోచనా విధానాన్ని మార్చలేరు. కుతంత్రాలను మనస్సులో పెట్టుకుని ఆత్మీయులుగా నటిస్తున్న వారి పట్ల జాగ్రత్త వహించండి. వాళ్ళ అభిమానం మీ పదవి మీద, మీ డబ్బు మీద తప్ప మీ మీద కాదని గ్రహించండి. కొంతకాలం విలాసవంతమైన జీవితాన్ని గడపడానికి ధనాన్ని వెచ్చిస్తారు. మీరు ఎదురుచూస్తున్న ఓ ప్రతిష్టాత్మకమైన ఉద్యోగం మీకు లభిస్తుంది. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. అపోహలు, ఊహలతో కొంతకాలం వృథాగా గడిచిపోతుంది. ముఖ్యమైన విషయాలు గోప్యంగా ఉంచకుండా బహిరంగ పరిచినందుకు తగిన మూల్యం చెల్లించాల్సి వస్తుంది. కీలక స్థానాలలో ఉన్న వ్యక్తులు మీ శ్రమను, సామర్థ్యాన్ని గుర్తిస్తారు. ఇందువలన దీర్ఘకాలిక ప్రయోజనాలు ఏర్పడతాయి. నిజంగా మిమ్మల్ని అభిమానించే వ్యక్తులను మీరు గుర్తించకపోవడం జరుగుతుంది. టీవి, సినీరంగాలలో ఉన్న వారికి మంచి అవకాశాలు కలిసివస్తాయి. చెప్పుడు మాటలు విని పొరపాటుగా తప్పుడు నిర్ణయాలు తీసుకుని కొన్ని విషయాలలో మోసపోతారు. లీజులు, అగ్రిమెంట్లు, లైసెన్సులు లాభిస్తాయి. సెల్ఫ్ డ్రైవింగ్ విషయాలలో జాగ్రత్త వహించండి. జమా పద్దుల పుస్తకాల విషయంలో జాగ్రత్త వహించండి. శుభకార్యాలు ముడిపడతాయి. నిత్యం ఆరావళి కుంకుమతో మహాలక్ష్మీదేవిని, లక్ష్మితామర

వత్తులతో అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. నవగ్రహ దోష నివారణార్థం నిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో, సర్వరక్షా చూర్ణంతో స్నానమాచరించండి.

మేషరాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. ముఖ్యమైన విషయాలు ముడిపడతాయి. ఆర్థిక ఇబ్బందులను అధిరోహించగలుగుతారు. ఆర్థికపరిస్థితి బాగుంటుంది. వృత్తిఉద్యోగాలలో స్థిరత్వం వస్తుంది. కుటుంబ విషయాలు, సంతాన విషయాలు బాగున్నాయి. విద్యా సంబంధమైన విషయాలు కూడా అనుకూలంగా ఉన్నాయి. విదేశాలకు సంబంధించిన అంశాలు కూడా అనుకూలంగా ఉన్నాయి. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు, మంచి ఉద్యోగం సాధించగలిగామన్న సంతృప్తిని కలిగి ఉంటారు. నమ్మిన వ్యక్తి ఆశ్చర్యంగా మోసం చేయడం జరుగుతుంది. ప్రేమవివాహాల పట్ల నమ్మకం పోతుంది. ఐ.ఐ.టి మరియు మెడిసిన్ సీట్లు సాధిస్తారు. గతంలో జరిగిన తప్పిదాలను తిరిగి జరగకుండా జాగ్రత్త వహిస్తారు. నూతనగృహం కొనుగోలు చేయాలనే మీ ప్రయత్నాలు సఫలీకృతం అవుతాయి. స్థిరాస్థుల విక్రయానికి ఇష్టపడరు. కొన్ని సందర్భాలలో నిర్ణయాలు వెంటవెంటనే చెప్పలేని పరిస్థితులు నెలకొంటాయి. మెతక వైఖరి కొంత ఇబ్బందులను తెచ్చిపెడుతుంది. సంతానం లేనివారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది. అవివాహితులైన వారికి మంచి సంబంధం కుదురుతుంది, వివాహం జరుగుతుంది. ఫైనాన్స్ కంపెనీల ద్వారా నష్టపోతారు. సంతాన విషయంలో ఏకపక్ష నిర్ణయాలను తీసుకుంటారు. సహోదరసహోదరీ వర్గంతో నిష్కారణ విభేదాలు ఏర్పడతాయి. కొన్ని ముఖ్యమైన విషయాలలో తల్లిదండ్రులను ఒప్పించలేని పరిస్థితి ఏర్పడుతుంది. అందరినీ కాదనుకుని మీకు మీరుగా కఠిన నిర్ణయాలను తీసుకుంటారు. వృత్తిఉద్యోగాల పట్ల ఉన్నటువంటి చికాకులు తొలగిపోతాయి. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వచ్చినా మనస్తాపం కలుగుతుంది. ఆత్మీయతలని, అనురాగాలని మరచిపోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. విలాసవంతమైన జీవితం గడపాలని ఊహాగానాలు చేస్తారు. సంగీత సాహిత్య రంగాలలో రాణిస్తారు. క్రీడలలో గుర్తింపు వస్తుంది. మార్షల్ ఆర్ట్స్, డ్రైవింగ్ నేర్చుకోవాలని కష్టపడతారు. ప్రతిరోజు ఆరావళి కుంకుమతో మహాలక్ష్మికి పూజ చేయండి. లక్ష్మీతామర వత్తులతో దీపారాధన చేయండి. ఆరోగ్య పరిరక్షణకు, శారీరక సౌందర్య పరిరక్షణకు ప్రాధాన్యతనిస్తారు. సాంకేతికవిద్యాపరంగా మంచి రాణింపు వస్తుంది. ప్రతిష్ఠాత్మకమైన యూనివర్సిటీలో సీటు లభిస్తుంది. విదేశీయాన విషయాలు అనుకూలిస్తాయి, గ్రీన్‌కార్డు లభిస్తుంది. మొత్తం మీద ఒకటి రెండు విషయాలు మినహా సంతృప్తికరంగా ఉంటుంది. పుణ్యస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.







# 2017-2018 లో వృషభరాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 2 | వ్యయం - 8 | రాజ - 7 | అవ - 3 |

**కృత్తిక 2, 3, 4, పాదములు, రోహిణి 4 పాదములు, మృగశిర 1, 2 పాదములందు పుట్టినవారు మరియు "ఈ, ఊ, ఏ, ఓ, వా, వీ, వు, వె, వో" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు వృషభరాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**వృషభరాశి :** ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. ఆర్థికపరమైన సర్దుబాటు చేయగలుగుతారు. ఎవరినీ నొప్పించకుండా అందరికీ న్యాయం చేస్తారు. మీకు రావలసిన బిల్లులు, వడ్డీలు, అసలు ధనం చేతికి అందుతుంది. వ్యాపారంలో పైరసీల బెడద ఇబ్బంది పెడుతుంది. అభివృద్ధి కార్యక్రమాలకుగాను ఋణాలు మంజూరు అవుతాయి, మొండి సమస్యలు తీరిపోతాయి. వ్యాపారంలో రొటేషన్ సంతృప్తికరంగానే ఉంటుంది, లాభాలు గతంలో కంటే బాగుంటాయి, నష్టాలను కలిగించే ఒప్పందాలను రద్దు చేసుకుంటారు. ఉద్యోగంలో తిరిగి ప్రాధాన్యత లభిస్తుంది. వ్యాపారసంబంధమైన విదేశీయాన యత్నాలు అనుకూలిస్తాయి. సంతానం అభివృద్ధి చెందటం, వాళ్ళ వలన పేరుప్రతిష్ఠలు రావడం సంతోషం కలిగిస్తుంది. అదనపు బరువుబాధ్యతలు తప్పవు. సంతాన పురోగాభివృద్ధికి కృషి చేస్తారు. మీరు చేస్తున్న అన్ని విషయాలను గోప్యంగా ఉంచుతారు. రావలసిన బాకీలు కొద్దికొద్దిగా జమచేసుకుంటారు. అసలు గురించే మీ ఆందోళన, వడ్డీల మీద ఆశపెట్టుకోరు. బంధువర్గం, దగ్గరివాళ్ళు, వయస్సులో పెద్దవాళ్ళు, సాయం చేయవలసిన పెద్దలే నవ్వుతూ ద్రోహం చేస్తారు, మీకు ప్రతికూలంగా మాట్లాడతారు. అభివృద్ధి చెందుతున్న పిల్లల మొహం చూసి కూడా వాళ్ళ అభిప్రాయాలలో మార్పు రాదు. ఉన్నవాళ్ళకు ఇంకా మేలు చేయాలని అన్యాయమైన పంచాయితీలు తెస్తారు, ఎదురించి ప్రయోజనం లేదని తెలుసుకుంటారు. నమ్మకం పెట్టుకున్నందుకు, మీ పొరపాటుకు ఈ శిక్ష పడాల్సిందేనని మీరే మౌనంగా బాధను దిగమింగుకుంటారు. **మణి అని తలంచి అగ్నికణికను ముట్టుకుంటే చేయి కాలుతుంది. దానికి కారణం అగ్నికణిక కాదు, మణి అని భావించడమే మీరు చేసిన తప్పు. కాలం ఎప్పుడూ ఒకలాగా ఉండదు.** అలా ఉంటే అది కాలమే కాదు. వివాదాలు నిదానంగా సర్దుకుంటాయి. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. వ్యక్తిగతస్థాయి పెరుగుతుంది. ఉద్యోగంలోనూ, వ్యాపారంలోనూ మీ స్థితి బాగుంటుంది. మీరు అనుకున్నది, ఆశించినది, కృషి చేసినది నిజంగా మీదే అవుతుంది. ఆర్థికస్థితిలో మార్పు వస్తుంది. ఇతరులకు జవాబు చెప్పవలసిన పనిలేదు. ఉంటే తింటాం లేకపోతే లేదు, బయటవారితో మాట అనిపించుకోవాల్సిన పరిస్థితి లేదు అన్న భావన చాలా ఊరట కలిగిస్తుంది. భాగస్వాముల

ఖర్చు ఉమ్మడి ఖాతాలలో వాడకం వల్ల వాటాలను దాదాపు మించిపోతుంది, ఇలాంటివి సామరస్యంగా నాలుగుగోడల మధ్య పరిష్కారం చేసుకుంటారు. శుభకార్యాలకు సంబంధించిన విషయాలకు శాస్త్రపరమైన ఇబ్బందులు ఎదురవుతాయి. ప్రతిదానికి వంకలు పెట్టే వాళ్ళని సంతృప్తిపరచలేమని కాస్త ఆలస్యంగా గ్రహిస్తారు. స్టేషనరీ, ప్రింటింగ్, పుస్తకాలు, ఎలక్ట్రానిక్ సామాగ్రి, రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాలలో లాభాలు వస్తాయి. జలవనరులు మీరు ఆశించిన చోట ఏర్పడతాయి. విదేశాలలో ఉన్న మీ వాళ్ళు కొండంత అండగా నిలుస్తారు. మీరు కోరుకున్న విధంగా ఉద్యోగాలలో బదిలీలు ఉంటాయి. నిష్కారణమైన ద్వేషానికి మందు కనిపెట్టలేమని గ్రహించి ఊరట చెందండి. నిబంధనలకు తిలోదకాలు యిచ్చి మీకు అన్యాయం చేశారని విచారించవద్దు, మీ ప్రయోజనాలు రాచబాటలో వస్తాయి. మీ సన్నిహిత రాజకీయవర్గం డబ్బులు తీసుకుని మీ వ్యతిరేకవర్గానికి మేలు చేస్తారు, దీర్ఘకాలిక పోరాటానికి మీరు సంకల్పించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. దివాళ తీసిన ఒకపెద్ద ఆర్థిక సంస్థ నుండి రావలసిన ధనం రాదు. కొద్దో గొప్పో చేతికి అందుతుంది అని ఆశించిన మీ ఆశ నెరవేరదు. ప్రకృతి చికిత్సల వల్ల ఆరోగ్యం దెబ్బతినే అవకాశం ఉంది. ఏకపక్ష నిర్ణయాలు తీసుకోకుండా ఏదైనా పనిచేసేటప్పుడు సన్నిహితులను, నిపుణులను సంప్రదించండి. కార్యాలయంలో పని ఒత్తిడి పెరుగుతుంది, శాడిస్టు మనస్తత్వం కలిగిన అధికారుల వల్ల ఇబ్బంది పడతారు. వ్యాపారాన్ని విస్తరిస్తారు, కొత్త బ్రాంచీలు విస్తరిస్తారు. మీ పేరు మీద ఇతులు చేసే వ్యాపారాలు మధ్యస్థంగా ఉంటాయి. ప్రతి విషయాన్ని కొత్త కోణంలో ఆలోచించి నూతనమైన పద్ధతులు కనిపెట్టాలని యోచిస్తారు. పెయింటింగ్, ఆర్ట్, డిజైనింగ్‌లకు మంచి ఖ్యాతి లభిస్తుంది. పొదుపు చేసిన ధనాన్ని సక్రమమైన వాటిల్లో పెట్టుబడిగా పెడతారు. వీలైనంత వరకు దుబారా ఖర్చులు తగ్గిస్తారు. వీలైనంత పొదుపుగా కాలం గడపాలని చూస్తారు. అయితే స్వంత త్యాగాలను త్యాగం చేయరు, ఇతరులకు పెట్టే వాటిల్లో లోటు చేయరు. అనవసరమైన వ్యక్తుల సలహాలను దూరంగా పెడతారు. కుటుంబవ్యవహారాలలో, వ్యక్తిగత విషయాలలో బంధుమిత్రుల ప్రమేయాన్ని పూర్తిగా తగ్గిస్తారు. సంతానపురోగతి బాగుంటుంది, మెరిట్ మార్కులు సాధిస్తారు. సంతానాన్ని అధిక గారాబం చేస్తున్నారన్న విమర్శలు వస్తాయి, వాటిని పట్టించుకోకండి. ఎప్పుడో కొనుగోలు చేసిన భూములకు, పొలాలకు మంచి ధర లభిస్తుంది. అమ్మాలన్న ఉద్దేశ్యంతో కొనుగోలు చేసిన ఓ ఫ్లాట్‌ను అమ్మి ధనాన్ని వ్యాపారంలో పెట్టుబడిగా పెడతారు. బంధువుల మధ్య తగాదాలు మీకు చికాకు కలిగిస్తాయి. ప్రతి విషయంలోనూ జీవితభాగస్వామికి గాని, మరొకరికి గాని సంజాయిషీ ఇవ్వాల్సిరావడం మీ మానసిక అసహనానికి కారణం అవుతుంది. సమాజంలో మీకున్న గుడ్‌విల్‌ను నిలబెట్టుకోగలుగుతారు. కష్టపడి పనిచేసి ఫలితాలను ఆశిస్తారు, కష్టపడకుండా ఎలాంటి ఫలితాలను ఆశించరు. మీ ఆత్మీయులపై పడిన నిందలను మీపై వేసుకుంటారు, బరువుబాధ్యతలు కోరి తెచ్చుకుంటారు. వారిని రక్షించడానికి మరొక మార్గం లేకపోవడంతో మీరు ఇలా చేయవలసి వస్తుంది. ఇది అర్థంలేని త్యాగం అని కుటుంబసభ్యులు విమర్శిస్తారు. **'ఏరుదాటి తెప్పను తగలేసే'** వ్యక్తులను ప్రత్యక్షంగా చూస్తారు. నిత్యం నాగసింధూరం నొసటిన ధరించండి. పరిమళ గంధం, పరిమళ జువ్వాది పూజలో ఉపయోగించండి. ఆర్థికప్రయోజనాలు కలిగిన బాటలో మీ ప్రమేయం లేకుండానే ప్రయాణిస్తారు. కళాసాహిత్య రంగాలలో మంచి గుర్తింపు లభిస్తుంది. ఇది కేవలం వినోదమే కాకుండా జీవితానికి ఉపయోగపడుతుంది. పూర్వీకులు రాసిన డాక్యుమెంట్లలో లోపాల వలన

ఇబ్బంది పెడతాయి, దాయాదుల వల్ల నష్టపోతారు. ఇరవై శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి తదుపరి అఘోరపాశుపత హోమం చేయించండి, కాలభైరవ రూపు ధరించండి. విద్యార్థినీ, విద్యార్థులు నిత్యం జ్ఞానచూర్ణాన్ని సేవించండి, సరస్వతీ తిలకాన్ని నొసటన ధరించండి. మనస్సు విప్పి మాట్లాడటం వల్ల ఎలాంటి ఇబ్బందులు ఎదురవుతాయో అనుభవపూర్వకంగా తెలుసుకుంటారు. శుభకార్యాల పూర్వకంగా బంధువులకు సహాయం చేస్తారు, ఇబ్బందికరంగా మారిన పెళ్ళిని కష్టతరంగా పూర్తిచేస్తారు. బంధువులలో ఐకమత్యం కొరకు మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మీరు సాధించిన పురోగతి, ఆర్థికస్థితి, పేరుప్రతిష్ఠలు చూసి సంతోషించే ఏకైక ఆత్మీయుడు దూరం అవడం మీ తీవ్ర మనోవేదనకు కారణం అవుతుంది. రావలసిన ధనం వసూలు చేసుకోవడానికి ప్రత్యమ్నాయమార్గాలు వెతుక్కుంటారు. కుటుంబంలో మరొకరి సంపాదన ప్రారంభం అవుతుంది, ఆర్థికబలం పెరుగుతుంది. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు లాభిస్తాయి, రియల్ ఎస్టేట్ వ్యాపారం లాభిస్తుంది. ముఖ్యమైన డాక్యుమెంట్స్, సువర్ణాభరణాల గురించి భద్రత ఆవశ్యం. పోలీస్ స్టేషన్ స్థాయి పరిష్కారాలు ఇష్టం లేకపోయినా స్నేహితులను ఆదుకోవడానికి మీ పలుకుబడిని ఉపయోగించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ప్రేమవివాహాలకు, కులాంతర వివాహాలను మీరు సరిపెట్టుకోలేరు, ఈ విషయంలో ఎక్కడా రాజీపడరు. కొన్ని సందర్భాలలో చేతినిండా పని ఉంటే బావుండు, క్షణం తీరికలేకుండా ఉంటే బాగుండు అనిపిస్తుంది. కొన్ని వ్యాపార సంబంధమైన వ్యాపారాలకు మీరు నాయకత్వం వహిస్తారు, మంచి లాభాలు సాధిస్తారు. లాభాలు పంచుకునే విషయంలో పనిచేయని వ్యక్తులకు, సోమరిపోతులకు భాగాలు ఇవ్వాల్సి వస్తుంది. ఇలాంటి పరిస్థితి మీ మనోవేదనకు కారణం అవుతుంది. దొంగకు, దొరకు ఒకే న్యాయం, ఇది మీరు జీర్ణించుకోలేకపోతారు. కుటుంబసభ్యుల సంతోషం కోసం విలువైన ఆభరణాలు కొనుగోలు చేస్తారు. ఆధ్యాత్మిక, చారిత్రాత్మక ప్రదేశాలను సందర్శిస్తారు. సివిల్ సర్వీస్‌లలో విజయం సాధించడానికి ఎంతో కష్టపడతారు, కష్టానికి తగిన ఫలితం లభిస్తుంది, మనస్సుకు ఊరట కలుగుతుంది. మీ మీద ఉన్న బాధ్యతలు స్నేహితుడిలా గుర్తు చేస్తాయి. వివాహాది శుభకార్యాల విషయంలో కుటుంబపరంగా సమష్టి నిర్ణయం తీసుకుంటారు. ఎక్కువగా ఆలోచించకుండా శుభకార్యాలను ఘనంగా నిర్వహిస్తారు. చిన్నాచితకా వ్యాపారాలు, చేతివృత్తులు, ఆధ్యాత్మిక సంబంధమైన వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. మీరు నమ్ముకున్న రాజకీయనాయకుల వల్ల ఆర్థికప్రయోజనాలు లభించవు. రాష్ట్రస్థాయి పోటీపరీక్షలలో రెండవసారి విజయం సాధిస్తారు. ప్రతి పనిని ఇతరుల సహాయంతో చేసి వచ్చిన లాభాలలో వారికి వాటా ఇచ్చి, వారిని సంతృప్తిపరుస్తారు. వ్యక్తిగత బలహీనత కలిగిన అధికారి మీ చేతికి చిక్కుతాడు. అతని సహాయంతో కొన్ని ముఖ్యమైన పనులను సాధించుకుంటారు. నమ్మకం లేకపోయినా, ఎదుటివారు మంచివారు కాదు అని తెలిసినా వాళ్ళనే నమ్మి కార్యక్రమాలు నడపాల్సివస్తుంది. మీ భాగస్వాముల తప్పుడు నిర్ణయాల వల్ల, అనాలోచిత చర్యల వల్ల ఎంతో ప్రయోజనం పొందాల్సిన ఓ వ్యవహారంలో కొద్దిపాటి లాభాలు మాత్రమే దక్కుతాయి. వాస్తవాలు గ్రహించి నిర్ణయాలు తీసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మీ శత్రువర్గం ఎప్పుడూ మీ కార్యక్రమాలపై, మీరు చేసే పనులపై నిఘా ఉంచుతారు. మీ ఆత్మీయవర్గం మీ ఎదుగుదలను సహించలేరు. మీ ఎదుగుదలలో మీరు తొక్కిన అడ్డంకులను ప్రచారం చేస్తారు, విమర్శిస్తారు. స్త్రీల సహాయ నిరాకరణ వల్ల, వాళ్ళతో ఏర్పడిన విభేదాల వల్ల కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు పూర్తిచేయడానికి ఆటంకాలు ఏర్పడతాయి. అంతరాత్మ ప్రబోధ అనుసారం కొన్ని కార్యక్రమాలను

వదిలివేస్తారు. కొన్ని ప్రయోజనాలు వదులుకొని మీ పెద్దరికం, మర్యాద సమాజంలో నిలుపుకుంటారు. మీడియా ప్రతినిధులతో సాంగత్యం ఏర్పడుతుంది. ఇల్లు అద్దెకు ఇచ్చి చికాకులకు లోనవుతారు. స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకోలేని విధంగా ప్రతిబంధకాలు ఏర్పడతాయి. ఉన్నతస్థాయి వ్యక్తులకు మీరు వ్రాసిన లేఖలు మంచి ఫలితాలను ఇస్తాయి. ఒక యూనిట్‌గా చేసే వ్యాపారాలు అభివృద్ధిపథంలో నడుస్తాయి. **"అనంతకాల గమనంలో ఎన్నో మధురానుభవాలు, మరెన్నో చేదు అనుభవాలు ఇదే జీవితం"** ఇలాంటివి మనస్సులో కలుగుతాయి, కష్టసుఖాలను సరిసమానంగా చూస్తారు. ఏది కోల్పోయినా మనోధైర్యం మాత్రం కోల్పోరు. వైఫల్యాల నుండి నేర్చుకున్న పాఠాలు విజయవంతమైన దిశకు నడిపిస్తాయి. కొన్ని కీలకమైన విషయాలు విజయవంతం అవుతాయి, దాని తాలూకు ఫలితాలు చేతికి అందడానికి సాంకేతిక కారణాలు అడ్డువస్తాయి, శక్తికి మించి శ్రమిస్తారు. అందరూ కూడి వచ్చి సహాయం చేస్తామని చెపుతారు, సమస్యలు మొదలుకాగానే మొహం చాటువేస్తారు. కష్టాలు ఎప్పుడూ ఒంటరిగా రావు, రెండో మూడో కలిసే వస్తాయి. వృత్తిఉద్యోగాలకు సంబంధించి అధికారులు చికాకు పెడుతున్న తరుణంలో అండగా ఉంటాడు అని భావించిన వ్యక్తి విరోధంతో దూరం కావడం జరుగుతుంది. ఈ సమస్యల వలయం నుంచి బయటకు రావాల్సిన స్థితిలో ఆర్థికవత్తిడులు, ఆరోగ్యం, న్యాయపరమైన సమస్యలు వస్తాయి. చాలా మనోవేదనకు గురి అవుతారు. స్త్రీల సహకారం, వృద్ధుల సహకారం వలన కొంత ఊరట చెందుతారు. మీకు ఈ రకమైన ఇబ్బందులు రావడానికి మూడొంతులు మీ ఆత్మీయవర్గమే కారణం. మానవాతీత శక్తులు బాధిస్తాయి. కొంతమంది వ్యక్తులు సలహాలు చెపుతారు, వాటిని మీరు పట్టించుకోరు. మహాతీర్థం పొడితో అభిషేకం చేయండి.

## స్త్రీలకు ప్రత్యేకం :

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు బాగుంది. జీవితంలో మళ్ళీ నూతన శకం ప్రారంభం అవుతుంది. సమాజంలో పేరు సంపాదించాలన్న మీ తపన నెరవేరుతుంది. విద్యా, సాంకేతికరంగాలలో అనుకున్న అభివృద్ధిని సాధిస్తారు. పోటీ పరీక్షలలో మంచి ఫలితాలు సాధిస్తారు. ప్రతి విషయంలోనూ చాలా జాగ్రత్తగా ఉంటారు. ఎవరినీ నమ్మకంలోకి తీసుకోరు. స్త్రీల అందం కొన్ని సందర్భాలలో శాపం అవుతుంది. మీరు కోరుకున్న వివాహం చేసుకోలేరు, పెద్దలు కుదిర్చిన సంబంధం చేసుకోవడానికి మనస్సు అంగీకరించదు. నీచ మనస్తత్వం కలవారు మీ వైవాహికజీవితాన్ని ఇబ్బందులకు గురి చేస్తారు. మార్పురాని మనిషిని మార్చడానికి ప్రయత్నించి విఫలం అవుతారు. ఓర్పు, సహనం నశిస్తుంది, కాలం దొర్లుతుంది, మనశ్శాంతి ఉండదు. ప్రతిరోజు ప్రతినిత్యం అరటినార వత్తులతో, అష్టమూలికా తైలంతో ఇష్టదైవం ఎదుట దీపారాధన చేయండి. సుమంగళి పసుపునే వాడండి. కొన్ని సందర్భాలలో చట్టపరమైన విషయాల గురించి ఆలోచిస్తారు. ఆత్మీయులతో విడిపోవడం జరుగుతుంది (కొంతమంది విషయంలో). పునర్వివాహ ప్రయత్నాలు చేసేవారికి అనుకూలమైన ఫలితాలు వస్తాయి. సెల్ఫ్ డ్రైవింగ్ విషయంలో కొన్ని జాగ్రత్తలు అవసరం. ఆధ్యాత్మిక కార్యక్రమాలు, ప్రసంగాలు మిమ్మల్ని ఆకర్షిస్తాయి. దొంగస్వామీజీల వల్ల, దొంగబాబాల వల్ల నష్టపోతారు. టెండర్లు, వర్క్ ఆర్డర్లు లభిస్తాయి. అన్యభాషలు నేర్చుకుంటారు. దేనికీ ఇబ్బందిలేని పరిస్థితి ఏర్పడుతుంది. శాశ్వతంగా దూరమైన వ్యక్తుల జ్ఞాపకాలు మనోవేదనకు కారణం అవుతాయి, కంటనీరు తెప్పిస్తాయి.

మీ మానసిక వేదనను పట్టించుకునేవారు లేరనే భావన కలుగుతుంది. పిల్లలు చేసిన పొరపాట్లను మనస్సులో దిగమింగి వాళ్ళను సరైన మార్గంలో నడిపిస్తారు. నిత్యం ఆరావళి కుంకుమతో మహాలక్ష్మిని పూజించండి. కఠినమైన సమస్యలకు ఎదురొడ్డి ధైర్యంగా పోరాడతారు. పట్టుదల కలిగిన స్త్రీగా పేరు వస్తుంది. రాజకీయాలు లాభిస్తాయి. వస్త్ర వ్యాపారాలు, బ్యూటీపార్లర్ల వ్యాపారం సాధారణంగా ఉంటాయి. కొన్ని విషయాలలో జీవితభాగస్వామి సహాయసహకారాలు లభించవు. ఉపాధ్యాయ, అధ్యాపక వృత్తులలో ఉన్నవారికి పేరుప్రతిష్ఠలు లభిస్తాయి. కళాసాంస్కృతిక రంగాలలో రాణిస్తారు. ఫిక్స్‌డ్ డిపాజిట్ల ద్వారా వచ్చే ఆదాయం ఊరట కలిగిస్తుంది. మీ ఆర్థికస్థితి బంధువుల అసూయకు కారణం అవుతుంది. రహస్యంగా సహోదరసహోదరి వర్గాన్ని ఆదుకుంటారు. సర్దుకుపోయే మనస్తత్వాన్ని ఏర్పరచుకోండి. ముక్కు మీద కోపం నష్టం తెచ్చిపెడుతుంది. విదేశీయాన యత్నాలు, ఉన్నతవిద్యను అభ్యసించాలనే మీ కోరిక నెరవేరుతుంది. గ్రీన్ కార్డ్ కోసం ప్రయత్నాలు చేసే వారికి గ్రీన్ కార్డు లభిస్తుంది. మోకాళ్ళ నొప్పులు, గైనకాలజీలకు సంబంధించిన ఆరోగ్య సమస్యలు సంభవిస్తాయి. వ్యాపార సంబంధమైన విషయాలు, వృత్తిఉద్యోగాల సంబంధమైన విషయాలు, ఆర్థిక స్థితి బాగుంటాయి. సంతాన పురోగతి మానసిక సంతోషానికి కారణం అవుతుంది. సమాజంలో అన్ని విధాల ఎదుగుదల బాగుంటుంది. అయితే ఈ ఎదుగుదల ఎవరికోసం, చూసి ఆనందించే వారే కనుమరుగయ్యారు, ఇలాంటి భావనలతో సుఖపడటానికి అవకాశం ఉన్నా సుఖపడలేరు. డబ్బు ముఖ్యమైనదే కానీ అంతకంటే ముఖ్యమైనవి చాలా ఉన్నాయని తెలుసుకుంటారు. లోకజ్ఞానం లోపించిన విషయాలకు, తెలియని సంగతులకు తగిన మూల్యం చెల్లించాల్సి వస్తుంది. ఎప్పుడూ ఎవరి సహాయం ఆశించని మీరు ఇతరుల సహాయం కోసం పరితపిస్తారు. నరదృష్టి అధికంగా ఉంది. నాగసింధూరాన్ని నొసటన ధరించండి. సిద్ధగంధంతో మీ ఇష్టదైవానికి అభిషేకం చేయండి. విలువైన వస్తువుల భద్రత విషయంలో అశ్రద్ధ చేస్తారు, ఇందువలన అపశ్రుతులు ఏర్పడతాయి. కోర్టుతీర్పులు సంతృప్తికరంగా ఉండవు. స్థిరాస్తులకు సంబంధించిన విషయంలో వైరాగ్యం ఏర్పడుతుంది, అయినా మీ హక్కులు పదిలంగా ఉంటాయి. కొంతమందికి వైవాహికజీవితంలో ఒడిదుడుకులు ఏర్పడతాయి. రక్తసంబంధీకులను కూడా శత్రువులను చూసినట్లుగా చూస్తారు. మీ శక్తిసామర్థ్యాలకు తగిన విధంగా అవార్డులు, రివార్డులు లభిస్తాయి, విమర్శల ప్రపంచాన్ని లెక్కచేయరు. అపనిందలకు బెదిరిపోక ప్రతిష్ఠాత్మకమైన ఉద్యోగ బాధ్యతలని సక్రమంగా నిర్వర్తించి, కీర్తిప్రతిష్ఠలు సాధిస్తారు. ప్రకృతి వైపరీత్యాలవల్ల, మారుతున్న రాజకీయ, సామాజిక పరిస్థితుల వల్ల మీ ప్రయోజనాలు వాయిదా పడతాయి. మొత్తం మీద ఈ సంవత్సరం బాగుంది. నవగ్రహ దోష నివారణార్థం సర్వదోష నివారణ చూర్ణంతో సర్వరక్షా చూర్ణం కలిపి స్నానమాచరించండి. అవివాహితులైన వారికి వివాహప్రాప్తి, సంతానం లేని వారికి సంతానప్రాప్తి కలుగుతుంది.







# 2017-2018 లో మిథునరాశి ఫలితములు

| ఆదాయం - 5 | వ్యయం - 5 | రాజ - 3 | అవ - 6 |
|---|---|---|---|

**మృగశిర 3, 4 పాదములు, ఆరుద్ర 4 పాదములు, పునర్వసు 1, 2, 3 పాదములందు పుట్టినవారు "కా, కి, కూ, ఖం, జ్ఞ, ఛ, కే, కో, హా" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు మిథునరాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**మిథునరాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం బాగుంది. ఆర్థికంగా ఎదుగుతారు. పేరుప్రతిష్ఠలు పెరుగుతాయి. నూతన అవకాశాలను చక్కగా ఉపయోగించుకొంటారు. ఆరోగ్యం బాగుంటుంది. ప్రతి విషయంలోనూ ముందు జాగ్రత్తలు తీసుకుంటారు. మీ పాండిత్యం అందరి చేత ప్రశంసించబడుతుంది. వృద్ధులను, తల్లిదండ్రులను చూడటం, ప్రేమగా చూడటం ధర్మమే అవుతుంది. కానీ ఇది మీ విషయంలో పెద్ద అపరాధంగా కనిపిస్తుంది. కలియుగ ధర్మానికి ఇది పరాకాష్ట. వివాహం చేసుకోవడంతోనే అన్ని బంధాలు తెగిపోతాయా? స్వేచ్ఛ నశించి పోతుందా? జన్మనిచ్చిన వారికి, తోడబుట్టిన వారికి సహాయం చేయటం నేరం అవుతుందా? మొదలైన ప్రశ్నలకు అంతరాత్మ మనస్సుకు సమాధానం చెప్పలేదు. సంతానపురోగతి బాగున్నప్పటికీ వారిలో ఒకరి ప్రవర్తన ఇబ్బందికరంగా మారుతుంది, తగిన జాగ్రత్తలు తీసుకుంటారు. శుభకార్యాల విషయంలో కఠినంగా, దృఢంగా వ్యవహరిస్తారు. బంధువులలో వచ్చిన ఒక సంబంధాన్ని తిరస్కరిస్తారు. వృత్తిఉద్యోగాలలో పురోగతి ఉన్నా ఏదో అసంతృప్తి వెన్నాడుతుంది. గతం గుర్తుకు వస్తే ఇప్పుడు ఎంత బాగున్నామో అర్థం అవుతుంది. భగవద్గీతను మీరు చదివినా చదవకపోయినా శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లు మీ కర్తవ్యం, కృషి నిర్వర్తిస్తారు. శక్తి వంచన లేకుండా పనిచేస్తారు, ఫలితం కోసం ఎదురు చూడరు. శల్య సారథ్యం చేసేవారు ఎక్కువ అవుతారు. వాళ్ళ మాటలు పట్టించుకోరు. హేళన, మితిమీరిన చతురోక్తుల వలన సున్నితమైన మనస్తత్వం కలిగిన వారికి దూరం అయ్యే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. భాగస్వామ్య వ్యాపారాలలో నిర్మొహమాటంగా వ్యవహరిస్తారు. విందు, వినోదాలలో గతంలో మాదిరిగా ఖర్చు చేయరు. కార్యాలయంలో మీరు చేస్తున్న అదనపు కృషికిగాను తగిన ప్రతిఫలం ఇవ్వాలని కోరుతారు. అడ్డమైనవాళ్ళకి చేతికి ఎముక లేకుండా విచ్చలవిడిగా సహాయం చేసిన అధికారులు, మీదాకా వచ్చేటప్పటికి చదివిన ధర్మశాస్త్రాలలోని సారాంశం గుర్తుకు వస్తుంది. ఇతరులకి వర్తించని న్యాయసూత్రాలు, ధర్మసూత్రాలు మీకు వర్తింపచేస్తారు. అధికారులకు బదిలీ చేయడమే సామర్థ్యం, కాలమే సామర్థ్యానికి కొలమానం అవుతుంది. **"గుట్టమే పోయింది ఇక నాదా పోయింది"** అని బాధపడడం దేనికి అని సరిపుచ్చుకుంటారు. విలాసవంతమైన జీవితం గడపాలని భావిస్తారు. మీ అభిరుచి మేరకు గృహంలో కొన్ని మార్పులు, చేర్పులు

**సీతవల్ల భూలోకం పావనమైంది.**

చేస్తారు. విలాసవంతమైన వాహనాన్ని కొనుగోలు చేస్తారు. ఫైనాన్స్ స్కీంకి దూరంగా ఉండండి. మీరు పెట్టుబడి పెట్టిన చట్టబద్ధత లేని ఒక ఆర్థిక సంస్థ దివాళా తీస్తుంది. గృహంలోనూ, ఆఫీసులోనూ భద్రతకు అధిక ప్రాముఖ్యతను ఇవ్వాలి. ముఖ్యమైన టెండర్ పనులు చేతికి అందివస్తాయి. ప్రభుత్వానికి సంబంధించిన వర్క్ ఆర్డర్లు లభిస్తాయి. వీధి తగాదాలు, పోలీస్ స్టేషన్ స్థాయి పరిష్కారాలకు దూరంగా వుంటారు. ఇందుకోసం కొన్ని ప్రయోజనాలు వదులుకుంటారు, క్రమంగా మీలో ఉన్న లోపాలను తగ్గించుకుంటారు. పుస్తక పఠనం వల్ల మంచి విషయాలు తెలుసుకుంటారు. పునర్వివాహ ప్రయత్నాలు చేసుకునే వారికి ప్రయత్నాలు ఫలిస్తాయి. సంతానం లేని వారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది. క్రీడా జీవితంలో అనుకోని మలుపులు వస్తాయి. కళాసాహిత్య, సాంస్కృతిక రంగాలలో మీకు గుర్తింపు లభించదు. దీర్ఘకాలికంగా పాతుకుపోయిన అధికారుల రాజకీయాలకు మీరు బలిపశువు అవుతారు. కుళ్ళు రాజకీయాలు మీపై ప్రయోగిస్తారు. బహుమతులు రావలసిన చోట అందరూ మీరే గెలిచారని భావించిన క్షణాలలో రాజకీయాలు చోటుచేసుకుంటాయి, మీడియాపరంగా న్యాయం జరుగదు. మారణాయుధాల లైసెన్సుల కోసం అర్జీలు దరఖాస్తు చేస్తారు. మీ కృషివల్ల కొంతమంది వ్యక్తులకు క్షమాభిక్ష, విడుదల లభిస్తాయి. సహోదరవర్గానికి చెందవలసిన ఆస్తులను వారి పేరు మీద రిజిస్ట్రేషన్ చేయిస్తారు. విదేశాలలో ఉన్న మీ ఆత్మీయవర్గం స్వదేశానికి రాబోతున్నారన్న సమాచారం అందుతుంది. వాళ్ళకు మీరు ఇవ్వాల్సిన ధనాన్ని సిద్ధం చేయాల్సిన పరిస్థితి, పరోక్షంగా సూచిస్తుంది. మీరు ఆశలు పెట్టుకున్న వంశాంకురాలు, సంతానం పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. ద్విచక్ర వాహనం కొనిపెట్టమని పిల్లలు ఎంతగా వత్తిడి చేసినా ద్విచక్రవాహనం కొనవద్దు. జీవితభాగస్వామి తోడ్పాటు లభిస్తుంది. ఆరోగ్యకరమైన, ఐకమత్య పూరితమైన వాతావరణం ఏర్పడుతుంది. మీరు నడుపుతున్న సేవా సంస్థకు అవార్డు లభిస్తుంది. దాయాదులతో ఏర్పడిన సమస్యలు పరిష్కారం అవుతాయి. ఏది ఏమైనా దేశకాలమానానికి అనుగుణంగా మీ అభిప్రాయాలను, సిద్ధాంతాలను మార్చుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మీతో పోటీ పెట్టుకున్న వాళ్ళను దాటిపోయి మీ ఆధిక్యతను నిలబెట్టుకుంటారు. ఇద్దరు స్త్రీల మధ్య ఏర్పడిన వివాదాలను పరిష్కరించడానికి ఎంతో శ్రమిస్తారు, కానీ ఫలితం ఉండదు. ఒరిగిపోయిన ఓ జీవి జ్ఞాపకాలు అదే పనిగా గుర్తుకురావడం వల్ల చెప్పలేని మానసిక వేదన, హృదయభారం, వైరాగ్యం, నిర్వేదం, నిరుత్సాహం కలిగిస్తాయి. కొన్ని సందర్భాలలో ఇంకా ఏమి సాధించాలని జీవిస్తున్నామన్న భావన మనస్సును వేధిస్తుంది. ఎప్పుడో గతించిపోయిన విషాదఘోష ఇంకా చెవులలో మారు మ్రోగుతున్నట్లు అనిపిస్తుంది. భగవంతుడి సంకల్పం ముందు మానవుడి శక్తిసామర్థ్యాలు, అభ్యర్థనలు, విన్నపాలు, ప్రార్థనలు, పూజలు పనిచేయవన్న కఠోర సత్యాన్ని తెలుసుకుంటారు. కనుమరుగైన కొన్ని సెంటిమెంట్ వస్తువులు, డాక్యుమెంట్లు తిరిగి మీకు దొరుకుతాయి. మీకు ఏమాత్రం సంబంధంలేని వివాదస్పద విషయంలో మీ పేరు వినబడుతుంది. వ్యాపారంలో నూతన ఒప్పందాలు కుదుర్చుకుంటారు. వ్యాపారపరంగా నూతన బ్రాంచీలను ఏర్పాటు చేస్తారు, కొత్త భాగస్వాములను కనుగొంటారు. నిర్మాణ సంబంధమైన పనులలో రాజీపడరు. వాలెంటరీ కోసం ప్రయత్నిస్తారు. చాలామంది ఛాదస్తం అని అవహేళన చేసినా మీ పద్ధతి మార్చుకోరు, అదే మీకు మంచి కీర్తి ప్రతిష్ఠలను తెచ్చిపెడుతుంది. సమాజంలో నిజాయితీపరుడుగా ప్రఖ్యాతి వస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలను

విజయవంతంగా పూర్తిచేస్తారు. ఆధ్యాత్మిక గ్రంథాల కోసం, సీరియల్స్ కోసం ధనాన్ని విశేషంగా ఖర్చుచేస్తారు. మీకు నచ్చిన ఆధ్యాత్మిక గ్రంథాలను ప్రింటింగ్ చేయిస్తారు. దొంగస్వామీజీల వల్ల, దొంగబాబాల వల్ల నష్టపోతారు. నష్టపోయిన విషయాన్ని చెప్పుకుంటే పరువుపోతుందని మిన్నకుంటారు. కంటిచూపు మందగించే అవకాశం ఉంది, ముందు జాగ్రత్తలు తీసుకోండి. ఒంటరిగా మద్యపానం తీసుకునే విధానానికి స్వస్తి పలకండి (దీని అర్థం జంటగా తాగమని కాదు). స్త్రీ సంతానం పట్ల విశేషమైన ప్రేమతో విలువైన బహుమతులను కొనిస్తారు, స్థిరాస్తులలో వాటా ఇవ్వాలని నిర్ణయించుకుంటారు. మీ ద్వారా సహాయం పొంది ఉన్నత స్థానంలో ఉన్న వ్యక్తులు, అధికారులు, రాజకీయనాయకులు సమయం వచ్చినప్పుడు మీకు అండగా నిలుస్తారు. సంతానం విషయంలో గొప్పగా సహాయం చేస్తారు. మీ వ్యాపారంలో ఓ స్త్రీ భాగస్వామ్యం కలిసివస్తుంది. మిమ్మల్ని పొగిడేవాళ్ళ పట్ల జాగ్రత్తగా ఉండండి. వాళ్ళ పొగడ్తల వెనుక ఉన్న ఆంతర్యాన్ని గ్రహించండి. మంచిగా ఉంటూ కీలక సమయంలో నమ్మకద్రోహం చేస్తారు, మీ అభివృద్ధి పట్ల వాళ్ళకి ఎనలేని ద్వేషం ఉంటుంది, సాక్షిభూతం అయిన ఈ విషయాన్ని మీరు గ్రహించలేరు. యూనియన్ కార్యక్రమాలలో మీరు చురుకుగా పాల్గొంటారు. ముఖ్యమైన సమావేశాలు, సభలు నిర్వహిస్తారు. సభలను నిర్వహించడంలో మీకైన ఒక ప్రత్యేకత ఉంటుంది, అది అందరిలోనూ ప్రశంసింపబడుతుంది. ప్రింట్ మీడియా ద్వారా, ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా నూతన అవకాశాలు కలిసివస్తాయి. వంశపారంపర్య ఆస్తులు కలిసివస్తాయి, అందులో అధికారం లేని వారికి కొంత వాటా పంచి ఇస్తారు. మీ ఔదార్యం, మీ దానధర్మాలే మిమ్మల్ని ప్రతి విషయంలోనూ ఆదుకుంటాయి. కొంతమంది ఉన్నత స్థాయి వ్యక్తులతో బాహాబాహి పోరాటం తప్పదు. మీ స్థాయికి మించిన పనులను చేపడతారు, మీ పెట్టుబడి కేవలం పట్టుదల, మొండి ధైర్యం. అప్పుడప్పుడు కుటుంబ సంబంధ విషయాలు కొంత అసంతృప్తికి దారితీస్తాయి. దైవికం అనే పొడితో వ్యాపార ప్రాంగణంలోనూ, గృహంలోనూ ధూపం వేయండి. మహాతీర్థం పొడితో మీకు ఇష్టమైన దేవుడికి గాని, దేవతకు గాని అభిషేకం చేయండి. గతంలో ఇతరులకు చేసిన సహాయానికిగాను ఇప్పుడు బాధపడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కుటుంబంలో మరొకరి సంపాదన పెరుగుతుంది, మంచి ఉద్యోగం వస్తుంది. ఇది మీకు ఎంతో ఊరట కలిగిస్తుంది. కోర్టుకేసుల విషయాన్ని తేలికగా తీసుకోవద్దు, ప్రతి విషయంలోనూ జాగ్రత్త తీసుకోవడం మంచిది. వివాదస్పదమైన అంశాలని పరిష్కరించుకోగలుగుతారు. మీపై నిష్కారణమైన నిందలు మోపినా అవి అబద్ధాలు అని నిరూపిస్తారు. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు లాభిస్తాయి. ఫర్నిచర్, గృహసంబంధమైన పరికరాలు, హోమియోపతి, ఆయుర్వేదం, హోటళ్ళు, బేకరీలు నడిపేవారికి, ఆధ్యాత్మిక రంగాలలో ఉన్నవారికి, జ్యోతిష్కులకు అనుకూలంగా ఉంది. రాజకీయనాయకుల సాన్నిహిత్యం లాభిస్తుంది. ఈ రాశిలో జన్మించిన విద్యార్థినీ, విద్యార్థులకు కాలం అనుకూలంగా ఉంది. నిత్యం జ్ఞానచూర్ణాన్ని సేవించండి. సరస్వతీ తిలకాన్ని నొసటన ధరించండి, మెరిట్ మార్కులు సాధిస్తారు. ఏ సందర్భంలోనూ ఇతరులతో పోల్చుకోవద్దు, ఆత్మన్యూనతా భావం ఏర్పర్చుకోవద్దు. కుటుంబసభ్యులతో కలిసి సుందరమైన ప్రదేశాలను సందర్శిస్తారు, తీర్థయాత్రలు చేస్తారు. యూనియన్లు, క్లబ్బులు, ప్రతిష్ఠాత్మకమైన సేవాసంస్థలలో మీకు స్థానం లభిస్తుంది. ప్రజాసంబంధాలు మెరుగుపరుచుకోవడానికి వచ్చిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకొంటారు.

ఏనాడో చేసిన పనికి ఈనాడు మూల్యం చెల్లించుకోవాల్సిన పరిస్థితి వస్తుంది. సమస్యలను వదిలిపెట్టి పారిపోవడానికి వీలు లేదు, సైంధవుడిలా అడ్డుపడి పోరాటం చేయడం మినహా మరో దారి లేదు, భీష్ముడి వలే అస్త్రసన్యాసం చేయడానికి కుదరదు. మీ కుటుంబ విషయాలలో, వ్యక్తిగత విషయాలలో ఇతరుల మితిమీరిన జోక్యం వ్యతిరేక ఫలితాలకు దారితీస్తుంది, జాగ్రత్త వహించండి. పూజాపునస్కారాలలో పరిమళ గంధాన్ని ఉపయోగించండి. స్వార్థం అనే రెండు అక్షరముల విషపు మాట పవిత్రమైన స్నేహాన్ని విధ్వంసం చేస్తుంది. **"స్వార్థం స్నేహానికి కొత్త భాష్యాలు, వక్రభాష్యాలు నేర్పుతుంది. స్నేహం అంటే వ్యాపారం, డబ్బు అని తేల్చి చెబుతుంది".** ఈ రకమైన అనుభవాలు మీ మనస్సును బాధిస్తాయి. స్నేహం అంటేనే భయం కలుగుతుంది, చాలామంది స్నేహితులకు దూరంగా ఉంటారు. ఆగిపోయిన నిర్మాణ పనులను పునః ప్రారంభిస్తారు. చిన్ని విషయాలకు కూడా ఎక్కువగా స్పందిస్తారు. కొత్తవారితో కలుపుగోలుతనంగా ఉంటారు. ఎట్టి పరిస్థితిలోనూ అనవసరమైన విషయాలలో తలదూర్చరు, వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. దురాశకు పోయి మోసపోయిన మీ ఆత్మీయులను ఓదారుస్తారు, మీ చేతిలో ఉన్న సహాయాన్ని అందిస్తారు. చిన్నిపాటి ప్రయోజనాలకు ఎక్కువగా కష్టపడాల్సి రావడం మానసిక అశాంతికి కారణం అవుతుంది. సనాతన సాంప్రదాయాలకు విలువ ఇవ్వడం మంచిదని గ్రహిస్తారు. మీ ఇష్టదైవానికి లేక మీ ఇష్టదేవతకు సిద్ధగంధంతో అభిషేకం చేసినట్లయితే శుభకరం. ప్రేమ పెళ్ళిళ్ళను నిర్మోహమాటంగా తిరస్కరిస్తారు. కీళ్ళ నొప్పులు, కాళ్ళనొప్పులు, ఎలర్జీ సమస్యలు బాధిస్తాయి. కుటుంబంలో ఐకమత్యం లేని కారణం చేత సంతానాన్ని సక్రమమైన దారిలో నడిపించలేరు, వాళ్ళను పట్టించుకోలేరు. అయితే ఈ సమస్య ఒక నెల రోజులు మాత్రమే బాధిస్తుంది, తదుపరి సంతాన పురోగతి బాగుంటుంది. ఇతరులు మీకు ఇచ్చిన చెక్కులు చెల్లవు, ఈ విషయంలో గట్టిగా మాట్లాడలేని పరిస్థితి ఏర్పడుతుంది. మార్షల్ ఆర్ట్స్ పట్ల మనస్సు మొగ్గు చూపుతుంది, నేర్చుకోవాలనే తపన కూడా నెరవేరుతుంది. పూజా కార్యక్రమాలలో జువ్వాది పరిమళ గంధాన్ని వాడండి, చాలా మంచిది. వడ్డీ వ్యాపారం, చీటీ వ్యాపారం లాభించదు, స్పెక్యులేషన్‌కి దూరంగా ఉండండి. పన్నులు వసూలు చేసే అధికారులు మీ స్నేహితులు కావడం వల్ల మీ పొరపాట్లకు జరిమానా పడదు. మీరంటే ఏ మాత్రం పడనటువంటి ఉన్నతస్థాయిలో ఉన్న అధికారి ఆకస్మికంగా మిమ్మల్ని పిలిపించి అనుకూలమైన ఉత్తర్వులు ఇవ్వడం జరుగుతుంది, మీకు నమ్మలేని ఆశ్చర్యం కలుగుతుంది. కొంతమంది వ్యక్తులతో అనుబంధాలను మీరు తెంచుకోవాలని ప్రయత్నించినా పెనవేసుకున్న మమతానురాగాల వల్ల కఠినంగా ప్రవర్తించలేకపోతారు. కాంట్రాక్టులు, సబ్ కాంట్రాక్టులు, లీజులు పొడిగింపబడతాయి. మీకు తెలియకుండా మీ భాగస్వాములు దిక్కుమాలిన నిర్ణయాలు తీసుకుని సంస్థకి చెడ్డపేరు తెస్తారు. స్థిరాస్తుల పంపకం వ్యవహారంలో పెద్దలు, బంధువులు మీకు అనుకూలంగా వ్యవహరిస్తారు. స్త్రీలతో విభేదాలు, స్త్రీల ఆరోగ్యం రెండూ మీకు చికాకు కలిగిస్తాయి. ఒకనాటి స్నేహితులు విరోధులు, పోటీదారులు అవుతారు. ఇతరుల రహస్యాలు తెలుసుకోవడంతో విజయం సాధిస్తారు. మీ రహస్యాలు బయటకి పొక్కకుండా చాలా జాగ్రత్తలు తీసుకుంటారు. షాపింగ్ కాంప్లెక్స్ మీద వచ్చే అద్దె వాటి నిర్వహణకే సరిపోతుంది. కలలో కూడా మీ మాట జవదాటని మీ రక్తసంబంధీకులు, కుటుంబసభ్యులు మీ మాట వినని పరిస్థితి ఏర్పడుతుంది. **'అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలనాడు కాదు'** అనే సామెత గుర్తుకు వస్తుంది. చాలా సందర్భాలలో మిమ్మల్ని మీరు రుజువు చేసుకోవలసి వస్తుంది. ప్రతిరోజు

లక్ష్మీవత్తులతో దీపారాధన, నాగసింధూరం ధరించడం చెప్పదగిన సూచన.

**స్త్రీలకు ప్రత్యేకం :**

మిథునరాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. ఆర్థికవిషయాలు బాగున్నాయి. మెడిసిన్, ఐఐటిలలో సీటు వస్తుంది. విద్యాసంబంధమైన విషయాలు, సాంకేతిక సంబంధమైన విషయాలు సానుకూలంగా ఉన్నాయి. వ్యాపార విస్తరణలో సన్నిహితులైన వారందరూ సహకరిస్తారు, అందువల్ల మంచి ఫలితాలు సాధించగలుగుతారు. అలంకార సామాగ్రి వ్యాపారాలు, బ్యూటీపార్లర్లు బాగుంటాయి. కొంతమంది మంచి ఫలితాలు సాధించగలుగుతారు. కొంతమంది వ్యక్తులలో ఎంత ప్రయత్నించినా వాళ్ళలో మార్పు రాదు, అలాంటి వాళ్ళను వదిలివేయడం మంచిది. సహోదరసహోదరి వర్గానికి అండగా ఉంటారు. కుటుంబ బాధ్యతలు పూర్తిగా నెరవేర్చలేదని బాధపడతారు. ప్రతిరోజు ఇష్టదేవత సన్నిధిలో అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. యోగా, మెడిటేషన్ వలన మంచి ఫలితాలు వస్తాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఏకాగ్రతగా చేస్తారు. దైవ కార్యక్రమాలకు, సామాజిక సేవా కార్యక్రమాలకు మీ వంతు సహాయం చేస్తారు. దొంగస్వామీజీలను, దొంగబాబాలను నమ్మి మోసపోతారు. కొన్ని సందర్భాలలో పెద్దల మాటను ధిక్కరించవలసి వస్తుంది. మీ జీవితాన్ని మీరే తీర్చిదిద్దుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. చిట్టీలు, ఫైనాన్స్‌లకు దూరంగా వుండండి. దివాళా తీసిన ఒక పెద్ద ఆర్థిక సంస్థ నుండి మీకు రావలసిన ధనం రాదు. డబ్బుల ఇచ్చే తతంగం మాత్రం జరుగుతుంది. ప్రభుత్వ సంబంధమైన లీజులు, కాంట్రాక్టులు పొడిగింపబడతాయి. ముఖ్యమైన అధికారులు మీకు అనుకూలంగా వ్యవహరిస్తారు. ప్రభుత్వపరమైన సబ్సిడీలు లభిస్తాయి. ప్రతి విషయంలోనూ కులం ప్రస్తావన అధికం అవుతుంది. జ్యేష్ఠ సంతానం విషయంలో ప్రత్యేకమైన జాగ్రత్తలు అవసరం అవుతాయి. టీవీ, సినీరంగాలలో రాణిస్తారు. వస్త్రవ్యాపారం, స్టేషనరీ, ఆహార సంబంధ వ్యాపారాలు సాధారణంగా ఉంటాయి. అందరికీ ఎన్నో విధాలుగా సహాయపడి చివరికి ఎవరికీ ఏమీ కాని వ్యక్తిగా మిగులుతారు. దీని గురించి మీరు పెద్దగా విచారించవలసిన అవసరం లేదు, ఎవరి తప్పు వాళ్ళు తెలుసుకుని అందరూ దగ్గరవుతారు. పూజాకార్యక్రమాలలో జువ్వాది పరిమళ గంధం, లక్ష్మి చందనం ఉపయోగించండి. లక్ష్మి చందనంతో లక్ష్మీదేవి పూజ మంచి ఫలితాన్ని ఇస్తుంది. కుటుంబంలోనూ, బంధువులలోనూ ఐకమత్యం కోసం విశేషంగా కృషి చేస్తారు, ఫలితాలు అనుకూలంగా ఉంటాయి. కళాసాహిత్య, సాంస్కృతిక రంగాలలో మీకున్న నైపుణ్యానికి తగిన గుర్తింపు, అవార్డులు లభిస్తాయి. భిన్న వాదనలతో విభిన్నమైన నడవడికతో నిర్దయగా ప్రవర్తించే మీ తీరు స్వంతవాళ్ళకు కూడా మింగుడుపడని అంశంగా మారుతుంది. వృత్తిఉద్యోగాల పరంగా మీ విధులు నీతిగా, నిజాయితీగా, సక్రమంగా నిర్వర్తిస్తారు. ఇది చాలామందికి నచ్చని అంశంగా మారుతుంది. కొంతమంది ఉన్నతాధికారులకు మీరంటే అసూయ కలుగుతుంది, ఉద్యోగపరంగా మీపై అన్యాయపరమైన నిర్ణయాలు తీసుకుంటారు. న్యాయస్థానాల వల్ల ఊరట కలుగుతుంది, కోర్టు ద్వారా మీకు జరిగిన అన్యాయాన్ని అడ్డుకుంటారు. అనువంశికంగా రావలసిన ఆస్తుల విషయంలో మీకు సమన్యాయం జరుగుతుంది. పునర్వివాహ ప్రయత్నాలు చేసే వారికి అనుకూలమైన ఫలితాలు సంప్రాప్తిస్తాయి. ప్రతిరోజు లక్ష్మీతామర వత్తులతో అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. కొంతమందికి బంధువులతో బంధుత్వం కలుస్తుంది, సమాజంలో

కుటుంబ ప్రతిష్ఠ పెరుగుతుంది. ఆరోగ్యం విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. హెయిర్ ఫాల్ ఇబ్బందిగా మారుతుంది. దీర్ఘకాలిక వ్యాధులు కలిగినవారు జాగ్రత్తగా ఉండవలసిన కాలం. గ్రీన్‌కార్డు కోసం ప్రయత్నించే వారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది, విదేశాలలో ఉద్యోగం చేసేవారికి మంచి ఉద్యోగం లభిస్తుంది. ఉద్యోగం గురించిన దిగులు సమసిపోతుంది. ఒకప్పుడు మిమ్మల్ని చులకన భావంతో చూసిన వారు మీకు భజనపరులుగా మారుతారు. వాళ్ళ స్వార్థప్రయోజనాలను పరిరక్షించుకోవడానికి, ఆర్థికపరమైన ప్రయోజనాలు పొందడానికి శతవిధాలా ప్రయత్నిస్తారు. **"ఆశ్చర్యం ! కాలం చాలా కఠినంగా నడుస్తున్నప్పుడు ఒక అదృష్టపు కెరటం వల్ల అన్ని సమసిపోతాయి. స్వప్రయోజనాల కోసం ఇంత నిర్లజ్జగా, నిసిగ్గుగా ఉంటారా"** ? అని దిగ్భ్రాంతి చెందుతారు. పూలమొక్కల వ్యాపారం, పాలవ్యాపారం, చేతివృత్తుల పనులు, గ్రూపుగా చేసే వ్యాపారాలు కలిసివస్తాయి. ఆరావళికుంకుమతో మహాలక్ష్మీదేవిని పూజించండి, నిత్యం నవగ్రహ దోష నివారణార్థం సర్పదోష నివారణ చూర్ణంతో సర్వరక్షా చూర్ణం కలిపి స్నానమాచరించండి, మంచి ఫలితాలు సంప్రాప్తిస్తాయి.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121



## సర్పదోష నివారణ చూర్ణము

సర్పదోష నివారణ చూర్ణముతో స్నానము చేస్తే సర్పదోషాలు నివృత్తి అవుతాయి. జాతకంలో ఉన్న సర్పదోషాలే గాక అనువంశికంగా వస్తున్న సర్పదోషాలు పోతాయి. 1. అనంత కాలసర్పదోషం 2. గుళికా కాలసర్పదోషం 3. వాసుకి కాలసర్పదోషం 4. శంఖపాల కాలసర్పదోషం 5. పద్మ కాలసర్పదోషం 6. మహాపద్మ కాలసర్పదోషం 7. తక్షక కాలసర్పదోషం 8. కర్కోటక కాల సర్పదోషం 9. శంఖచూడ కాలసర్పదోషం 10. ఘటక కాలసర్పదోషం 11. విషధార కాలసర్పదోషం 12. శేషనాగ కాలసర్పదోషం మొదలగు సర్ప దోషాలు పోతాయి. స్నానం చేసే నీళ్ళలో రెండు స్పూన్ల చూర్ణాన్ని వేసుకుని స్నానం చేయాలి. ఈ చూర్ణముతో స్నానము చేయడం వలన చాలా శుభప్రదం.

**గమనిక–** ఈ చూర్ణముతో తలస్నానం చేయరాదు.



# 2017-2018 లో కర్కాటకరాశి ఫలితములు

| ఆదాయం - 14 | వ్యయం - 2 | రాజ - 6 | అవ - 6 |
|---|---|---|---|

**పునర్వసు 4వ పాదము, పుష్యమి 1, 2, 3, 4 పాదములు, ఆశ్లేష 1, 2, 3, 4 పాదముల యందు పుట్టినవారు "హీ, హూ, హే, హో, డా, డీ, డూ, డే, డో" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు కర్కాటకరాశికి చెందినవారు.**

# 2017-2018 సంవత్సర ఫలితములు

**కర్కాటకరాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. ఆర్థిక సర్దుబాట్లు సక్రమంగానే చేయగలుగుతారు. వృత్తిఉద్యోగాలపరంగా పురోగతి బాగుంటుంది. దీర్ఘకాలిక సమస్యలు పరిష్కారం అవుతాయి. సమాజంలో ఉన్నతస్థాయి వ్యక్తులతో పరిచయం కలుగుతుంది, వారు కూడా మీ వ్యాపారంలో భాగస్వాములు అవుతారు. విద్యాసంబంధమైన విషయాలు, ఉద్యోగ సంబంధమైన విషయాలు, విదేశీయాన సంబంధమైన విషయాలు బాగుంటాయి. సాంకేతికవిద్యలోనూ, వైద్యవిద్యలోనూ రాణిస్తారు. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు, ఏదో ఒక ప్రభుత్వ ఉద్యోగం లభిస్తుంది, సౌకర్యవంతంగా ఉంటుంది. ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్, ఐఐటి వంటి వాటికి ఎంపిక అవుతారు. స్థిరాస్తుల అభివృద్ధి బాగుంటుంది. వ్యాపారంలో రొటేషన్లు, లాభాలు బాగుంటాయి. సామర్థ్యంలేని వ్యక్తులకు వ్యాపారం అప్పగించి నష్టపోతారు. వ్యక్తుల సామర్థ్యం అంచనా వేయడంలో పొరపాటు పడతారు. విలువైన వస్తువులను, ఆభరణాలను ఇంట్లోవారి సంతోషం కోసం కొనుగోలు చేస్తారు. నమ్మకస్తులైన పనివారిని నియమించుకుంటారు. మీకు సంబంధించిన వ్యక్తిగత విషయాలు గాని, కుటుంబ విషయాలు గాని బయటకు పొక్కకుండా జాగ్రత్తలు తీసుకుంటారు. సంతానపురోగతి బాగుంటుంది, విద్యాసంబంధమైన విషయాలలో చక్కగా రాణిస్తారు. క్రీడా, సాంస్కృతిక రంగాల పట్ల అభిమానం పెంచుకుంటారు. అర్హులైన వారికి వివిధ రంగాలకు చెందిన ప్రముఖులకు సన్మాన, సత్కారాలు చేస్తారు. ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది, కోరుకున్న చోటుకు బదిలీ అవుతుంది. ప్రాంతీయ అసమానతల ప్రభావం మీపై పడుతుంది. ప్రభుత్వపరంగా, ప్రైవేటుపరంగా రావలసిన బిల్లులు చేతికి అందుతాయి. గతంలో మీరు చేసిన రుణాన్ని తీర్చివేస్తారు. నూతన వర్క్ ఆర్డర్లు చేతికి అందివస్తాయి. రాజకీయ వ్యూహం ఫలిస్తుంది. ముఖ్యమైన నాయకుల వల్ల, రాజకీయనాయకుల వల్ల ప్రయోజనం పొందుతారు. ఇతరులకు సంబంధించిన ధనం, డాక్యుమెంట్లు, రహస్య పత్రాలు కొద్దిరోజులు మీ దగ్గర దాచి ఉంచాల్సిన పరిస్థితి వస్తుంది. పిల్లలకు మితిమీరిన స్వేచ్ఛ ఇచ్చారని మీపై ఆరోపణలు వస్తాయి. నిరుద్యోగులైన విద్యావంతులకు చదువుకు సంబంధించని ఉద్యోగాలు కొంతకాలం చేయవలసి వస్తుంది. ఎవరో మిమ్మల్ని తక్కువగా చూస్తున్నారన్న భయం మీకు కలుగుతుంది. ఆత్మన్యూనతా భావాన్ని

మీరు అధిగమించాలి, **"మొండివాడు రాజుకన్నా బలవంతుడు"** అన్న సామెతను మీరు గుర్తుపెట్టుకోండి. గృహంలో మంచి వాతావరణం కోసం, గొడవలు లేకుండా ఉండటం కోసం మీరు చాలా విషయాలు రాజీపడి తగ్గి ఉంటారు. ఇంటి విషయం గురించి ఆత్మీయులతో కూడా చర్చించరు. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందని మిన్నకుంటారు. దూరప్రాంతం బంధువుల వల్ల, స్నేహితుల వల్ల ఊరట కలుగుతుంది, వాళ్ళ అండదండలు లభిస్తాయి. సమస్యలు ఇతరులకు చెప్పినందు వల్ల గౌరవం పోతుందని భావిస్తారు, మీ సమస్యలను మీరే పరిష్కరించుకుంటారు. అంతరాత్మకు, మనస్సాక్షికి మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. పదిమందిని బ్రతిమిలాడి సహాయం అర్థించడం కన్నా లంచాలు ఇచ్చి పనులు చేయించుకొని ప్రశాంతంగా ఉండడమే మేలు అని భావిస్తారు. విదేశాలలో ఉన్నవారు స్వదేశానికి రావాలని నిర్ణయించుకొంటారు. కొంతమంది వాలెంటరీ రిటైర్మెంట్ గురించి ఆలోచన చేస్తారు. ఇతరుల హక్కుల పరిరక్షణ కోసం పోరాటం చేస్తారు. అంతరాత్మ సాక్షికి విరుద్ధంగా ప్రయోజనాల పరిరక్షణ కోసం కొన్ని పనులు చేయమని మీ ఆత్మీయవర్గం వత్తిడి చేస్తారు, అందుకు మీరు అంగీకరించరు. ప్రయోజనాలు వదులుకుంటారు గాని మనస్సాక్షికి విరుద్ధంగా ఏ పనీ చేయరు. తప్పని పరిస్థితులలో మీ సామాజికవర్గం పేరును ఉపయోగించుకొంటారు. బ్రతిమిలాడినా కాని పనులను భయపెట్టి సాధిస్తారు. పనిలో పనిగా మీ వైరివర్గానికి బెదిరింపు సంకేతాలు పంపిస్తారు. మీరంటే ఓ విధమైన భయం, గౌరవం ఏర్పడే విధంగా పరిస్థితులు మార్చుకుంటారు. జీవితభాగస్వామి మనస్తత్వంలో మార్పురాదు. కొన్ని విషయాలను కాలానికే వదిలివేయడం మంచిది అని భావిస్తారు. నూతన వాహన యోగ్యత కలుగుతుంది. జీవితాన్ని మరో కోణంలో ఆవిష్కరించాలని, విలాసవంతమైన జీవితాన్ని గడపాలని కోరుకుంటారు. ఆశలు, ఊహలు నెరవేరాలంటే దైవానుగ్రహం అవసరం అని భావిస్తారు. న్యాయబద్ధమైన మీ కోరికలకు, ఆశయాలకు, సహోదరవర్గానికి సహాయం చేయడానికి మరొకరి అనుమతి తీసుకోవాల్సిన అవసరం రావడం మీకు అత్యంత బాధాకరంగా ఉంటుంది. కొన్ని సందర్భాలలో వైవాహిక జీవితం బంగారు సంకెళ్ళు వేస్తుందని గ్రహిస్తారు. దివాళా తీసిన ఫైనాన్స్ కంపెనీ నుంచి కొద్దో గొప్పో ధనం వస్తుందని ఆశిస్తారు. మీ ఆశ నిరాశ అవుతుంది. గృహశాంతి పాడుచేసుకోవడం ఇష్టంలేక జీవితంలో నటించాల్సి వస్తుంది. మోసకారి మాటలు చెప్పేవాళ్ళను, భజనబృందాలను దూరంగా ఉంచుతారు. దురుసుగా మాట్లాడే విధానానికి స్వస్తి చెపుతారు, కోపాన్ని అదుపులో ఉంచుకుంటారు, మంచి మాటతీరుని ప్రదర్శిస్తారు. రహస్య వ్యూహాలు, ప్రతివ్యూహాలు ఫలిస్తాయి. గతంలో వృత్తి, ఉద్యోగాల పరంగా మిమ్మల్ని ఇబ్బంది పెట్టినవారు మీ చేతికి చిక్కుతారు. స్నేహంగా ఉంటూనే వాళ్ళు చేసిన ద్రోహం ఏదైతే ఉంటుందో అదే చేసి ప్రతీకారం తీర్చుకుంటారు, క్షమించే గుణానికి మొదటిసారి స్వస్తి చెబుతారు. సామాజిక సమీకరణలు, ప్రాంతీయ విభేదాలు మీపై ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ ప్రభావం చూపిస్తాయి. గతించిపోయిన రక్తసంబంధాలు, జ్ఞాపకాలు మనస్సును బాధిస్తాయి. ఎవరూ చూడకుండా బాధపడతారు. మనస్సు ఆంతర్యం, వైరాగ్యం, నిర్వేదం దుఃఖం ఇతరులతో పంచుకోవడానికి ఇష్టపడరు. పైకి నిండుకుండలా కనిపిస్తారు, అగ్ని పర్వతాన్ని మనస్సులో పెట్టుకొని పైకి గంభీరంగా కనిపిస్తారు. వృత్తిఉద్యోగాలపరంగా అదనపు బాధ్యతలు, అధికారాలు అప్పగించబడతాయి. మీకు సంక్రమించిన ఈ అధికారాలను సద్వినియోగం చేసుకుంటారు. నష్టపోయిన వారికి, గుర్తింపు లేనివారికి తగిన న్యాయం చేస్తారు. మీ కార్యాలయంలో ఇచ్చిన

---

**తొఱ్ఱలోని నిప్పు చెట్టును దహించినట్లు – దురాశ మానవుని దహించివేస్తుంది.**

ఉత్తర్వులను కొందరు కోర్టులో సవాలు చేస్తారు, కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. నా అధికారాన్ని ధర్మబద్ధంగా ఉపయోగించానని మానసిక ఆనందం పొందుతారు. ఎన్ని రకాల బెదిరింపులు వచ్చినా మీ అంతరాత్మ సాక్షి చెప్పినట్లు నిర్భయంగా నడుచుకుంటారు. మీరు లొంగే మనిషి కారు అని అందరికి అర్థం అవుతుంది. శత్రువర్గం మీ బలహీనతలు వెతికే ప్రయత్నం చేసి విఫలం అవుతుంది. మొత్తంమీద మీ శత్రువర్గం బలహీనపడుతుంది. అధికారం చేతిలో ఉన్నప్పుడు నిష్పక్షపాతకంగా వ్యవహరించి ఉద్యోగధర్మాన్ని నెరవేర్చడమే భగవంతుడు మెచ్చే పని అని మీరు భావిస్తారు. మీ విషయంలో పక్షపాతం వహించిన వైఖరిపై మీరు కోపం పెంచుకోరు. అది కూడా దైవేచ్ఛగా భావించి మిన్నకుంటారు. జ్యేష్ఠ సంతాన పురోగతి మానసిక సంతోషానికి కారణం అవుతుంది, మంచి ఉద్యోగం లభిస్తుంది. ఆర్థికంగా మీకు అండగా ఉంటారు. పునర్వివాహ సంబంధిత విషయంలో గట్టిగా ప్రయత్నం చేసి వాటిని విజయవంతంగా పూర్తి చేయగలుగుతారు. పెద్దలు, వృద్ధులు, తల్లిదండ్రులు, వాళ్ళ మనస్సు నొప్పించకుండా వాళ్ళకు నచ్చినట్లుగా నడుచుకుంటారు. మొండికిపడిన పిల్లల ప్రవర్తనలో మార్పులు తీసుకువస్తారు. వ్యసనపరులైన చిన్ననాటి స్నేహితులను ఆర్థికంగా ఆదుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి, ఉద్యోగాల పరంగా అన్యాయం జరగకుండా కోర్టు తీర్పులు అడ్డుపడతాయి. రావలసిన అద్దె బకాయిలు ఎక్కువ అవుతాయి. ఖాళీ చేయరు, అద్దె ఇవ్వరు. ఇది కొంతకాలం బాధిస్తుంది. సంతానం కొన్ని విషయాలలో స్వంత నిర్ణయాలు చేస్తారు. వక్రమార్గంలోకి వెళతారు. మంచిమాటలు చెప్పి వాళ్ళను వేరేచోట ఉంచి వాళ్ళను ఓ దారికి తీసుకొస్తారు. విందులు, వినోదాలు ఎక్కువ అవుతాయి, వాటికి దూరంగా ఉండాలని మీరు చేసే ప్రయత్నాలు అంతగా ఫలించవు. ఫైనాన్స్, షేర్ల వ్యాపారాలకు దూరంగా వుండండి. మధ్యవర్తిత్వం చేయడం వలన నష్టపోతారు, జాగ్రత్తగా ఉండండి. మీ కీర్తిప్రతిష్ఠలను, పలుకుబడిని, ధనాన్ని మీ ఆత్మీయవర్గం దుర్వినియోగం చేస్తారు. అసమర్థులైన స్నేహితులకు, శక్తిసామర్థ్యాలు లేని ఆత్మీయులైన వారికి ముఖ్యమైన పనులు అప్పగించవద్దు. వాళ్ళ మీద ప్రేమ ఉంటే మీరు ధనసహాయం చేయండి, ఎవరికీ నష్టం ఉండదు. అసమర్థులను నెత్తిన ఎక్కించుకుంటే చేదు అనుభవాలు సంప్రాప్తిస్తాయి, అంతేకాదు సామాజికంగా కూడా నష్టం జరుగుతుంది. ఆకస్మికంగా దూరప్రాంతాలు ప్రయాణిస్తారు. వ్యాపారంలో నూతన ఒప్పందాలు చేసుకుంటారు, ప్రశంసలు అందుకుంటారు. క్వాలిటీ విషయంలో రాజీపడకుండా ప్రతి పనీ నైపుణ్యంతో చేస్తారు. వ్యాపారంలో ధనం కన్నా గుడ్‌విల్ ముఖ్యమని భావిస్తారు. పని చేయడంలో కానీ, చేయించడంలో కానీ ఎక్కడా నిర్లక్ష్యం వహించరు. ఈ లక్షణమే మీ విజయానికి కారణం అవుతుంది. ఏ పని అయినా మీకు అప్పగిస్తే నిస్తేజంగా ఉండవచ్చు అన్న భావన చాలామందిలో కలుగుతుంది. ఆదాయం వచ్చే వాటిపై ధనాన్ని పెట్టుబడిగా పెడతారు, ఒకభూమి విషయంలో లాభపడతారు. కుటుంబపరమైన వ్యవహారాల మీద దృష్టి పెట్టడం లేదని వృత్తి, ఉద్యోగాలకు తాళి కట్టారని మీపై విమర్శలు వస్తాయి. కుటుంబం కోసమే కష్టపడుతున్నారన్న విషయం మీకు తప్ప మరొకరికి తెలియదు. కుటుంబసంబంధమైన వ్యవహారాలు మీరు స్పష్టంగా గమనిస్తున్నారన్న విషయం చాలామందికి తెలియదు. స్నేహం కోసం, బంధుత్వం కోసం ధనాన్ని వెచ్చిస్తారు. చాలా సందర్భాలలో ముఖ్యమైన పనులు ప్రక్కన పెట్టి చిన్ననాటి స్నేహితులతో హాయిగా కాలం గడుపుతారు. ఆత్మీయులతో గడిపేటప్పుడు మీ స్థాయిని, మీ స్థానాన్ని కూడా మరిచిపోయి చిన్నపిల్లల్లా ప్రవర్తిస్తారు. నిరాడంబరంగా

ఉండడానికే ఎక్కువ ప్రయత్నిస్తారు. మీకు నచ్చని విషయాలలో రాజీపడరు, ఎంత ప్రయోజనం ఉన్నా వదిలివేస్తారు. గతంలో చేసిన పొరపాటు మళ్ళీ చేయకూడదని నిర్ణయించుకుంటారు. నరదృష్టి పొంచి ఉంది, నల్లవత్తులతో దీపారాధన చేయండి, నవగ్రహాల దగ్గర నవగ్రహ వత్తులతో దీపారాధన చేయండి. పూజాకార్యక్రమాలలో మహాతీర్థం పొడి, సిద్ధగంధం, పరిమళ గంధాన్ని ఉపయోగించండి. వ్యాపార నిమిత్తం కమర్షియల్ ఏరియాలో ఓ స్థలాన్ని తీసుకుంటారు. ముఖ్యమైన వ్యక్తులతో ఉన్నటువంటి సత్సంబంధాలను అనుసరించి వాళ్ళ సహకారంతో కమర్షియల్ కాంప్లెక్స్‌ను అభివృద్ధి చేస్తారు. స్త్రీలతో నిష్కారణమైన విభేదాలు ఏర్పడే అవకాశం ఉంది. మీకు ఏ మాత్రం సంబంధం లేకపోయినా మీరు మోసం చేశారన్న ఆరోపణలు వస్తాయి. తప్పుచేయనంతవరకు ఎవరికీ భయపడకూడదని నిర్ణయించుకుంటారు, దానికి తగినట్టుగానే మీ ప్రవర్తన ఉంటుంది. ధీటుగా సమాధానం చెప్పి మీ నిజాయితీని నిరూపించుకుంటారు. ఆధ్యాత్మిక విషయాలకు విశేషమైన ప్రాముఖ్యతను ఇస్తారు. **'మానవసేవయే మాధవసేవ'** అను ఆర్యోక్తిని అమలు చేస్తారు. సమాజంలో పెరుగుతున్న మీ స్థాయిని చూసి చాలామంది ఈర్ష్య పడతారు, ఇలాంటి విషయాలు మీరు పట్టించుకునే స్థితిలో ఉండరు. నిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో, సర్వరక్షా చూర్ణం కలిపి స్నానం చేయండి. జీవితభాగస్వామితో అన్ని విషయాలు అరమరికలు లేకుండా పంచుకుంటారు. జీవితభాగస్వామికి ఇవ్వవలసిన గౌరవాన్ని, సముచిత స్థానాన్ని ఇస్తారు. సంతానం మనోభావాలు గౌరవిస్తారు, ఏకపక్ష నిర్ణయాలు చేయరు. మీరు మధ్యవర్తిగా ఉండి కొన్ని ప్రేమవివాహాలకు అడ్డుకట్ట వేస్తారు. క్రీడారంగంలో రాణిస్తారు. యూనియన్ వ్యవహారాలలో చురుగ్గా పాల్గొంటారు. మీడియా పరంగా మంచి ఖ్యాతి లభిస్తుంది. శుభకార్యాలు నిర్వహించడంలో మీదైన శైలిని ప్రదర్శిస్తారు. చారిత్రాత్మకమైన ప్రదేశాలను, పుణ్యక్షేత్రాలను సందర్శిస్తారు. దొంగస్వామీజీల వల్ల, దొంగ బాబాల వల్ల నష్టపోతారు. వృత్తిఉద్యోగాల పరంగా ఉన్న చికాకులు తొలగిపోతాయి. దివాళా తీసిన ఫైనాన్స్ కంపెనీ నుండి కొద్దో గొప్పో డబ్బులు వస్తాయని ఆశ పెట్టుకుంటారు. మీ ఆశ నిరాశ అవుతుంది. రాజకీయనాయకుల అండదండలు ఉన్నవారిని, ప్రభుత్వంలో పలుకుబడి ఉన్నవారిని ఎవరూ ఏమీ చేయలేరని గ్రహిస్తారు. రాజకీయ నాయకులను కొనుక్కుంటే ఏ రకమైన తప్పు చేసినా శిక్షలు పడవు అని గ్రహిస్తారు. గనులు, ఇసుక వ్యాపారాలలో లాభాలు గడిస్తారు. ఫర్నిచర్, వస్త్రవ్యాపారం, బేకరీలు, ఫాస్ట్‌ఫుడ్స్, హోటళ్ళు మొదలైన వ్యాపారాలు మధ్యస్థంగా ఉంటాయి. కొంతమంది రాజకీయ నాయకులకు మీరు ఆంతరంగికులుగా ఉంటారు. నిర్మాణసంబంధమైన విషయాలలో లోపాలు గ్రహిస్తారు, ముందు జాగ్రత్తలు తీసుకుని ఎవరి వల్ల మాటపడకుండా బయటపడతారు. ఇతరులు చేసిన పనికిమాలిన పనులకు మీరు బాధ్యత వహించవద్దు. స్నేహధర్మాన్ని నిరూపించుకోవడానికి ఇది సరైన దారి కాదు. కొంతకాలం మీ ప్రవర్తన మీ కుటుంబసభ్యులకు ఆశ్చర్యకరంగా ఉంటుంది. కొన్ని అవమానాలు ఎదురయ్యే సూచనలు సూచిస్తున్నాయి, సహనాన్ని కోల్పోక మనస్సుని దృఢం చేసుకోవాలి, ఈ అవమానాలకు బంధువులు, సన్నిహితులే కారణం అవుతారు. జ్యేష్ఠ కుమారుడు లేదా జ్యేష్ఠ కుమార్తె విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ ప్రదర్శించవలసి ఉంటుంది. స్నేహితుల వల్ల పిల్లలు వక్రమార్గం పట్టకుండా జాగ్రత్త వహించండి, అవసరానికి మించి పిల్లలకు ధనాన్ని ఇవ్వవద్దు. పిల్లలకు ద్విచక్రవాహనాన్ని ఎట్టి పరిస్థితులలో కొనివ్వద్దు. వృత్తిపరంగా నక్క మనస్తత్వం కలిగిన వ్యక్తుల వలన ఇబ్బందులు ఎదురవుతాయి. వ్యాపారంలో

భాగస్వాములను అతిగా నమ్మవద్దు. వ్యవహారాలు పద్ధతిగానే నడవనీయండి. స్నేహాలకు, బంధుత్వాలకు ఇక్కడ ప్రాధాన్యత, సెంటిమెంట్స్ పెట్టుకోవద్దు, నష్టపోతారు. ప్రతిరోజు దైవికంతో ధూపం వేయండి, మహాతీర్థం పొడితో మీ ఇష్టదైవానికి అభిషేకం చేయండి. సర్వదా శుభాలు కలుగుతాయి. మీ మీద ఉన్న బాధ్యతలను తీర్చుకుంటారు. వివాహాది శుభకార్యాలు ఘనంగా నిర్వహిస్తారు. సంతానం లేనివారికి సంతానప్రాప్తి కలుగుతుంది. చారిత్రాత్మక, ఆధ్యాత్మిక క్షేత్రాలను సందర్శిస్తారు. సెల్ఫ్ డ్రైవింగ్‌కి దూరంగా ఉండండి.

## స్త్రీలకు ప్రత్యేకం

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు చాలా బాగుంది. విద్యాసంబంధమైన విషయాలు, సాంకేతిక సంబంధమైన విషయాలు, సాంకేతికవిద్యకు సంబంధించిన విషయాలు, మెడిసిన్ సీటుకు సంబంధించిన విషయాలు, మెడిసిన్ సీటు కోసం చేసే ప్రయత్నాలు సానుకూలపడతాయి. ముఖ్యమైన ఉద్యోగాలకు ఎంపిక అవుతారు. మనోధైర్యం, మానసిక ఉత్సాహం కలుగుతుంది. సహోదర సహోదరి వర్గానికి అండగా నిలుస్తారు. సంతానం లేనివారికి సంతానప్రాప్తి, అవివాహితులైన వారికి మంచి సంబంధం కుదురుతుంది. నమ్మించి మోసం చేసిన వ్యక్తుల వల్ల మానసిక వేదన కలుగుతుంది. ప్రేమవివాహాలు ప్రధాన ప్రస్తావన అంశాలు అవుతాయి. కొన్ని సందర్భాలలో మీ పంతం నెగ్గించుకోవడానికి పెద్దవాళ్ళతో విభేదించే పరిస్థితులు ఏర్పడుతాయి. కుటుంబబాధ్యతలలో మీవంతు కర్తవ్యాన్ని సక్రమంగా నెరవేరుస్తారు. మీ సహోదర సహోదరి వర్గానికి చేయూతనిచ్చి మీ పరపతితో ఉద్యోగం ఇప్పించాలన్న మీ సంకల్పం సఫలం కాదు. మొండి వైఖరితో వ్యవహరించే వారిని మార్చడానికి అనవసరమైన యత్నాలు చేసి భంగపడతారు. ఎవరి ఆకర్షణలోనూ, మాయలోనూ పడకుండా మచ్చలేని మనిషిగా జీవితం కొనసాగించాలని గట్టిగా నిర్ణయించుకుంటారు. చిన్న చిన్న వ్యాపారాలు, పెట్టుబడులు లాభిస్తాయి. మీ స్వతంత్ర నిర్ణయాలకు, స్వేచ్ఛాజీవితానికి ఆటంకాలు వస్తాయి. ఆరావళికుంకుమతో మహాలక్ష్మి పూజ చేయండి. లక్ష్మీదేవి పూజలలో లక్ష్మీచందనాన్ని ఉపయోగించండి. ఉద్యోగం అనుకున్న చోటుకు బదిలీ అవుతుంది. ఆత్మీయులతో, సన్నిహితులతో వాగ్వివాదాలు సంభవిస్తాయి. ఎలాంటి సమస్యలు ఎదురైనా ధైర్యంగా ఎదుర్కొంటారు, మీ మనోధైర్యమే చాలా విషయాలలో మిమ్మల్ని రక్షిస్తుంది. అందరూ మిమ్మల్ని వేరుగా చూస్తున్నారన్న భావన కలుగుతుంది. దూరప్రాంతంలో చదువుకోవాలన్న మీ ఆశలు, ఉద్యోగం చేయాలన్న పట్టుదల మెల్లిగా ఫలిస్తాయి. ఆరోగ్యపరంగా జాగ్రత్త అవసరం, మోకాళ్ళనొప్పులు బాధించే అవకాశం ఉంది. పెద్దలు చేసిన బాకీలు తీరుస్తారు. వివాహాది శుభకార్యాలు సానుకూలపడతాయి. సంవత్సర ద్వితీయార్ధంలో వృత్తిఉద్యోగాలపరంగా ఉన్నతాధికారుల చలువతో మీ స్థాయి పెరుగుతుంది. మీ సహోద్యోగులకు ఇది మింగుడుపడని అంశంగా మారుతుంది. ముఖ్యమైన సందర్భాలలో జీవితభాగస్వామి లేక ఆత్మీయులు మీ మాటకన్నా ఇతరుల మాటలకు విలువ ఇస్తారు. మీ కుటుంబ జీవితంలో మరో స్త్రీ ప్రవేశించడం వివాదాలకు కారణం అవుతుంది. మీలో లోపం లేకపోయినా అందరూ మిమ్మల్ని శత్రువుగా చూడడం రకరకాల ఆలోచనలకు దారితీస్తుంది. అసూయాద్వేషాల వల్ల చిన్న చిన్న విషయాలే

చిలికి చిలికి గాలివానగా అవుతాయి. సంపాదించిన ధనాన్ని అభివృద్ధికి వినియోగిస్తారు. కళాసాహిత్య, సాంస్కృతిక రంగాలలో మీ ప్రతిభకి మంచి గుర్తింపు లభిస్తుంది. ప్రభుత్వపరంగా, ప్రైవేట్‌పరంగా అవార్డులు, రివార్డులు లభిస్తాయి. ప్రేమవివాహాలు విఫలం అవుతాయి. ఇష్టంలేని వ్యక్తితో చట్టబద్దంగా విడిపోతారు. జుట్టుకు సంబంధించిన, చర్మరోగాలకు సంబంధించిన జాగ్రత్తలు చాలా అవసరం. పి. హెచ్. డి. కి సంబంధించి ప్రయత్నాలు కష్టతరంగా ఫలిస్తాయి. వృత్తిఉద్యోగాల పరంగా నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి. జీతం ఆధారంగా ఉద్యోగాలు చేయరు, ప్రదేశం ఆధారంగా ఉద్యోగం చేస్తారు. మీ పేరుమీద ఇతరులు చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ప్రతిరోజు పూజలో జువ్వాది పరిమళ గంధం ఉపయోగించండి. మంచి ఫలితాలు ఉంటాయి. మీరు అనవసరమైన విషయాలకు ప్రాధాన్యత ఇస్తున్నారన్న విమర్శలు వస్తాయి. కొన్ని పుకార్లు తాత్కాలికంగా ఇబ్బంది పెడతాయి, ఎవరినీ లెక్కచేయకుండా మీరు చేయవలసిన కార్యక్రమాలని నిర్భీతిగా చేస్తారు. ఎక్కువమంది సలహాలు తీసుకోవద్దు. మీరు నమ్మిన వ్యక్తి మాటలు వింటే మీరు మాతృవర్గం వైపు వారికి సహాయం చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మీరు కష్టపడి సంపాదించిన ఆస్తి మీద కూడా మీ హక్కు లేకుండా పోతుంది. మీరు అభిమానించే చిన్న చిన్న వస్తువులు బేజారిపోతాయి. ఇంట్లో జరుగుతున్న చిల్లర దొంగతనాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. కీలకసమయంలో సహోదరవర్గం సహాయపడతారు. అన్యభాషలు నేర్చుకోవాలన్న మీ ప్రయత్నాలు నత్తనడక నడుస్తాయి. ప్రతిరోజూ, ప్రతినిత్యం ఇష్టదేవత సన్నిధిలో జిల్లేడు వత్తులతో, అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగుతారు. అవకాశవాదులు మళ్ళీ దరిచేరుతారు, మీరు వాళ్ళని దూరంగా పెడతారు. ప్రతిష్ఠాత్మకమైన పోటీలో విజయం సాధిస్తారు. మిమ్మల్ని ఆదరించి, అభిమానించిన చిన్ననాటి టీచర్లను ఆర్థికంగా ఆదుకుంటారు. ఉమ్మడిగా ఏ కార్యక్రమాన్ని చేపట్టరు, ఒంటరిగానే వెళతారు, దిగ్విజయంగా పూర్తిచేస్తారు. ఉన్నతాధికారులు మీ శ్రమను గుర్తిస్తారు, సహాయసహకారాలు అందిస్తారు. ముఖ్యమైన డాక్యుమెంట్ల విషయంలో జాగ్రత్త వహించండి. గ్రీన్‌కార్డ్ లభిస్తుంది. గృహసౌఖ్యం, వాహనసౌఖ్యం ఏర్పడుతుంది. విభేదాలకు దూరంగా ఉంటారు. మీకు మీరుగా సమస్యలను పెద్దవిగా చేయవద్దు. ప్రతిరోజు సర్పదోష నివారణ చూర్ణంతో, సర్వరక్షా చూర్ణం కలిపి స్నానమాచరించండి. ఇది అన్ని విధాలుగా శుభప్రదం.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121





# 2017-2018 లో సింహరాశి ఫలితములు

| ఆదాయం - 2 | వ్యయం - 11 | రాజ - 2 | అవ - 2 |
|---|---|---|---|

**మఘ 1, 2, 3, 4 పాదములు, పుబ్బ 1, 2, 3, 4 పాదములు, ఉత్తర 1వ పాదముల యందు పుట్టినవారు "మా, మీ, మూ, మే, మో, టా, టీ, టూ, టే" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు సింహరాశికి చెందినవారు.**

# 2017-2018 సంవత్సర ఫలితములు

**సింహ రాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు సూచిస్తున్నాయి. ఆర్థిక సర్దుబాట్లు చేయగలుగుతారు. కుటుంబ పురోగతి బాగుంటుంది. పిల్లలు విద్యాపరంగా మంచి పురోగతి సాధిస్తారు. అనారోగ్య సమస్యలు ఇబ్బంది పెడతాయి. అనువంశిక ఆస్థులను నిలబెట్టుకోగలుగుతారు. మీ ప్రయత్నం లేకుండానే కొన్ని మంచిపనులు ముడిబడతాయి. అదృష్టవశాత్తు మీకు కొన్ని ముఖ్యమైన రహస్య సమాచారాలు అందుతాయి. వాటివల్ల వృత్తిఉద్యోగాల పరంగా మేలు జరుగుతుంది, ఆ రహస్య సమాచారం ఎంతో ఉపయోగపడుతుంది. లావాదేవీలు, జాయింట్ ఖాతాల నిధుల వినియోగ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలి. కొన్ని ప్రతిష్ఠాత్మకమైన సంస్థలలో సభ్యత్వం తీసుకుంటారు. భూమి అమ్మకాలు, కొనుగోళ్ళు లాభాలు గడిస్తాయి. చిట్‌ఫండ్స్, ఫైనాన్స్ వ్యాపారాలకి దూరంగా ఉండండి. ఆర్థికపరమైన సమస్యలలో మధ్యవర్తిత్వం చేయవద్దు. వృత్తిఉద్యోగాలపరంగా కొన్ని ఒడిదుడుకులు ఎదురైనప్పటికి, సామాజిక ప్రాపంచిక విషయాలు ప్రతికూలంగా ఉన్నప్పటికీ దైవానుగ్రహం వల్ల మీరు నిలదొక్కుకోగలుగుతారు. కీళ్ళనొప్పులు, ఎలర్జీ సమస్యలు, జీర్ణకోశ సంబంధిత సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. ఆధ్యాత్మికగ్రంథ పఠనం వల్ల మనోబలం పెరుగుతుంది. ఆధ్యాత్మికంగా ఉన్నతస్థానంలో ఉన్న స్వామీజీల ప్రవర్తన మీకు అసహ్యం కలిగిస్తుంది. గతించిన ఆత్మీయుల జ్ఞాపకాలు బాధిస్తాయి, వాళ్ళ జ్ఞాపకార్థం కొన్నిమంచి పనులు చేస్తారు. వృద్ధుల పట్ల, పెద్దల పట్ల, కుటుంబంలోని వారి పట్ల శ్రద్ధ వహిస్తారు. మీరు ఎంతో శ్రద్ధ వహించి ప్రేమ చూపించినప్పటికి కొంతమందిని మెప్పించలేరు. నిష్ఠూరాలు, నిట్టూర్పులు తప్పవు. స్థిరాస్తికి సంబంధించిన డాక్యుమెంట్లలో కొన్ని మార్పులు చేర్పులు చేసి మిమ్మల్ని మోసం చేయడానికి కొందరు ప్రయత్నిస్తారు, జాగ్రత్త వహించండి. పన్నులు వసూలు చేసే అధికారుల నుండి మీకు ఇబ్బందులు ఏర్పడాలని కొందరు కృత్రిమంగా ప్రయత్నాలు చేస్తారు. అయితే సమాచారం ముందుగానే అందటం వలన తగిన జాగ్రత్తలు తీసుకుని ఎటువంటి అవాంతరాలు లేకుండా బయటపడతారు. ఉద్యోగపరంగా బదిలీకి అవకాశం

ఉంది. కోర్టులో ఉన్న వ్యవహారాలు, మధ్యవర్తుల పరిష్కారం వలన ఒక కొలిక్కి చేరే అవకాశం ఉంది. సంతానం విద్య గురించి, విదేశీయానాల గురించి అధికంగా ఖర్చు పెట్టవలసి వస్తుంది. కుటుంబపరమైన వ్యతిరేక వాతావరణం సంతానం మీద పడకుండా జాగ్రత్త వహిస్తారు. కొంతమంది విషయంలో ప్రేమవివాహాలు ఫలిస్తాయి, అయితే వైవాహిక జీవితం ప్రశ్నార్థకంగా ఉంటుంది. గతం గుర్తుకు రావడం వల్ల కొన్ని సందర్భాలలో దుఃఖం సన్నిహితం అవుతుంది. అయితే మీ బాధని మనస్సులోనే ఉంచుకుంటారు, ఎందుకంటే మీ దుఃఖాన్ని ఇతరులతో పంచుకోవడం మీకు ఇష్టం ఉండదు. స్కాలర్‌షిప్పులు లభిస్తాయి. లీజుల వ్యవహారాలు, అలాట్‌మెంట్లు మీకు అనుకూలంగా ఉంటాయి. వ్యవసాయ సంబంధిత విషయాలు ఓ మాదిరి సంతృప్తిగా ఉంటాయి. గృహనిర్మాణ సామాగ్రి, ఆయుర్వేదం, హోమియోపతి, అల్లోపతి, మందులు, భూములకు సంబంధించిన వ్యాపారాలు, ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు లాభిస్తాయి. రాజకీయ పైరవీలు ఫలిస్తాయి. మొండికి పడిన కొన్ని పనులను సానుకూలపరచుకోవడానికి సన్నిహితులను ఆశ్రయిస్తారు, మీ ద్వారా సహాయసహకారాలు పొందిన రాజకీయనాయకులను ఆశ్రయిస్తారు, అయితే పని మొండికి పడుతుంది. చివరికి లంచం ఇచ్చి ఆ పనిని సానుకూల పరుచుకుంటారు. అప్పుడు మీకు అనిపిస్తుంది, న్యాయానికి, ధర్మానికి కానికాలం దాపురించింది అని. సామాజిక సంబంధాలు ఇంత చేటు కలుషితం అయ్యాయి అని బాధపడతారు. నిరాశానిస్పృహల మధ్య అంతరాత్మ మనస్సు కొట్టుమిట్టాడుతుంది. సంవత్సర ద్వితీయార్థంలో మీకు పలుకుబడి ద్వారా వచ్చిన లాభాలని ధర్మబద్ధంగా మీ భాగస్వాములకు పంచుతారు. నిజానికి వారికి లాభాలలో ఇవ్వవలసిన అవసరం లేదు. అందుకు సంబంధించి ఎలాంటి అగ్రిమెంట్లు లేవు. కానీ ఇచ్చిన మాటకు కట్టుబడి నడుచుకుంటారు. ధర్మభ్రష్టుత్వం చేయకూడదని నిర్ణయించుకుంటారు. అధికమొత్తంలో రెండవ మంజూరు ప్రయత్నాలు ఫలిస్తాయి. ఎక్కువ మొత్తాలను ఆశించి కొన్ని అమ్మకాలను వాయిదా వేస్తారు. చాలాకాలంగా వివాహం కాకుండా బాధపడుతున్న వారికి ఈ సంవత్సరం వివాహం నిశ్చయం అవుతుంది. పిల్లలు లేనివారికి సంతాన సాఫల్యాల వల్ల మాత్రం మేలు జరుగదు. రహస్యమైన చర్చలుపూర్తి చేస్తారు. అందుకు సంబంధించిన విషయాలు ఎవరికీ చెప్పరు. ఏది ఏమైనప్పటికీ మీ వ్యూహ ప్రతివ్యూహాలు ఫలిస్తాయి. మీ వర్గం ఉన్నతస్థాయి సాధించే విధంగా మీరు చేసే శ్రమ ఫలిస్తుంది. ఒక వర్గానికి మీరు సహాయం చేస్తున్నారన్న విషయం బయటపడి కొంతమంది వ్యక్తులు మీకు దూరం అవుతారు. సంవత్సర ద్వితీయార్థంలో స్త్రీల వల్ల ఏర్పడిన ఇబ్బందులు, సమస్యలు తొలిగిపోతాయి. పత్రికాముఖంగా కొన్ని ముఖ్యమైన ప్రకటనలు చేస్తారు. కొన్ని ఆస్తుల మీద మీకున్న హక్కులు, డాక్యుమెంట్స్ రూపంలో బహిర్గతం చేస్తారు. కొన్ని కొత్త కొత్త అలవాట్లు దరిచేరుతాయి, జాగ్రత్త వహించండి. బ్యాంకు లాకర్లు, ఏటియం కార్డులు, క్రెడిట్ కార్డులు, వీసా, పాస్‌పోర్ట్ వంటి విషయాలలో జాగ్రత్తగా మసులుకోవలసి ఉంటుంది. పెద్దలతో కలిసి మీరు చేసే వ్యాపారంలో మీకు ఆడంబరాలు తప్ప ఆర్థికపరంగా ఎటువంటి లాభాలు ఉండవు. సేవా సంస్థలకు విదేశాల నుండి వస్తున్న సహాయసహకారాలు యథాతథంగా కొనసాగుతాయి. నిరుద్యోగులైన విద్యావంతులు

పోటీపరీక్షలలో విజయం సాధించి మంచి ఉద్యోగాన్ని సాధిస్తారు. చెప్పుడు మాటలు వినవద్దు, ప్రతి విషయం చూసి నిర్ధారించుకోండి. మీ సన్నిహితులు, స్నేహితవర్గం, మీ పరపతిని, పలుకుబడిని దుర్వ్యసనాలకు, స్వప్రయోజనాలకు వాడుకుంటారు. మీ అధికారాలను ఉపయోగించి వాళ్ళు పెత్తనం చేయడం జరుగుతుంది. ఈ విషయంలో మీరు పరోక్షంగా బాధ్యత వహించాల్సి వస్తుంది. వారసత్వపు ఆస్థి రావలసిన దానికన్నా అధికంగా రావడం వల్లనే బాగుపడ్డారన్న వదంతులు వినిపిస్తాయి, నిష్కారణమైనటువంటి ఈ నిందారోపణ మానసిక వైరాగ్యానికి దారితీస్తుంది. ప్రభుత్వపరంగా మీకు రావలసిన అవార్డులు లభిస్తాయి. ఉద్యోగపరంగా మీకు అనుకూలంగా వచ్చిన కోర్టుఆర్డర్సు అతి కష్టం మీద అమలుకు నోచుకుంటాయి. కొంతమంది వ్యక్తులతో ఆంతరంగిక పోరు అనివార్యం అవుతుంది, యూనియన్ జోక్యం వల్ల లాభపడతారు. యూనియన్‌కి సంబంధించిన కార్యక్రమాలలో మీ అవసరం లేనట్లుగా చిన్నచూపుగా వ్యవహరించిన ఓ వర్గం ఇప్పుడు మీపై ఆధారపడుతుంది. ఎవరు చెప్పినా వినని మొండివాళ్ళు మీ మాట వినడం బంధువులలో ఆశ్చర్యం కలిగిస్తుంది. మీ కుటుంబసభ్యులు వినోదం కోసం ఎక్కువ సమయం కేటాయించడం, ఎక్కువ సేపు టీవీలకు అతుక్కుపోవడం మీ అసహనానికి కారణం అవుతుంది, వాళ్ళలో మార్పు రాదని భావించి వదిలివేస్తారు. నూతన విద్యా ప్రయత్నాలు, జనరల్ నాలెడ్జ్ అభివృద్ధి చేసుకునే ప్రయత్నాలు ఫలిస్తాయి. భాగస్వాములతో చేసే స్పెక్యులేషన్ వ్యాపారాలలో నష్టపోయే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండండి. ప్రేమ అనుభవాలు చేదు అనుభవాలను మిగిలిస్తాయి. తరచూ ప్రయాణాలు చేయాల్సి వస్తుంది. అందులో కొన్ని రహస్య ప్రయాణాలు కూడా ఉంటాయి. మొత్తం మీద ప్రయాణాల వల్ల వ్యవహార విజయం, లాభం పొందుతారు. రాజకీయసంబంధమైన స్నేహాలు, పరిచయాలు వృద్ధి చెందుతాయి. మీ వాళ్ళను ఓ దారిలో పెట్టడానికి మీరు చేసే ప్రయత్నాలు విజయవంతం అవుతాయి. అభినందించే వాళ్ళు అందరూ మీ వాళ్ళే అని మురిసిపోవద్దు, ఆ అభినందనల వెనుక ఉన్న ఆంతర్యం గ్రహించండి. మానసిక ప్రశాంతత, మనోధైర్యం ఏర్పడుతుంది. వివాహాది శుభకార్యాలను ఒంటి చేత్తో ఘనంగా చేస్తారు. వివాహం బాగా చేశారని, మంచి సంబంధం కుదిరిందని అందరూ అభినందిస్తారు. పెరిగినటువంటి మీ స్థాయిని చూసి ఆశ్చర్యపోతారు, ఆనందపడతారు. ఈ శుభసమయంలో వైభవంగా జరిగిన కార్యక్రమాన్ని చూసి సంతోషించడానికి, నా మనస్సులో ఆనందాన్ని పంచుకోవడానికి నా ఆత్మీయుడు ఏడి ? ఏ లోకంలో ఉన్నాడు ? వాడులేని ఈ ఆనందం నాకు దుఃఖంతో సమానం అని గతించిపోయిన ఆత్మీయుడి గురించి ఎంతగానో బాధపడతారు. నాది అంతరంగిక జీవితమే తప్ప సంతోషకరమైన జీవితం కాదు అని పరిపరివిధాలుగా బాధపడతారు. పోటీపరీక్షల సాధన కోసం చాలా సమయాన్ని వెచ్చిస్తారు. భూములకు సంబంధించిన విషయాలు వివాదాస్పదం కాకుండా జాగ్రత్తలు తీసుకోండి. తొందరపడి అగ్రిమెంట్లు చేయవద్దు. జీవితంలో స్థిరత్వం ఏర్పడుతుంది. స్థిరాస్తులు రూపాంతరం చెందవచ్చు, అందువల్ల లాభమే కానీ నష్టం ఉండదు. ఆధ్యాత్మికగ్రంథాలను ఓ క్రమపద్ధతిలో అభ్యసిస్తారు. ఆధునిక పోకడలు ఇంట్లోకి ప్రవేశించకుండా అడ్డుపడతారు, కానీ అందువల్ల ఏమాత్రం

ప్రయోజనం ఉండదు. మీకు మేలు చేసే పత్రాలు, ఫైల్స్ ఆలస్యంగా అధికారుల పరిశీలనకు వస్తాయి. ఎంతో సమయం వృధా అవుతుంది, వృధా అయిన సమయాన్ని సాంకేతికంగా సరిచేసుకోగలరు. వ్యవసాయసంబంధమైన ఉత్పత్తుల వ్యాపారస్థులకు కాలం అనుకూలంగా ఉంది. టాక్సులు చెల్లించవలసిన దానికన్నా తక్కువగా చెల్లిస్తారు. బంధువులకు సంబంధించిన బాధ్యతలలో సహాయపడటం తప్పకపోవచ్చు, అందులో బాధ్యతలు పూర్తిగా స్వీకరిస్తారు. స్వప్రయోజనాల కోసం, అభివృద్ధి కోసం మీ పరపతిని ఉపయోగిస్తారు, కొన్ని వ్యాపారాలలో రహస్యంగా ధనాన్ని పెట్టుబడి పెడతారు. ఉద్యోగ, వ్యాపారాలలో మీ అంచనాలు నిజం అవుతాయి, ముందు జాగ్రత్తచర్యలు అనుకూల ఫలితాలు ఇస్తాయి. దివాళా తీసిన ఫైనాన్స్ కంపెనీ నుండి కొద్దో గొప్పో డబ్బులు వస్తాయని ఆశపెట్టుకుంటారు. మీ ఆశ నిరాశ అవుతుంది. మీకు అనుకూలంగా వచ్చిన ఉత్తర్వులు అమలులోకి వస్తాయి. ఓ ప్రముఖవ్యక్తి మీకు ఇచ్చిన మాట ప్రకారం సహాయం చేస్తాడు. మితిమీరిన ఆత్మవిశ్వాసంతో మీవాళ్ళు చేసిన పనులను మీరే అడ్డుకుంటారు, మీ శత్రువర్గానికి ఆయుధం లేకుండా చేస్తారు. విలువైన వస్తువుల భద్రత విషయంలో జాగ్రత్త వహించండి, దొంగభయం పొంచి ఉంది. దొంగ స్వామీజీలను, దొంగబాబాలను నమ్మి నష్టపోతారు. ప్రత్యర్థి గ్రూపు రాజకీయాలను మీకు అనుకూలంగా మార్చుకుంటారు. మీ మంచి ప్రవర్తనతో ముఖ్యమైన వ్యక్తులను, ఆత్మీయులను దగ్గరకు చేర్చుకుంటారు. ఏకపక్ష నిర్ణయాలు చేయకుండా ఎదుటివాళ్ళు చెప్పిన విషయాలను ఓర్పుగా వింటారు. మీ వల్ల మంచి కార్యాలు వాయిదా పడ్డాయన్న నిందలు రానివ్వకండి. మీ మిత్రవర్గానికి శత్రువులైన వారందరినీ మీరు శత్రువులుగా చూడకండి. ఎవరితో ఎప్పుడు ఏ అవసరం వస్తుందో లౌక్యంగా ప్రవర్తించండి. ఇరువర్గాలవారికి ఆమోదకరమైన వ్యక్తిగా ప్రవర్తించండి. ఎంతటి వారినైనా మాటల చాతుర్యంతో ఆకట్టుకుని పనులు పూర్తిచేయగలుగుతారు. లేట్ నైట్ పార్టీలలో అపశ్రుతులు చోటు చేసుకుంటాయి, జాగ్రత్త వహించండి. గడిచిన కాలాన్ని పట్టించుకోకుండా భవిష్యత్తుకు అధిక ప్రాధాన్యతనివ్వండి. మనస్సును ప్రశాంతంగా ఉంచుకోవడానికి, ఊరట చెందడానికి వినోద కార్యక్రమాలపై దృష్టిసారిస్తారు. చెల్లింపులను సకాలంలో చెల్లిస్తారు. గార్డెనింగ్ పట్ల, మొక్కల పట్ల ఆకర్షితులవుతారు. శుభకార్యాల విషయమై చర్చలు ఫలిస్తాయి, వివాహం కుదురుతుంది. బాధ్యతలను నెరవేర్చుకోగలిగామన్న సంతృప్తి కలుగుతుంది. పునర్వివాహ సంబంధమైన విషయవ్యవహారాలు సానుకూలపడతాయి. వివాహం కాని మగపిల్లలకు కూడా వివాహం కుదురుతుంది. ప్రతిరోజు జిల్లేడు వత్తులతో, అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం ఎక్కువ అనుకూల ఫలితాలు ఆచరణకు వస్తాయి. స్వయం సంపాదన ఏర్పడుతుంది, ఆర్థికంగా నిలదొక్కుకుంటారు. సంతానానికి సంబంధించిన సమస్యలను అతికష్టం మీద పరిష్కరిస్తారు. వాళ్ళ అభివృద్ధి కోసం ఎక్కువ సమయాన్ని, ధనాన్ని వెచ్చిస్తారు. మారుతున్న సామాజిక పరిస్థితులకు అనుకూలంగా మీ మనస్తత్వాన్ని మార్చుకుంటారు. వింత వింత పోకడలతో పోతున్న సమాజాన్ని చాలా దగ్గరగా

గమనించి అవసరమైన మార్పులు చేస్తారు. అందరితో కలిసిపోయి ఏ మాత్రం గర్వంలేని మనిషిగా పేరు తెచ్చుకుంటారు. ప్రజాసంబంధాలు వృద్ధి చెందుతాయి. రాజకీయసంబంధమైన పరిచయాలు వృద్ధి చెందుతాయి. చిన్న చిన్న వ్యాపారాలు చేస్తున్నవారికి కాలం అనుకూలంగా వుంది. తినుబండారాలు, అలంకార సంబంధమైన వ్యాపార వ్యవహారాలు మధ్యస్థంగా ఉంటాయి. అధికారం కలిగిన ఓ ఉద్యోగానికి మీరు ఎంపిక అవుతారు. సాంకేతిక, వైద్య, విద్యారంగాలలో బాగా రాణిస్తారు. పోస్ట్ గ్రాడ్యుయేషన్ వంటివాటిని పూర్తి చేయడంలో విజయం సాధిస్తారు. పరిశోధాత్మక అంశాలలో మీకు మంచి ఖ్యాతి లభిస్తుంది. దూరప్రాంతాలలో చదువుకోవడానికి, ఉద్యోగాలు చేయడానికి అవకాశాలు కలిసి వస్తాయి. ప్రేమవివాహాలు విఫలం అవుతాయి. సమాజం కోసం, కుటుంబం కోసం కొన్ని త్యాగాలు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మీ శక్తికి తగిన విధంగా కొన్ని స్థిరాస్థులు కొనుగోలు చేస్తారు. సహోదరసహోదరి వర్గం మీకు అండగా నిలుస్తారు. అనుకోకుండా జరిగిన కొన్ని సంఘటనలు మీకు లాభిస్తాయి. మీ పేరు మీద ఇతరులు చేసే వ్యాపారాలు అంతంత మాత్రంగానే ఉంటాయి. గణితంలో మంచి మార్కులు సాధిస్తారు. సాహిత్య కళారంగాలలో, టీవీ రంగాలలో పేరు తెచ్చుకోవడానికి విశేషంగా శ్రమిస్తారు. ప్రారంభంలో ఫలితాలు అంతంత మాత్రంగానే ఉంటాయి. మీతో విడిపోవాలని నిశ్చయించుకున్న వ్యక్తి న్యాయస్థానాలను ఆశ్రయించడం జరుగుతుంది. ఆత్మీయతలు, ఆపేక్షలకు తావులేదని, మానవ సంబంధాలు పూర్తిగా కలుషితం అయ్యాయి అని ఆవేదన చెందుతారు. దైవం మీద భారం వేసి మీ కార్యక్రమాలు విధిగా సాగిస్తారు. తల్లిదండ్రులు, సన్నిహితులు మీ గురించి బాధపడతారు, ఒక మధ్యవర్తి జోక్యంతో చాలా సమస్యలు పరిష్కారం అవుతాయి. చిన్న చిన్న విభేదాలను పట్టించుకోకుండా శ్రమించి శుభకార్యాలకు అడ్డం పడుతున్న ఇబ్బందులు తొలగిస్తారు. సమాజంలో ఉన్నతస్థాయి వ్యక్తులతో పోటీ పడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. బహిరంగ విభేదాలు సంభవిస్తాయి. చెవి, ముక్కు, గొంతుకలకు సంబంధించిన ఇబ్బందులు ఏర్పడుతాయి. మీ సలహాలు పాటించక నష్టపోయిన వారిని విమర్శించవద్దు, దూరం మరింత పెరుగుతుంది, వాళ్ళలో మార్పురాదు. ఇసుకనుంచి తైలం తీసే పనులు చేయవద్దు, మీ కంఠశోష వల్ల ప్రయోజనాలు లేకపోగా అందరి దృష్టిలో చెడ్డవారు అవుతారు. ఎంత వద్దనుకున్నా మీకు ఇష్టంలేని వ్యక్తి సహాయ సహకారాలు తీసుకోవలసి వస్తుంది. మీడియా సహాయ సహకారాలు లభిస్తాయి. వారసత్వ ఆస్తులు అనుకూలిస్తాయి. అతి కష్టం మీద వృత్తిఉద్యోగాలపరంగా మీ శక్తిసామర్థ్యాలకు గుర్తింపు లభిస్తుంది. బ్యాంకు అకౌంటుకు సంబంధించిన విషయాలు ఎప్పటికప్పుడు పరిశీలించుకోవడం మంచిది. దొంగస్వామీజీల, దొంగబాబాల ద్వారా నష్టపోయే పరిస్థితి ఉంది. ముఖ్యంగా స్వజనుల వలన, ఆత్మీయుల వలన ఊహించని అధర్మ నిర్ణయాలు వినవలసి వస్తుంది. మీ వాహనము, ఇల్లు, స్థిరాస్థులు మీకు అతిదగ్గరి (కొడుకు, కూతురు మొదలైన) వారి పేరు మీద ఉండడం మంచిది. గ్రహస్థితులను అనుసరించి స్పష్టంగా చెప్పాలంటే ఇంతకు మించిన దగ్గరివారు నమ్మకస్థులు లేరని నిర్ణయం తీసుకోండి. పగలు, ప్రతీకారాలు, పంతాలు, మొండి పట్టుదల ఇలాంటి వాటి వల్ల నష్టమే తప్ప లాభం ఉండదు. ప్రతిరోజూ లక్ష్మి చందనంతో,

ఆరావళికుంకుమతో మహాలక్ష్మి దేవిని పూజించండి. వైద్యరంగంలోని వారికి అనుకూలంగా వుంది. వాయిదా పద్ధతిలో కొన్ని ఆస్థులను కొనుగోలు చేస్తారు. ఉభయుక్తం లేని కొన్ని ఆలోచనల వల్ల కాలం వృథా అవుతుంది. చెప్పుడుమాటలు వినడం వల్ల నష్టపోతారు. ఎంతోకాలంగా మీరు అమ్మాలని పెట్టిన భూమిని అమ్మకం వచ్చిన సమయంలో అమ్ముకోవద్దని నిశ్చయించుకుంటారు. వృత్తిఉద్యోగాలపరంగా మీరు రాయబారం చేయడం మీకు కలిసివచ్చే అంశం కాదు. ఆరోగ్యపరిరక్షణ పట్ల, సౌందర్యపరిరక్షణ పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తారు. ఎంతోకాలంగా అనుకుంటున్న ప్రదేశాలను సందర్శిస్తారు. మహాతీర్థం పొడితో అభిషేకం చేయండి. దైవికం పొడితో ధూపం వేయండి. సుమంగళి పసుపును ఉపయోగించడం సర్వదా శ్రేయస్కరం. తీర్థయాత్రలు చేస్తారు, సనాతన విద్యల పట్ల ఆసక్తిని కనబరుస్తారు. కుడిమోకాలి నొప్పి బాధిస్తుంది. కుటుంబసభ్యులు అందరూ వారి వారి రంగాలలో స్థిరపడి అభివృద్ధి చెందాలని కోరుకుంటారు, అందుకు సంబంధించి మీ శక్తివంచన లేకుండా కృషి చేస్తారు. నమ్మిన వ్యక్తి మోసం చేయడం మీ మానసిక వేదనకు కారణం అవుతుంది. మొత్తం మీద ఈ సంవత్సరం చాలా బాగుంది.



# 2017-2018 లో కన్యారాశి ఫలితములు

| ఆదాయం - 5 | వ్యయం - 5 | రాజ - 5 | అవ - 2 |
|---|---|---|---|

**ఉత్తర 2, 3, 4 పాదములు, హస్త 1, 2, 3, 4 పాదములు, చిత్త 1, 2 పాదముల యందు పుట్టినవారు "టో, పా, పి, పూ, షం, ణా, ఠా, పే, పో" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు కన్యరాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**కన్యా రాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం విజయవంతంగా ఉంది. ఆరోగ్యం కుదుటపడుతుంది. కుటుంబవ్యవహారాల్లో, వ్యాపారంలో మంచి అభివృద్ధి లభిస్తుంది. దీర్ఘకాలపు సమస్యలు మాత్రం పరిష్కారం కావు. సహోదర సహోదరి వర్గానికి చెందిన కొన్ని బాధ్యతలు మీ నెత్తినపడతాయి. ధర్మాన్ని అధిగమించలేక, కుటుంబ సభ్యులను ఒప్పించలేక మానసిక వత్తిడికి లోనవుతారు. మీకు జరిగిన నమ్మకద్రోహానికి తగిన ప్రతీకారం తీర్చుకుంటారు. ఉన్నత స్థానాన్ని అధిరోహించడానికి మీ శత్రువులు చేసే ప్రయత్నాలకు గండికొడతారు, వైరివర్గాన్ని బలహీనపరుస్తారు. ఎదుగుదలకు అవకాశం లేకుండా చేస్తారు. ఆర్థికసంస్థలలో పనిచేస్తున్న వారు ప్రతి విషయంలోనూ జాగ్రత్త వహించాలి. ఉద్యోగంలో ప్రమోషన్ లభిస్తుంది. మీ ప్రాధాన్యత తగ్గించడానికి కొంతమంది ప్రయత్నాలు చేసినా అవి తాత్కాలికమే, మళ్ళీ అనుకున్న స్థానానికి రాగలుగుతారు. కొన్ని సందర్భాలలో సహోదరసహోదరివర్గం అండగా నిలుస్తారు, ఆశలు పెట్టుకున్న వ్యక్తులు ఆర్థిక సాయం చేస్తారు. వాస్తవాలకు అతీతంగా ఊహాలోకంలో మీరు తీసుకున్న నిర్ణయాలు మంచి ఫలితాలను ఇవ్వవు. ఏకపక్ష నిర్ణయాలు కలిసిరావు. నలుగురితో కలిసి చర్చించి, నిపుణుల సలహాలు తీసుకుని మీ ఆలోచనలను అమలు చేయండి. సంగీతసాహిత్యాది లలితకళల పట్ల ఆసక్తి పెంచుకుంటారు, సంతానాన్ని ఆ దిశగా ప్రోత్సహిస్తారు. యూనియన్ కార్యక్రమాలు, ఊరేగింపులు, ఉద్యమాలు చక్కగా నిర్వహించ గలుగుతారు. వాయిదాల చెల్లింపు మీద ఒక భూమి కానీ, అపార్ట్‌మెంట్ కానీ కొనుగోలుచేస్తారు. ఫాస్ట్‌ఫుడ్స్, బేకరీ వ్యాపారాలు, హాస్టళ్ళ నిర్వహణ మొదలైనవి మధ్యస్థంగా ఉంటాయి. హోల్‌సేల్ వ్యాపారాలు, సుగంధద్రవ్యాల వ్యాపారాలు బాగుంటాయి. లీజులు పొడిగింపబడతాయి, అగ్రిమెంట్లు, లైసెన్సులు కూడా మీకే అనుకూలిస్తాయి. ఆకస్మిక ధనం చేతికి రావడం వల్ల కొన్ని మొండి బాకీలు తీర్చగలుగుతారు. ప్రేమవివాహాలు ఫలించవు. పొదుపు పథకాలలో ధనాన్ని పెట్టుబడిగా పెట్టి కొంతమేరవరకు లాభపడతారు. ఆహారసంబంధమైన నియమాలు పాటిస్తారు. కొన్ని అవమానాలు ఎదురయ్యే సూచనలు సూచిస్తున్నాయి, సహనాన్ని కోల్పోక మనస్సును దృఢం చేసుకోవాలి. ఈ అవమానాలకి బంధువులు, సన్నిహితులే కారణం అవుతారు.

సంతానపురోగతి బాగుంటుంది, మెరిట్ మార్కులు సాధిస్తారు. వాళ్ళ భవిష్యత్తు కోసం చాలా ధనాన్ని ఖర్చుపెడతారు. మనస్సును కష్టపెట్టుకోకండి, మనోధైర్యంతో మెలగండి. మీ ద్వారా లబ్ధి పొంది ఉన్నత స్థానాలలో కూర్చున్న వ్యక్తులు మీ మాటను ధిక్కరిస్తారు. మీ ఆలనాపాలనలో పెరుగుతున్నవారు, మీకన్నా చిన్నవాళ్ళు మీ మాటను ధిక్కరిస్తారు. ఉద్యోగపరంగా మీరు తీసుకున్న నిర్ణయాలను క్రిందిస్థాయి ఉద్యోగులు వ్యతిరేకిస్తారు, చెప్పుడుమాటలు మోస్తారు. విందులు, వినోదాల వల్ల కొన్ని అపశ్రుతులు ఏర్పడతాయి. విందులు, వినోదాలకు దూరంగా కఠినమైన క్రమశిక్షణతో కాలం గడుపుతున్నా వేరే రకమైన ఇబ్బందులు వస్తాయి. మీముందు పొగడడం, మీ చాటున తిట్టడం కొందరికి నిత్యకృత్యం అవుతుంది. గట్టిగా మాట్లాడి సాక్ష్యాలను చూపించి కొన్ని వివాదాస్పద అంశాలను శాశ్వతంగా నిర్మూలించగలుగుతారు. తాత్కాలిక వేతనాల మీద ఉద్యోగం చేస్తున్న వారికి ఉద్యోగం పర్మినెంట్ అవుతుంది. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి, మంచి సంబంధం కుదురుతుంది. బరువుబాధ్యతలను దించుకోగలిగామన్న సంతృప్తి కలుగుతుంది. యూనియన్‌లకు, సంఘాలకు సంబంధించిన విషయాలకు మీ నాయకత్వంలో సలహాలు సత్ఫలితాలను సాధిస్తాయి. ఉద్యోగంలోనూ, వ్యాపారంలోనూ మార్పులు వస్తాయి. భాగస్వాములతో విసిగిపోయి నూతన వ్యాపారం ప్రారంభిస్తారు. వైద్య, న్యాయ రంగాలలోని వారు కఠిన సవాళ్ళను ఎదుర్కోవలసి వస్తుంది. మీ వృత్తి మీద దుష్ప్రచారం అనే మరకలు ఏర్పడే అవకాశం ఉంది, చేసే ప్రతి పనిని జాగ్రత్తగా ఆలోచించి చేయండి. కుటుంబంలో ఏర్పడిన అడ్డంకులు తొలగిపోతాయి, కుటుంబసౌఖ్యం బాగుంటుంది. క్రీడారంగంలోని వారికి ప్రోత్సాహకాలు, అవార్డులు లభిస్తాయి. సినీరంగంలోని వారికి మిశ్రమ ఫలితాలు, టీవీ రంగంలోని వారికి మంచి ఫలితాలు లభిస్తాయి. విద్యార్థినీవిద్యార్థులు కొంత మానసిక వత్తిడికి లోనయినప్పటికీ విజయాన్ని సాధిస్తారు. నిత్యం జ్ఞానచూర్ణాన్ని సేవించడం చెప్పదగిన సూచన, దేవాలయంలో అవినీతి మీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. గుడి, గుడిలో లింగాన్ని మింగేవాళ్ళకు ఎలాంటి శిక్ష పడుతుందోనని రకరకాలుగా ఆలోచిస్తారు. దేవుడి సొమ్ము తినడానికి వాళ్ళకి చేతులు ఎలా వస్తున్నాయో అర్థంకాక అయోమయపడతారు. మీ ప్రవర్తన వల్ల ఒక సామాజిక వర్గం మద్దతు లభిస్తుంది. మీద్వారా ఆర్థికంగా లాభపడి ఉన్నతస్థితిలో ఉండి మీకు ఏమాత్రం సహాయం చేయకుండా మొహం చాటువేసిన వ్యక్తులపై ఆగ్రహం పెంచుకుంటారు. మీ గుడ్‌విల్ మిమ్మల్ని కాపాడుతుంది. కార్యాలయంలో ఉద్యోగస్థులు చేసిన దుబారా ఖర్చులకు మీరు సమాధానం చెప్పవలసి వస్తుంది. ఆర్థికపరమైన వ్యవహారాలలో నిర్మొహమాటంగా వ్యవహరించండి. ఎవరి స్వార్థానికి వాళ్ళు డబ్బులు వాడుకుని అవి మీ ఖాతాలో వేసే అవకాశం ఉంది. స్త్రీలతో భేదాభిప్రాయాలు సూచిస్తున్నాయి, సామరస్యంగా పరిష్కరించుకోవడానికి ప్రయత్నించండి. మీ మంచితనాన్ని అసమర్థంగా భావించినవాళ్ళు కీలకసమయంలో మీచేతిలో దెబ్బతింటారు. గతంలో చేసినటువంటి పొదుపు పథకాలు ఎంతకాలం అక్కరకు వస్తాయి. విదేశీయాన ప్రయత్నాలు ఫలిస్తాయి, కానీ వెళ్ళాలా? వద్దా? అని సందిగ్ధంలో ఉంటారు. ప్రస్తుతం ఉన్నచోట ఉద్యోగం లభిస్తుంది, కుటుంబానికి ఇబ్బందిలేని పరిస్థితి ఉంటుంది. నూతన వ్యాపారాలు లాభిస్తాయి. ప్రభుత్వపరంగా సబ్సిడీలు చేతికి అందుతాయి. ప్రభుత్వపరంగా కొన్ని ప్రతిష్ఠాత్మకమైన కాంట్రాక్టులు మీకు లభిస్తాయి. నిర్మాణసంబంధమైన పనులు చురుకుగా సాగడం వలన ఆర్థికపరిస్థితి ఓ దారిన పడుతుంది.

లైసెన్సులు, లీజులు పొడిగింపబడతాయి. ఉన్నతాధికారులు, ఉన్నతస్థాయిలో ఉన్న స్నేహితుల వల్ల మేలు పొందగలుగుతారు. అయితే ఎంత సంపాదించినా చేతిలో ధనం నిలువదు. ఉద్యోగపరంగా సంస్థ నుంచి ఒకరిని తొలగించవలసిన పరిస్థితి వస్తుంది, దానికి మీరే బాధ్యులని మీపై దుష్ప్రచారం జరుగుతుంది. ఈ విషయంలో మీకు ఏమాత్రం సంబంధం లేదని చెప్పినా ఇతరులు మీ మాట నమ్మరు. వృత్తిఉద్యోగాలపరంగా పనికిమాలిన బాధ్యతలు నెత్తిన పడతాయి. వీటిని తప్పించుకోవడం వీలులేని పరిస్థితి, వీటి వల్ల ఎటువంటి ఉపయోగం లేని పరిస్థితి ఏర్పడుతుంది. విద్యాపరంగా సంతానం మీరు అనుకున్న స్థానానికి చేరుకోగలుగుతారు. నరదృష్టి అధికంగా ఉంది. నాగసింధూరం నొసటన ధరించండి, అష్టమూలికా గుగ్గిలంతో ఉదయం సాయంత్రం ధూపం వేయటం చెప్పదగిన సూచన. సహోదరసహోదరి వర్గంలోని వారికి మీ పరపతి ఉపయోగించి ఉద్యోగం ఇప్పించగలుగుతారు. మీరు కుటుంబబాధ్యతలను విస్మరించరు. మీ పలుకుబడి వల్ల ఓ దుర్మార్గవర్గం ఉన్నతస్థానాలకు వెళ్ళకుండా నివారించగలుగుతారు. ప్రతిరోజూ సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. విదేశాలలో ఉన్న మిత్రులతో కలిసి ఇక్కడ చేస్తున్న వ్యాపారాలు లాభిస్తాయి. న్యాయబద్ధంగా, ధర్మబద్దంగా ఎవరికి రావల్సిన వాటాలు వారికి పంపకం చేస్తారు. మీరు సంపాదించిన ఓ పెద్ద మొత్తాన్ని అంతరంగిక మిత్రుల దగ్గర దాచిపెడతారు. కొంతమందితో స్నేహాన్ని వదులుకోమని కుటుంబసభ్యుల నుండి ఎంత వత్తిడి వచ్చినా కుటుంబసభ్యులను వదులుకోవడానికి సిద్ధపడతారు కానీ స్నేహాన్ని వదులుకోవడానికి ఇష్టపడరు. అరిష్ట ఉద్వాసనకు నవగ్రహాల దగ్గర నవగ్రహ వత్తులతో దీపారాధన చేయండి. మిమ్మల్ని మీరు అదుపు చేసుకోవడంలో మనస్సు నిగ్రహం చేసుకోవడంలో దృఢమైన మనస్సు కలిగి ఉంటారు. వేళకు తిండి నిద్రా కరవు అవుతాయి, ఇది ఆరోగ్యం మీద ప్రభావం చూపే అవకాశం ఉంది, శ్రద్ధ వహించండి. విలువైన ఆభరణాలను ఇతరత్ర విలువైనటువంటి వాటిని తనఖా పెడతారు, అతిత్వరలోనే వాటిని విడిపిస్తారు. ఉద్యోగానికి సెలవు పెట్టి అదనపు ఆదాయపు మార్గాలను అన్వేషిస్తారు. వ్యసనాలకు బానిస కాకపోయినా కొద్దిగా ఆ గాలి సోకుతుంది. సంవత్సర ద్వితీయార్ధంలో మీరు తీసుకున్న నిర్ణయాలు వివాదాస్పదం అవుతాయి. అరుదైన వస్తువులను సేకరిస్తారు. కుటుంబ వ్యవహారాలలో, బంధువుల ప్రమేయం వల్ల కొన్ని వివాదాలు చోటుచేసుకుంటాయి, పరిష్కరించడానికి వీలులేనటువంటి సమస్యలు తలెత్తుతాయి. మీ బంధువర్గంలో పదే పదే మీ నుండి ఆర్థికసాయం ఆశిస్తున్న వాళ్ళు విసిగించడం మొదలుపెడతారు, వాళ్ళను వదిలించుకోవడం కష్టతరం అవుతుంది. భూమి కౌలుకు ఇవ్వడం కానీ, అమ్మకానికి పెట్టడం కానీ మంచిది కాదని ఆపివేస్తారు. గృహనిర్మాణ సంబంధమైన వ్యాపారాలు, ఆహారసంబంధమైన వ్యాపారాలు బాగుంటాయి. సంతకాలు చేసిన ఖాళీ చెక్కులు ఇంట్లో ఉంచే సాంప్రదాయానికి స్వస్తి చెప్పండి. ప్రైవేటుసంస్థల నుండి వ్యాపారపరమైన ఆర్డర్లు వస్తాయి. ఫైనాన్స్ స్కీంలు, లక్కీ డ్రాలు, షేర్లు, కోడిపందాలకు, గుర్రపుపందాలకు పేకాటకు దూరంగా ఉండటం ఎంతైనా శ్రేయస్కరం. ఆదాయపు పన్ను అధికారుల వల్ల ఇబ్బందులు ఏర్పడతాయి. దైవానుగ్రహం వల్ల ఎలాంటి నష్టం జరగకుండా బయటపడతారు. శత్రువర్గం పొంచి ఉందని గ్రహించండి, శత్రువర్గాన్ని కోలుకోలేని దెబ్బ కొడతారు. నూతనవ్యాపారానికి ఆర్థిక వనరులను సమకూర్చుకోగలుగుతారు. నష్టాల బాటలో

**గోమహాలక్ష్మికి అర్పించే గుప్పెడు పచ్చిక కొండంత పుణ్యాన్ని ఇస్తుంది.**

నడుస్తున్న ఒక సంస్థను ఉమ్మడిగా కొనుగోలుచేస్తారు. గతించినవారి ఆత్మశాంతి కోసం కొన్ని మంచి పనులు చేస్తారు. అంతరంగిక చర్చలు, రహస్య విషయాలు బయటకు పొక్కడం వల్ల ప్రయోజనాలు దెబ్బతినే పరిస్థితి వస్తుంది. సహచర వర్గం వల్ల, ముఖ్యమైన అధికారుల వల్ల ఈ రకమైన ఇబ్బందులను అతి కష్టం మీద అతిక్రమించగలుగుతారు. పోలీసుకేసులు, చిల్లరమల్లర అభియోగాలతో చట్టపరమైన సమస్యలలో చిక్కుకున్న మీ వారిని రక్షించవలసిన బాధ్యత మీపై పడుతుంది, మీ పరపతి దుర్వినియోగం అవుతుంది. ఇన్సూరెన్స్‌ల పట్ల జాగ్రత్త వహించండి. ఒకప్పటి మిత్రులతో భేదాభిప్రాయాలు చోటు చేసుకుంటాయి. మీ సహనానికి అగ్నిపరీక్షలు ఎదురవుతాయి. వ్యవసాయ సంబంధమైన విషయాలు మధ్యస్థంగా ఉంటాయి. ప్రేమపెళ్ళిళ్ళు ప్రధాన ప్రస్తావన అంశంగా మారుతాయి, తలనొప్పిగా పరిణమిస్తాయి. మీ ప్రతిష్టను కాపాడుకోవడానికి, స్వంత వ్యక్తులను వదులుకోవడానికైనా సిద్ధపడతారు. నిర్మాణసంబంధమైన లోన్లు తీసుకోవడానికి కొన్ని ఇబ్బందులు ఎదురవుతాయి. తలనొప్పి, పార్శ్వపు నొప్పి కొంత ఇబ్బందికి గురిచేస్తాయి, హోమియోపతి వైద్యం వల్ల కొంత ఉపశమనం లభిస్తుంది. పంచాయితీలు, రాయబారాలు, కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. రాత్రిపూట చేసే దీర్ఘాలోచనలు కలిసివస్తాయి. స్త్రీలకు సంబంధించిన దీర్ఘకాలిక సమస్యలను పరిష్కరించుకోగలుగుతారు. సమాజంలో గౌరవస్థానంలో ఉన్న వారికి మీ స్వంత వ్యక్తులే మీ గురించి చెడుగా చెప్పడం జరుగుతుంది. అసూయకు అవధులు, భవబంధాలు లేవని గ్రహిస్తారు. మచ్చలేని మనిషిగా ప్రఖ్యాతి నిలుపుకోవడానికి మీరు ప్రయత్నం చేస్తారు. అతికష్టం మీద పోటీపరీక్షలలో అనుకూలమైన ఫలితాలు సాధిస్తారు, ఇది మీ జీవితంలో మైలురాయిగా నిలుస్తుంది. కుల, మత, ప్రాంతీయ, వర్గ ద్వేషాలు బాధిస్తాయి, వీటివల్ల నష్టపోతారు. ఆధ్యాత్మిక ప్రపంచంలో ఒక గౌరవనీయమైన పదవికి కానీ, అవార్డుకు కానీ మీ పేరు సిఫార్సు చేయబడుతుంది. పరిశోధనారంగంలోని వారికి అనుకూలంగా ఉంది. మేధావులతోటి, సామర్థ్యం కలిగిన వారితోటి విభేదాలు ఏర్పరచుకోకండి. సమాజంలో పలుకుబడి కలిగిన కీలకవ్యక్తులను మీ స్నేహితులుగా మలుచుకోవడంలో విజయం సాధిస్తారు. మీ కీర్తిప్రతిష్టలకు ఎటువంటి మచ్చా రాకుండా జాగ్రత్త వహించండి. వ్యూహప్రతివ్యూహాలను రచించడంలో ఎంతో జాగ్రత్త తీసుకుంటారు. మీ వైరివర్గాన్ని తప్పుదోవ పట్టించడానికి మీరు పన్నిన వ్యూహం ఫలిస్తుంది. సంవత్సర ద్వితీయార్ధంలో దూరప్రాంతాలకు వెళ్ళి చదువుకోవాలనే మీ ఆలోచనలకు, ప్రయత్నాలకు కొన్ని ఇబ్బందులు ఏర్పడతాయి. కీలకమైన బాధ్యతలను సక్రమంగా నెరవేర్చగలుగుతారు. మీ వర్గానికి సంపూర్ణ న్యాయం చేయగలుగుతారు. పక్షపాత వైఖరితో వ్యవహరించారని మీపై విమర్శలు వస్తాయి, మీ నిర్ణయాలపై కొంతమంది వ్యక్తులు న్యాయస్థానాలను ఆశ్రయిస్తారు. ఇతరుల దుష్ప్రభావం, మాటల ప్రభావం సంతానం మీద ఉన్నదని గ్రహిస్తారు, వాళ్ళని సరైన దారిలోకి తీసుకురావడానికి చాలా శ్రమిస్తారు. మీ మాట వినకుండా మీ సన్నిహితవర్గం ఆరంభ సూరత్వంతో కొన్ని వ్యాపారాలు ప్రారంభిస్తారు, అవి పురిటిలోనే సంధి కొడతాయి. మీవాళ్ళు చేసిన పనికి ఎంతో కోపం వస్తుంది అదే సమయంలో వాళ్ళను ఆదుకోవాల్సిన బాధ్యతా మీపై పడుతుంది. సనాతన విద్యల పట్ల ఆసక్తి చూపుతారు. చిన్నపాటి ప్రయోజనాలకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. శుభకార్యాలకు సంబంధించిన చర్చలు

ఫలిస్తాయి. మీపై ఉన్న బరువుబాధ్యతలను తీర్చుకుంటారు. నూతనంగా చేపట్టిన వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి, సందర్భాలను బట్టి నిర్ణయాలు తీసుకుంటారు. మీవి ఏకపక్ష నిర్ణయాలు అని విమర్శలు వచ్చే అవకాశం ఉంది. పాతస్నేహాలు, కొత్త స్నేహాలు కలిసి మానసిక ఉత్సాహానికి కారణం అవుతాయి. మధ్యవర్తులను మీ మనుషులుగా మార్చుకుంటారు. ఒకానొక సందర్భంలో మీ సామాజికవర్గం వారే మిమ్మల్ని దూరంగా ఉంచడం కొంత ఇబ్బందికరమైన పరిణామంగా మారుతుంది. స్వంతవిషయాలకు, స్వంతమనుషులకు సంబంధించిన విషయాలకు అధికంగా ఖర్చు పెడతారని మీమీద వచ్చిన ఆరోపణలకు కాలమే సమాధానం చెబుతుంది. దొంగస్వామీజీల వల్ల దొంగబాబాల వల్ల నష్టపోతారు. పంతాలకు, పట్టింపులకు పోకుండా చర్చలతో సమస్యలు పరిష్కరించడానికి ప్రాధాన్యతనిస్తారు. దివాళా తీసిన ఒక ఆర్థికసంస్థ నుంచి కొద్దో గొప్పో ధనం వస్తుందని ఆశిస్తారు, మీ ఆశ నిరాశ అవుతుంది. గత్యంతరంలేని పరిస్థితిలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయించాల్సిన పరిస్థితి వస్తుంది. మీకు సన్నిహితులైనవారు విడాకులు తీసుకోవడం, భార్యాభర్తలు విడిపోవడం వంటి సంఘటనలు మీ మనోవేదనకు కారణం అవుతాయి. రాబోయే రోజులు గడ్డురోజులు అని వాటిని ఎదుర్కోవడం మీవల్ల కాదని నిరుత్సాహపరిచే వ్యక్తులను దూరంగా ఉంచండి. మీ స్వయంకృతాపరాధాలు, తప్పిదాలు పెద్దగా నష్టపరచవు. మీరు అభిమానించిన ఒక వ్యక్తిని ఒక స్థాయికి తీసుకువస్తారు. ఒకనాడు శత్రువులు, మీకు మిత్రులు కావడం వల్ల మీకు మనశ్శాంతి, ఊరట కలుగుతుంది. నమ్మకద్రోహాన్ని, కృతఘ్నులను మీరు భరించలేరు, ఇలాంటి సంఘటనలు పదేపదే గుర్తుకు వచ్చి మనస్సును బాధిస్తాయి. కొన్ని సమస్యలని ఒంటరిగానే ఎదుర్కోవలసివస్తుంది, మొండి ధైర్యంతో సమస్యలను దాటుకుని అనుకూల ఫలితాలు సాధిస్తారు. గ్రీన్‌కార్డు లభించే ప్రయత్నాలు దాదాపు చివరిదశకు చేరుకుంటాయి. నవగ్రహ దోష నివారణార్థం సర్వరక్షా చూర్ణంతో స్నానమాచరించండి. సర్పదోష పరిహారార్థం సర్వరక్షా చూర్ణంతో ప్రతిరోజూ స్నానమాచరించడం వల్ల శుభప్రదమైన ఫలితాలు సంప్రాప్తిస్తాయి. ఏలిననాటి శని ప్రభావం నడుస్తున్నది కాబట్టి అఘోర పాశుపత హోమం చేయించండి.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. స్వయం సంపాదన ఏర్పడుతుంది, విద్యారంగంలోనూ, సాంకేతికరంగంలోనూ రాణిస్తారు. అభిమానించే వ్యక్తులు కీలక సమయాలలో సమాధానం చెప్పకుండా ముఖం చాటువేస్తారు. నమ్మి మోసపోయామన్న భావం కలుగుతుంది. వైద్యవిద్యలో రాణిస్తారు. వైద్యవిద్య అభ్యసించడానికి తగిన అవకాశం లభిస్తుంది. కొన్ని విషయాలలో అలుపెరుగని ఒంటరి పోరాటం చేయవలసి వస్తుంది. ఫలితాలు ఎలాగున్నా కృషిలో మాత్రం లోపం ఉండకూడదు అని నిర్ణయించుకుంటారు. మీ మనస్సుకు ఇష్టం లేకపోయినా తల్లిదండ్రులు, పెద్దల మాటలను గౌరవిస్తారు. సాంస్కృతిక, కళారంగాలలో రాణిస్తారు, అవార్డులు, రివార్డులు లభిస్తాయి. టీవీ రంగంలో ఉన్నవారికి మంచి అవకాశాలు వస్తాయి. నామినేటెడ్ పదవి లభిస్తుంది లేదా రాజకీయపదవి లభిస్తుంది. ఎలాంటి సమస్యలు ఎదురైన ధైర్యంగా ఎదుర్కొంటారు, మీ మనోధైర్యమే చాలా విషయాలలో మిమ్మల్ని రక్షిస్తుంది.

యోగా, మెడిటేషన్ వంటివి మంచి ఫలితాలను ఇస్తాయి. అన్యభాషలు నేర్చుకోవాలన్న మీ కోరిక నెరవేరుతుంది. మార్షల్ ఆర్ట్స్, డ్రైవింగ్ నేర్చుకుంటారు. మాతృభాషలో పరిజ్ఞానం కోసం తంటాలు పడతారు. సంతానం విషయంలో కొంత కఠినంగా వ్యవహరిస్తారు. వాళ్ళను ఓ మంచి దారిలో పెట్టడానికి మీరు చేసిన కృషి ఫలిస్తుంది. మీ పేరు మీద ఇతరులు చేసే వ్యాపారాలు లాభిస్తాయి. వారసత్వంగా రావలసిన ఆస్తులు, ధనం వస్తాయి. పోటీపరీక్షలలో మంచి విజయం సాధించి, మంచి ఉద్యోగం సాధిస్తారు. ప్రైవేట్ ఉద్యోగాలలో మార్పులు చేర్పులు సూచిస్తున్నాయి. శారీరకమైన, మానసికమైన వత్తిడి తట్టుకోలేక వేరే ఉద్యోగం లభిస్తే బాగుంటుందని భావిస్తారు, మంచి అవకాశాలు కలిసి వస్తాయి, వాటిని సద్వినియోగం చేసుకుంటారు. కార్యాలయంలో రాజకీయాలు చికాకుపరుస్తాయి. పాత ఋణాలు తీర్చి వేస్తారు, కొత్త ఋణాలు చేస్తారు. స్వగృహం అనే కల నెరవేరుతుంది, వాహనాన్ని కొనుగోలు చేస్తారు. మారుతున్న దేశకాలమాన పరిస్థితులు మీపై ప్రభావం చూపుతాయి. కొన్ని ముఖ్యమైన విషయాలకు సంబంధించి జీవితభాగస్వామితో విభేదాలు వచ్చే అవకాశాలు గోచరిస్తున్నాయి, ఏ పరిస్థితులు ఎలాగున్నా ఓర్పుతో సంయమనంతో ప్రవర్తించండి. విద్యారంగంలో మెరిట్ మార్కులు సాధిస్తారు. విదేశాలలో నివసిస్తున్న వారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. అధ్యాపకవృత్తిలో ఉన్న వారికి మంచి పేరు ప్రఖ్యాతులు సూచిస్తున్నాయి. బ్యూటీపార్లర్లు నడిపేవారికి, వస్త్ర వ్యాపారులకు, ప్రభుత్వ సహకారంతో చిన్న చిన్న చేతివృత్తి పనులు చేసుకునే వారికి కాలం అనుకూలంగా ఉంది. కుటుంబపరంగా కొన్ని స్థిరాస్తులు కొనుగోలు చేయడానికి శక్తివంచన లేకుండా పాటుపడతారు. జ్యేష్ఠ సంతాన విషయంలో ప్రత్యేక జాగ్రత్తలు తీసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. సహోదరసహోదరి వర్గం అన్ని విషయాలలో మీకు అండగా నిలుస్తారు. అవివాహితులకు వివాహకాలం, సంతానంలేని వారికి సంతానప్రాప్తి. ప్రతిరోజూ దైవికం పొడితో ధూపం వేయండి, ఆరావళి కుంకుమతో మహాలక్ష్మీ పూజ చేయండి. మహాలక్ష్మీ పూజలో లక్ష్మీచందనం ఉపయోగించడం వల్ల మంచిఫలితాలు సంభవిస్తాయి. మీతో విడిపోవాలని నిశ్చయించుకున్నవారు న్యాయస్థానాలను ఆశ్రయిస్తారు. ఆత్మీయతలకు, ఆపేక్షలకు తావులేదని మానవసంబంధాలు పూర్తిగా కలుషితం అయ్యాయని ఆవేదన చెందుతారు, జీవితాన్ని మరో మార్గంలో మళ్ళిస్తారు. దైవం మీద భారం వేసి తల్లిదండ్రులు, సన్నిహితులు మీ గురించి ఆవేదన చెందుతారని ఆవేదనపడతారు. ఒక మధ్యవర్తి జోక్యంతో చాలా సమస్యలు పరిష్కారం అవుతాయి. నిత్యం అష్టమూలికా తైలంతో, లక్ష్మీతామర వత్తులతో లక్ష్మీ ఆరాధన చేయండి. నిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో సర్వ రక్షాచూర్ణాన్ని కలిపి స్నానమాచరించండి.



**సర్వరక్షా చూర్ణం**

నవగ్రహముల మూలికలు సమిధలను చూర్ణం చేసి తయారుచేసినది సర్వరక్షా చూర్ణం. అన్ని గ్రహముల బాధలు (కుజగ్రహ సంబంధిత బాధలు కూడా) తొలగిపోయి మంచి జరుగుతుంది.



# 2017-2018 లో తులారాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 2 | వ్యయం - 8 | రాజ - 1 | అవ - 5 |

**చిత్త 3, 4 పాదములు, స్వాతి 1, 2, 3, 4 పాదములు, విశాఖ 1, 2, 3 పాదముల యందు పుట్టినవారు "రా, రి, రూ, రే, రో, త, తీ, తూ, తే" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు తులారాశికి చెందినవారు.**

# 2017-2018 సంవత్సర ఫలితములు

**తులారాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. పాతసమస్యలు పరిష్కారం అవుతాయి, కొత్తసమస్యలు పుట్టుకొస్తాయి. ఆర్థికపరిస్థితి అంతంతమాత్రంగా ఉంటుంది. వృత్తిఉద్యోగాలలో నూతన మార్పులు వస్తాయి. సామాజికంగా వచ్చిన మార్పులు మీపై ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ ప్రభావం చూపుతాయి. విద్యాసంబంధమైన విషయాలలో కొన్ని ఆటంకాలను అధిగమిస్తారు. మీకు అనుభవంలేని రంగంలో పెట్టుబడి పెట్టి కొద్దిపాటి విజయాలు సొంతం చేసుకోగలుగుతారు. ఎదురులేదు అనుకున్న ఉద్యోగంలో ఎదురుదెబ్బలు తగులుతాయి. ఓ ప్రాంతాన్ని అభివృద్ధిపరిచే బాధ్యత మీపై పడుతుంది. నిధులు లేని విధులు నిర్వహించడం ఓ భారం అవుతుంది. నిధుల విషయమై ప్రజలలో అపోహలు చోటుచేసుకుంటాయి. ఆర్థికపరిస్థితి మెరుగుపరుచుకోవడానికి ఎన్నో మార్గాల ద్వారా ఎన్నో ప్రయత్నాలు చేస్తారు, ఫలితాలు గొప్పగా లేకపోయినా నిరుత్సాహంగా ఉండవు. సమాజంలో పరపతి కలిగిన వ్యక్తులతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. సాంకేతిక, వైద్యవిద్యలలో రాణిస్తారు. ప్రతిష్ఠాత్మకమైన విద్యాసంస్థలలో ఏదోరకంగా సీటు లభిస్తుంది. ప్రజాసంబంధాలు పెంచుకోవడానికి నమ్మకస్తులైన అనుచరవర్గాన్ని ఏర్పర్చుకోవడానికి విశేషంగా శ్రమిస్తారు. దైనందినజీవితంలో ఖర్చులు అధికంగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల పట్ల ప్రత్యేకమైన శ్రద్ధవహిస్తారు. అంతరంగిక విషయాలలో ఇతరుల జోక్యాన్ని నిరోధిస్తారు. జ్యేష్ఠ సంతాన విషయమై కొద్దిపాటి ఇబ్బందులు ఎదురవుతాయి, వాటిని సరిదిద్ది వాళ్ళను సక్రమమైన మార్గంలో పెట్టడానికి కొద్ది సమయం పడుతుంది. మీ ప్రయోజనాలు మీకు అందుతాయి. విదేశాలలో విద్యాభ్యాసానికి అవకాశాలు లభించినా కొన్ని అంశాలు ఇబ్బందికరంగా మారతాయి. కొంతమంది ప్రభుత్వఅధికారులు, మీ వైరివర్గం చేతిలో కీలుబొమ్మలుగా మారి మీకు ఇబ్బందులు సృష్టిస్తారు. సహోదరసహోదరి వర్గానికి చెందిన కొన్ని బాధ్యతలలో మీరు సహకారం అందించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. నైతికధర్మాన్ని అధిగమించలేక, కుటుంబసభ్యులను ఒప్పించలేక మానసిక వత్తిడికి లోనవుతారు. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. దూరప్రాంతంలో ఉన్న మీ ఆత్మీయుల వల్ల ఆర్థికసాయం లభిస్తుంది. విడిపోయినటువంటి మిత్రవర్గం తిరిగి దగ్గరవుతారు. యూనియన్ కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొంటారు.

**తల్లిదండ్రుల తరువాత హితాన్ని కోరేవాడు స్నేహితుడొక్కడే.**

కళారంగంలో రాణిస్తారు. క్రీడలలో గుర్తింపు వస్తుంది, అవార్డులు లభిస్తాయి. విలాసవంతమైన జీవితం గడపాలని ఊహాగానాలు చేస్తారు. పోటీపరీక్షలకు సంబంధించి విశేషంగా కష్టపడతారు, మొక్కుబడిగా కాక ఇష్టపడి చదువుతారు. ఆరోగ్యపరిరక్షణకు, శారీరక పరిరక్షణకు ప్రాధాన్యతనిస్తారు. కొద్దిపాటి పెట్టుబడులతో చేసే వ్యాపారాలు లాభిస్తాయి. గనులు, ఇసుక వ్యాపారం బాగా లాభిస్తుంది. రాజకీయపరపతి పెంచుకో గలుగుతారు. కొంతమంది రాజకీయ నాయకులకు మీరు అంతరంగికులు అవుతారు. నిర్మాణసంబంధమైన పనులు నత్తనడకగా నడుస్తాయి. పనులలో లోపాలను గమనిస్తారు, ముందు జాగ్రత్తలు తీసుకుని ఎవరివల్లా మాటపడకుండా బయటపడతారు. ఇతరులు చేసినటువంటి పనికిమాలిన పనులకు మీరు బాధ్యత వహించవద్దు. ఇంటి విషయాలను నిర్లక్ష్యం చేస్తున్నారని మీపై నిందారోపణలు వస్తాయి. జ్యేష్ఠ కుమార్తె లేదా జ్యేష్ఠ కుమారుడి విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాల్సి ఉంటుంది. స్నేహితుల వల్ల పిల్లలు వక్రమార్గం పట్టకుండా జాగ్రత్త వహించండి. వ్యాపారంలో భాగస్వాములను అతిగా నమ్మవద్దు. మీ ఎదుగుదల కొంతమందికి కంటకంగా మారుతుంది. అసూయగ్రస్తులైన ఇటువంటివారితో మీస్నేహితులు కూడా చేరిపోవడం మీకు ఆశ్చర్యం కలిగించే అంశంగా మారుతుంది. **"చీకటిని చీల్చి రవికిరణం ప్రకాశించినట్లు"**గా ఎంతో శ్రమించగా వచ్చిన ఫలితాలు ఆనందడోలికలలో మిమ్మల్ని మైమరిపిస్తాయి. మాయో, మర్మమోగాని కొందరి జీవితం వడ్డించిన విస్తరి, కష్టపడకుండానే ఫలితాలు చేతికి అందివస్తాయి. కాదు కాదు వారు ఇతరుల కష్టాన్ని, వాటి తాలూకు ఫలితాలను నక్క తెలివితో తమకు అనుకూలంగా మలచుకుంటారు. ఆశించే లాభాలు మీచేతికి అందుతున్న వేళ ఇటువంటి వాళ్ళే మీకు దగ్గరవుతారు, జాగ్రత్తవహించండి. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న సంస్థలు పురోగమన దిశగా పయనిస్తాయి. వ్యాపారంలో రొటేషన్ తగినంత లాభించదు. జమాఖర్చుల పద్దులను జాగ్రత్తపరుచుకోండి. పన్నులు వసూలు చేసే అధికారుల వల్ల ఇబ్బందులు ఎదురుకావచ్చు. చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునే వారికికాలం చాలా అనుకూలంగా వుంది. ఉద్యోగపరంగా నూతన అవకాశాలు కలిసివస్తాయి. అయితే ఆర్థికఅంశాలను దృష్టిలో ఉంచుకుని ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగం చేయటమా? మానివేయడమా? ఏం చేయాలి? ఎటూ తేల్చుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది. ఉపయోగం లేని వ్యక్తుల సాంగత్యం ఇబ్బందికరంగా మారుతుంది, వాళ్ళను వదిలించుకోవడానికి చాలా కష్టపడతారు. ప్రభుత్వసంబంధమైన కాంట్రాక్టులు, లీజులు, రెన్యువల్స్ మీకు లాభిస్తాయి. స్థిరాస్తులకు సంబంధించిన అంశాలు మీకు అనుకూలంగా మారతాయి. మేలు చేస్తారని భావించిన వ్యక్తులు ముఖం చాటువేస్తారు, కీడు చేస్తారని భావించిన వ్యక్తులు మీకు మేలు చేస్తారు. సహోదరసహోదరి వర్గం సమాజంలో మంచి స్థాయి సాధిస్తారు, మీకు అండగా నిలబడతారు. క్రయవిక్రయాలవల్ల ఆర్థిక ప్రయోజనాల కోసం మిమ్మల్ని తప్పుదోవ పట్టించే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. మహోన్నతమైన వ్యక్తులతో కలిసి పనిచేయాలన్న మీ ఆకాంక్ష నెరవేరుతుంది. విద్య, వైద్య, న్యాయరంగంలోని వారికి, ఎగుమతి, దిగుమతి వ్యాపారస్తులకు, లోహపు వ్యాపారస్థులకు, ఆహారసంబంధమైన వ్యాపారాలకు అనుకూలంగా ఉంది. పుణ్యక్షేత్రాలను సందర్శిస్తారు. శుభకార్యాలు దైవానుగ్రహం వల్ల ముడిపడతాయి. ఆధ్యాత్మికపరమైన ప్రసంగాలు మిమ్మల్ని ఎంతగానో ఆకర్షిస్తాయి. బంగారు, వెండినగల భద్రత విషయంలో జాగ్రత్త వహించాలి. దొంగస్వామీజీల వల్ల, దొంగబాబాలవల్ల

నష్టపోతారు. 2017 ఏప్రిల్ నుంచి ఆర్థికవ్యవహారాలు బాగుంటాయి, ఋణాలు తీరుస్తారు, రావలసిన ధనం చేతికి అందుతుంది. రహస్యంగా స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. నిరుద్యోగులైన విద్యావంతుల శక్తిసామర్థ్యాలకు తగిన ఉద్యోగం లభిస్తుంది. గుర్తింపు లభించలేదని మీరు పడినటువంటి బాధకు ఉపశమనం కలుగుతుంది. సంతానపురోగతి బాగుంటుంది. అనంతమైన వారి కోరికలు తీర్చడానికి మిక్కిలి శ్రమించాల్సి వస్తుంది, ధనం ఖర్చు చేయవలసి వస్తుంది. కొన్ని సందర్భాలలో సంతానం మీద ప్రేమ కొద్ది ఈ విధంగా చేస్తున్నానా? లేక వారి బెదిరింపులకు తలొగ్గి ఈ విధంగా చేస్తున్నానా? అనే సందేహం వస్తుంది. కంటికి సంబంధించి సైటు వచ్చే అవకాశం, సైటు పెరిగే అవకాశం ఉంది. మీకు అత్యంత సన్నిహితమైన మిత్రవర్గాన్ని కూడా ఉపేక్షించకుండా కఠిన చర్యలు తీసుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడుతాయి. కార్యాలయ సంబంధమైన విషయాలు కొన్ని కల్పనలతో మీడియా ద్వారా వెల్లడి అవుతాయి. కార్యాలయ ప్రతిష్ఠకు తాత్కాలిక భంగం కలుగుతుంది. ఆర్థికంగా పరిపుష్టి సాధించడానికి మీ ప్రణాళికలకు తగినటువంటి విషయాలకు ఓ ఉన్నతవ్యక్తి సహకారం లభిస్తుంది. ఖాళీస్థలాలు, తోటలు, వ్యవసాయ సంబంధమైన విషయాలు సానుకూలపడతాయి. స్త్రీ సంతానానికి సంబంధించిన విషయాలు సంతోషపెడతాయి. వాళ్ళ పురోగతి బాగుంటుంది. అయితే కొన్ని సందర్భాలలో వాళ్ళు మిమ్మల్ని దిక్కరించే పరిస్థితి ఏర్పడుతుంది. ఒక ఉన్నతమైనటువంటి పదవికి ప్రభుత్వం మీ పేరు సిఫార్సు చేస్తుంది. గతంలో మీ వల్ల ప్రయోజనాలు పొంది, రాజకీయంగా ఉన్నతస్థానాలు పొందిన వ్యక్తులు తిరిగి మీ సహాయ సహకారాలు అర్థిస్తారు. నక్క మనస్తత్వం కలిగిన వ్యక్తులను మళ్ళీ ప్రోత్సహించకూడదని కఠిన నిర్ణయాలు తీసుకుంటారు, మీ సహాయ సహకారాలు అందించరు. మీ విలువ, గుడ్‌విల్ చాలామందికి తెలిసివస్తుంది. ఉన్నతస్థానంలో ఉన్నటువంటి రాజకీయనాయకులు, అధికారులు మీ శ్రమ గుర్తిస్తారు. స్త్రీలతో ఏర్పడినటుంటి సమస్యలు తొలగిపోతాయి. ఇతరులు మీ పేరుమీద చేసే వ్యాపారాలు కలిసివస్తాయి. ప్రభుత్వసంబంధమైన పైరవీలు అనుకూలిస్తాయి. ఊహించనటువంటి పరిణామాలు వృత్తిఉద్యోగాలలో ఎదురైనా మీ తెలివితేటలతో వాటిని అధిగమించగలుగుతారు. ఫిక్స్‌డ్ డిపాజిట్ రూపంలో ధనాన్ని దాచిపెడతారు. ఈ విధంగా దాచిన సొమ్ము మీరు అనుకున్న వ్యక్తులకు ఉపయోగపడాలని ఆశిస్తారు. ఇతరుల బలవంతం మీద ఫైనాన్స్ స్కీమ్స్‌లో చేరుతారు, అందువల్ల కొన్ని చేదు అనుభవాలు ఎదురవుతాయి. షేర్స్ వ్యాపారం మంచిది కాదు అని గ్రహిస్తారు. కుటుంబంలో ఐకమత్యం లోపించడం వల్ల కొద్దికాలం మానసిక ప్రశాంతత కరువవుతుంది. సర్దుకుపోయే మీ మనస్తత్వం వల్ల మీరు ఆశించిన మార్పులు ఇతరులలోనూ, స్వంతవారిలోనూ వస్తాయి. తక్కువ వ్యవధిలో సాగే తాత్కాలిక వ్యాపారాలు, వీటికి సంబంధించిన అంశాలు అనుకూలంగా ఉంటాయి. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండమని చెప్పదగిన సూచన. ఫోర్జరీ సంతకాలు, ఆకాశరామన్న ఉత్తరాల ద్వారా చిక్కులు ఏర్పడతాయి. ఆయుర్వేదం పట్ల మక్కువ పెరుగుతుంది. బలవంతులైన ప్రత్యర్థుల బలహీనతలు మీకు దొరకుతాయి, వాటిని మీరు సక్రమంగా వినియోగించుకోగలుగుతారు. సంవత్సర ద్వితీయార్ధంలో వ్యాపారపరమైన నిర్ణయాలు లాభిస్తాయి. గ్రీన్‌కార్డు కోసం ప్రయత్నించే వారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. కొన్ని విషయాలు కుదుటపడటం వల్ల కుటుంబసభ్యుల పట్ల మానసిక వ్యధ తీరుతుంది. గతంలో కొనుగోలు చేసినటువంటి స్థిరాస్తులకు మంచి ధరలభిస్తుంది. కాలం సజావుగా సాగుతున్నప్పటికీ

వర్గవైషమ్యాలు, మధ్యవర్తిత్వాలు, రాయబారాలు విసుగు కలిగిస్తాయి. వాటిని వదిలించుకోలేని పరిస్థితి, పూర్తిగా వదిలిపెట్టలేని పరిస్థితి ఏర్పడుతుంది. కోపాన్ని అదుపులో ఉంచుకోవడం వల్ల చాలా విషయాలలో లాభపడతారు. అంతరంగికులు అని మీరు నమ్మి ఇతరుల గురించి మీరు చేసిన వ్యాఖ్యలు వివాదాస్పదం అవుతాయి. మీ అంతరంగిక వర్గం మీ మనస్సులోని భావాలను బయటపెట్టడం వలన ఈవిధంగా జరుగుతుంది. ప్రేమపెళ్ళిళ్ళ విషయంలో కఠినంగా వ్యవహరిస్తారు, రక్త సంబంధాలు తెంచుకోవడానికైనా సిద్ధపడతారు. పునర్వివాహ సంబంధమైన విషయాలలో మీ ప్రార్థన దేవుడు ఆలకిస్తాడు, మంచిసంబంధం కుదురుతుంది. జీవితభాగస్వామి ఆరోగ్య విషయమై శ్రద్ధ వహించవలసిన పరిస్థితులు ఏర్పడతాయి. సెల్ఫ్ డ్రైవింగ్‌లో జాగ్రత్తలు అవసరం. భేదాభిప్రాయాలు సృష్టించి కుటుంబంలో అశాంతికి కారణమైన వ్యక్తులను గుర్తించి కూడా ఎలాంటి చర్య తీసుకోరు, మౌనం పాటిస్తారు, కాలమే సమాధానం చెబుతుందని భావిస్తారు. మీ శత్రువర్గానికి సన్నిహితమైన సలహాదారులు మీకు అంతరంగికులు అవుతారు. అసత్య ప్రచారం చేస్తున్న మీ ప్రత్యర్థులు మీ కన్నా బలవంతులైనా మీరు లెక్కచేయరు. వాళ్ళ ద్వారా వచ్చిన రాయబారాలు, రాజీయత్నాలు మీరు నమ్మరు, నమ్మినట్లు నటిస్తారు. పరిస్థితులను జాగ్రత్తగా అంచనా వేసి సొంత వ్యూహాలను అమలుచేస్తారు. రాజకీయసంబంధమైన విషయాలలో మీకు ఇష్టం లేకపోయినా మీ జోక్యం, ప్రవేశం అనివార్యం అవుతుంది. సన్నిహిత బంధువులు, ఆత్మీయులు, రాజకీయరంగా ప్రవేశం చేయడం వల్ల మీరు రాజకీయాలలో పాల్గొనవలసిన పరిస్థితి గోచరిస్తుంది. ఇది ప్రత్యక్షంగా అయినా పరోక్షంగా అయినా జరగవచ్చు. వంశవృద్ధి గోచరిస్తుంది. వివాహం కానివారికి వివాహ ప్రాప్తి, సంతానం లేనివారికి సంతానప్రాప్తి కలుగుతుంది. సన్మానాలు, సత్కారాలు పొందుతారు. విందు వినోదాల కార్యక్రమాలలో ఎప్పుడూ మీరు ఆకర్షణ బిందువుగా నిలుస్తారు. మహాతీర్థం పొడితో మీ ఇష్టదేవతలకు అభిషేకం చేయండి. ప్రతిరోజు సర్వదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, గృహంలోనూ, వ్యాపార ప్రదేశంలోనూ దైవికం అనే పొడితో ధూపం వేయండి. నరదృష్టి, గృహదిష్టి మొదలైన దారిద్ర్యాలు తొలగిపోతాయి. చిల్లరమల్లర తగాదాలను పరిష్కరించవలసిన పద్ధతికి స్వస్తి చెబుతారు. ఇలాంటి వాతావరణానికి దూరంగా ఉంటారు. సమాజంలో వివిధ రంగాలలో పేరుప్రతిష్ఠలు కలిగిన వ్యక్తులకు సన్మానసత్కారాలు చేసి మంచి పేరు తెచ్చుకుంటారు. ఏ రకమైన ప్రయోజనాలు పొందాలన్నా కులం, మతం ప్రాతిపదికగా నిలుస్తాయి. కులమతాలను అనుసరించి అనుకూల ఫలితాలు ఉంటాయి. ఈ రకమైన పరిస్థితి మీకు నిరుత్సాహాన్ని కలిగిస్తుంది. శక్తిసామర్థ్యాలకు విలువలేని సమాజంలో ఎందుకు పుట్టామా? అని బాధపడతారు. కొన్ని విషయాలలో భీష్ముడిలా అస్త్రసన్యాసం చేస్తారు. మీరు ఏ విషయం చెప్పినా కాదు, ఒద్దు అని అపశకునాలు పలికి మిమ్మల్ని నిరుత్సాహపరిచే వ్యక్తులే మీరు కార్యక్రమాలు ప్రారంభించగానే సిగ్గు విడిచి మరలా మీతోనే నడుస్తారు. పూర్వీకుల ఆస్తిపాస్తులు న్యాయబద్ధంగా మీకు చెందవలసినది మూడు వంతులు మీ చేతికి అందుతాయి. మిగిలిన ఒక వంతు మొత్తం కాజేయాలని సంకల్పించిన వారు దక్కించుకుంటారు. ఆస్తుల కోసం, ధనంకోసం తల్లిదండ్రులతో కూడా విరోధం ఏర్పరచుకునే మీ సహోదరవర్గం పట్ల పూర్తి ద్వేషాన్ని పెంచుకుంటారు. మీకు లేని ఉద్దేశ్యాలను మీపై ఆపాదించి రక్తసంబంధీకులను దూరం చేయాలని బంధువులలో ఒకవర్గం విశేష ప్రయత్నం చేస్తుంది. అయితే సహోదరివర్గం అండగా నిలిచి దుష్పరిణామాలు

సంభవించకుండా నిలువరించగలుగుతారు. కోడిపందాలకు, క్రికెట్ బెట్టింగ్‌లకు దూరంగా ఉండండి. ఇష్టదేవత ప్రార్థనలో మనస్సు లగ్నం అవుతుంది, ఏకాంతంగా చాలాసేపు దేవతార్చన చేయగలుగుతారు. పూజలో పరిమళ గంధాన్ని ఉపయోగించండి. సంవత్సర ద్వితీయార్థం వచ్చేటప్పటికి ఆస్తులపరంగానూ, ఆర్థికపరంగానూ బలోపేతం కాగలుగుతారు. స్త్రీలతో సంబంధ బాంధవ్యాలు రచ్చకెక్కనంత వరకు మీకు వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు. రాళ్ళు, రత్నాలు వంటివి కొని మోసపోతారు. ఏరోనాటికల్ ఇంజనీరింగ్ చదువుతున్న వారికి, చదువు పూర్తయిన వారికి మంచి అవకాశాలు కలిసివస్తాయి. పోలీస్‌శాఖలో పనిచేస్తున్న వారికి అవార్డులు లభిస్తాయి. వ్యాపారలావాదేవీలలో భాగస్వాములు పరోక్షంగా స్వంతలాభాలు చూసుకుని సంస్థాగతపరమైన ప్రయోజనాలను దెబ్బతీస్తారు. సంస్థ గుడ్‌విల్ దెబ్బతింటుంది. వాళ్లను వెళ్ళగొట్టి ప్రత్యామ్నాయ మార్గాల కోసం అన్వేషిస్తారు. ప్రతిరోజూ ప్రతినిత్యం అష్టమూలికా తైలంతో, లక్ష్మీ వత్తులతో దీపారాధన చేయండి. అన్ని విధాలుగా మంచి జరుగుతుంది. నాగసింధూరం ధరించడం వల్ల నరదిష్టికి దూరంగా ఉంటారు.

## స్త్రీలకు ప్రత్యేకం :

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం చాలా బాగుంది. విద్యాసాంకేతిక, క్రీడారంగాలలో విశేషంగా రాణిస్తారు. మీ శక్తిసామర్థ్యాలకు గాను ప్రభుత్వపరంగా, ప్రైవేట్‌పరంగా గౌరవ పురస్కారాలు లభిస్తాయి. పోటీపరీక్షలను ప్రతిష్ఠాత్మకంగా తీసుకుంటారు. ఎలాగైనా విజయం సాధించాలనే మీ మొండితత్వం మంచిఫలితాలను ఇస్తుంది. ప్రేమవివాహాలకు సంబంధించిన కీలకమైన నిర్ణయాలు తీసుకోవల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. సాంకేతిక విద్యాపరంగా చక్కగా రాణిస్తారు. నిత్యం అష్టమూలికా తైలంతో అరటినార వత్తులతో దీపారాధన చేయండి. తల్లిదండ్రులతో పెనవేసుకున్నటువంటి అనుబంధాలు ఏమవుతాయోనని సందిగ్ధవాతావరణం ఏర్పడుతుంది. కార్యాలయంలో అనుకూలమైన వాతావరణం ఉంటుంది. సంవత్సర ద్వితీయార్థంలో నూతన అవకాశాలు కలిసివస్తాయి. విదేశీయాన ప్రయత్నాలు ఫలిస్తాయి. వైవాహికజీవితంలో చిన్న చిన్న ఒడిదుడుకులు ఏర్పడే పరిస్థితులు గోచరిస్తున్నాయి. మీ పిల్లలపై ఇతరులు చూపే మమకారం మీకు కృత్రిమంగా తోస్తుంది, మీ పిల్లలపై ఇతరుల పెత్తనం మీకు నచ్చని విషయంగా అవుతుంది. ఒకప్పుడు మీరు అత్యంత గౌరవించిన వ్యక్తులే మీకు బద్ధశత్రువులు అవుతారు. మీ దైనందినజీవితానికి భిన్నంగా నూతనరంగాలలో ప్రవేశించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అయితే అందులో రాణింపు, గుర్తింపు లభిస్తాయి. పిల్లలను మందలించేటప్పుడు పరుషపదజాలాలను ఉపయోగించవద్దు. పూజా కార్యక్రమాలలో పరిమళ జువ్వాది, పరిమళ గంధాన్ని ఉపయోగించండి. దివాళా తీసిన ఫైనాన్స్ కంపెనీ నుండి కొద్దో గొప్పో డబ్బులు వస్తాయని ఆశపెట్టుకుంటారు. మీ ఆశ నిరాశ అవుతుంది. కీలకమైన విషయాలలో తల్లిదండ్రుల సలహాలు కోరతారు. మీ బాధను, మీకు జరుగుతున్న అన్యాయాన్ని, మీ ఆక్రోశాన్ని వెల్లడి చేసుకుంటారు. బంధువుల, స్నేహితుల మధ్య మంచి వాతావరణం సమకూర్చడానికి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మీరు కోరుకున్న ఉద్యోగం లభించడం మీ మానసిక ఆనందానికి కారణం అవుతుంది. వైద్యవిద్యలో రాణిస్తారు. వ్యాపారపరమైన విషయాలు, వ్యాపారంలో రొటేషన్‌లు బాగుంటాయి. లీజులు, లైసెన్స్‌లు రెన్యువల్స్ మీకు అనుకూలంగా మారతాయి. జాలి, దయలేని అధికారుల వల్ల కొంతకాలం

ఇబ్బంది పడతారు. వంశపారంపర్యంగా రావలసిన ఆస్తిలో మీవాటా మీకు దక్కుతుంది. జ్యేష్ఠసంతాన విషయంలో ప్రత్యేకశ్రద్ధ కనబరచవలసి వస్తుంది. మొండివాళ్ళను సరి అయిన దారిలో పెట్టవలసిన బాధ్యత మీపై పడుతుంది.ఆవేశంలో మీరు మాట్లాడిన మాటలకి బాధపడటం, చింతించవలసి ఉంటుంది. గ్రహ ప్రభావం వల్ల జీవితభాగస్వామి, తత్సమానమైన వారితో విభేదాలు ఏర్పడి విడిపోవడం సంభవిస్తుంది. పునర్వివాహం చేసుకునే ఉద్దేశ్యం ఉన్నవారికి పునర్వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతనజీవితాన్ని ఉత్సాహంగా ప్రారంభించగలుగుతారు. మీపై ఇతరుల పెత్తనం ఉండకూడదని తగిన జాగ్రత్తలు తీసుకుంటారు. విద్యార్థినీవిద్యార్థులు జ్ఞానచూర్ణాన్ని సేవించడం చెప్పదగిన సూచన. విద్యాపరంగా కొన్ని కొత్త నిర్ణయాలు తీసుకుని నూతనకోర్సులను పూర్తిచేసి అనుకూలమైన ఫలితాలను సాధిస్తారు. సరదాగా మీరు అభ్యసించినటువంటి కోర్సు ఇప్పుడు మీకు అక్కరకు వస్తుంది. దూరదృష్టితో మీరు చేసే ప్రతిపనీ మీకు కలిసివస్తుంది. మీ చెడు కోరుకునేవారు మీకు అత్యంత సమీపంలో ఉన్నారన్న విషయాన్ని గుర్తించి, అత్యంత జాగ్రత్తలు తీసుకోండి. స్వగృహయోగం కలుగుతుంది. ఉద్యోగపరంగా ప్రమోషన్ లభిస్తుంది. స్థానచలనానికి అవకాశం ఉంది. ప్రతిరోజూ, ప్రతినిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, ఆరావళికుంకుమతో మహాలక్ష్మీదేవిని అర్చించండి. అవివాహితులైన వారికి వివాహం జరుగుతుంది. సంతానం లేనివారికి సంతానప్రాప్తి కలుగుతుంది.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121



## మహాతీర్థం పొడి

ఏ దేవుడికైనా, దేవతకైనా పూజ చేసేటప్పుడు మహాతీర్థం పొడి కొద్దిగా ఉపయోగించాలి. ఎలాంటి అభిషేకానికైనా ఈ మహాతీర్థం పొడిలో కొద్దిగా నీళ్ళు కలిపి అభిషేకం చేయండి. ఈ మహాతీర్థం పొడిలో 17 రకాల దేవతా ప్రీతికరమైన వన మూలికలు కలుస్తాయి. మహాతీర్థం పొడితోచేసే అభిషేకాలు, పూజలు మంచి ఫలితాలనిస్తాయి. ఇంతవరకు పూజా ద్రవ్యాలతో ఈ రకమైన తీర్థం రాలేదు. ప్రజలకు సౌలభ్యంగా ఉండడానికి పురాతన గ్రంథాలు పరిశీలించి ఇది తయారుచేయడమైనది. దీనివల్ల సౌఖ్యం, సంతోషం కలుగుతాయి. ఇష్టదేవతా అనుగ్రహం కలుగుతుంది.



# 2017-2018 లో వృశ్చికరాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 8 | వ్యయం - 14 | రాజ - 4 | అవ - 5 |

**విశాఖ 4వ పాదము, అనూరాధ, 1, 2, 3, 4 పాదములు, జ్యేష్ఠ 1, 2, 3, 4 పాదముల యందు పుట్టినవారు "తో, నా, నీ, నూ, నే, నో, య, యా, యూ" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు వృశ్చికరాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**వృశ్చికరాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. నూతన వృత్తి, వ్యాపార, ఉద్యోగాల మీద దృష్టిపెడతారు. మీ జీవితాశయం నెరవేర్చుకోవడానికి రాత్రింబవళ్ళు శ్రమిస్తారు. ఒక విలువైన ఆస్తిని కొనుగోలు చేయగలుగుతారు. రాజకీయ సంబంధమైన వ్యవహారాలలో స్వల్పమయినటువంటి ప్రయోజనాలకు సంతృప్తిపడి మీ సామాజిక వర్గాన్ని నష్టానికి దారితీసే పరిస్థితి కలిపిస్తారు, దీంతో మీకు మానసిక పరివర్తన కలుగుతుంది. బంధువులకు, మిత్రులకు చివరకు మీరు శత్రువులకు కూడా సహాయసహకారాలు అందజేస్తారు. అందరినీ ఒకే తాటిపై నడిపించి విజయవంతమైన ఫలితాలను సాధిస్తారు. కొన్ని విషయాలలో ఒడిదుడుకులను ఎదుర్కోవలసి వస్తుంది, ఇది మీరు ఊహించనటువంటి పరిణామం. ఎముకలకు సంబంధించిన అనారోగ్యం రావచ్చును, జాగ్రత్త వహించండి. నమ్మకద్రోహులను ఆదరించకుండా దూరంగా ఉంచండి, గతంలో చేసిన పొరపాట్లే మళ్ళీ చేయవద్దు. రాజకీయరంగ ప్రవేశం చేస్తారు, విజయవంతమైన ఫలితాలను సాధిస్తారు. పోటీపరీక్షలలో నెగ్గి గొప్ప ఉద్యోగం సాధిస్తారు. వ్యాపారంలో నూతన మార్పిడీలు చేయడం కానీ లేక ఒక రంగం నుండి మరొక రంగంలోకి మారడం సంభవించవచ్చు. అయితే పూర్తి ఆత్మవిశ్వాసంతో మీరు కార్యక్రమాలను నిర్వర్తించకపోయినా అనుకూలమైన ఫలితాలను సాధిస్తారు. చిరకాల ప్రత్యర్థులకు తగిన గుణపాఠం నేర్పుతారు. సంతానానికి సంబంధించిన విషయాలలో కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసిన పరిస్థితులు గోచరిస్తున్నాయి. వాళ్ళ ఆరోగ్యం పట్ల, విద్యాభివృద్ధి పట్ల, క్రమశిక్షణ పట్ల శ్రద్ధ వహించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది, క్రమశిక్షణతో ఉంచుతారు. సంతానంలో ఒకరు స్నేహానికి అంకితమైపోయి కుటుంబానికి ఇబ్బందికరంగా మారతారు. విద్యాపరంగా మంచి స్థాయి సాధిస్తున్న సమయంలో ఈ మార్పు సంభవించే అవకాశం ఉంది. వ్యవసాయసంబంధమైన విషయాలు మధ్యస్థంగా ఉంటాయి. కొనుగోళ్ళు, అమ్మకపు వ్యవహారాలూ, ఎగుమతి, దిగుమతి వ్యాపార వ్యవహారాలు బాగా అనుకూలిస్తాయి. జనసమీకరణలోనూ, వ్యూహ, ప్రతివ్యూహాలను రచించడంలోనూ అందరికంటే మీరే ముందుంటారు. ఇది అన్ని రంగాలలోని వారికి వర్తిస్తుంది. స్పెక్యులేషన్స్‌కు దూరంగా ఉండండి.

**నిద్రించుచున్న వారిని తగు కారణము లేకున్నచో లేపకూడదు.**

పెద్దమొత్తంలో ఋణం (అప్పు) చేస్తారు, అయితే ఆ ఋణం (అప్పు) వల్ల అభివృద్ధి జరుగుతుంది. కుటుంబవ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి, గతంలో కంటే సానుకూల వాతావరణం ఈ సంవత్సరం ఏర్పడుతుంది. విడిపోవాలని నిర్ణయించుకున్న వాళ్ళు చట్టపరంగా విడిపోవచ్చుగానీ సఖ్యతగా ఉన్నవాళ్ళు చక్కగా ఉండగలుగుతారు. సంసారజీవితంలో ఎలాంటి ఒడిదుడుకులు ఉండవు. రాజకీయంగా కొంతమంది వ్యక్తులకు అండగా నిలిచి వారి విజయం కోసం పరిశ్రమిస్తారు. శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని విజయం కొరకు సారథ్యం వహించిన విధంగా మీరు వ్యవహరించి చరిత్రపుటలలో నిలిచిపోతారు. క్రీడా,సాంస్కృతిక, సాహిత్యరంగాలలో గుర్తింపు, గౌరవం లభిస్తుంది. చేస్తున్న ఉద్యోగంలో ప్రమోషన్ లభిస్తుంది. నూతన వ్యాపారానికి సంబంధించిన ఆలోచనలు అమలు చేస్తారు. ఉద్యోగపరంగా మంచి మంచి అవకాశాలు కలిసివచ్చినా కుటుంబసభ్యులతో కలిసి ఉండటం కోసం వేరే ప్రాంతాలకు వెళ్ళరు, వచ్చిన అవకాశాలను తిరస్కరిస్తారు. ప్రేమవివాహం ఫలిస్తుంది, అయితే సంసారజీవితంలో ఒడిదుడుకులు ఉంటాయి. స్థిరమైనటువంటి ఒక ఆస్తిని అమ్మటానికి సరైన ధర వచ్చినా మీరు అమ్మరు. సంవత్సర ద్వితీయార్ధంలో ముఖ్యమైన అధికారుల ద్వారా మీ ప్రత్యర్థులు మీకు నష్టం కలిగిస్తారు. రాజకీయ పరపతిని ఉపయోగించి నష్టాన్ని చాలావరకు నివారించుకో గలుగుతారు. ప్రత్యర్థులను తక్కువగా అంచనా వేసినందుకు మీరు బాధపడతారు. ప్రావిడెంట్ ఫండ్‌కు సంబంధించిన సమస్యలు ఏర్పడతాయి. ఫిక్స్‌డ్ డిపాజిట్స్ గురించి కుటుంబంలో అంతర్గత రాజకీయాలు బయటపడతాయి. కోర్టుపరమైన సమస్యలు సంవత్సర ప్రథమార్ధంలో ఇబ్బంది పెట్టినా ద్వితీయార్ధంలో కోర్టుతీర్పులు అనుకూలంగా వస్తాయి. బంధువర్గం వాళ్ళ స్వప్రయోజనాల కోసం మిమ్ములను ఉపయోగించుకొంటారు, వాళ్ళకు మీరు సహాయ నిరాకరణ చేస్తే మీకు కుటుంబంలోని వారి ద్వారా మీమీద ఒత్తిడి పెంచుతారు. అన్ని విషయాలను సమన్వయించుకుని **"తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతి"** అని వ్యవహరిస్తారు. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి, మానసిక సంతోషం కలుగుతుంది. శుభకార్యాలకు సంబంధించి కొన్ని ఋణాలు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఇష్టం లేకపోయినా సెక్యూరిటీ సంతకాలు చేస్తారు. సినీకళా పరిశ్రమలోని వారికి సాధారణ ఫలితాలు మాత్రమే గోచరిస్తున్నాయి. టీవీ రంగంలోని వారికి మంచి ఫలితాలు లభిస్తాయి. మీ పెట్టుబడితో మీ పేరుమీద ఇతరులు చేసే వ్యాపారాలలో కొన్ని అవకతవకలు చోటుచేసుకుంటాయి. ఎంతోమంది ప్రక్కన ఉన్నా ఎన్ని విధాలుగా కలిసివచ్చినా ఒంటరిగా ఉన్నామనే భావన మీ మనసులో ఉండిపోతుంది. వ్యక్తులకు, వ్యక్తులకు మధ్య ఉన్నవి కేవలం వాణిజ్య సంబంధాలే తప్ప వేరు కావు అన్న భావన మిమ్ములను వైరాగ్యం వైపు నడిపిస్తుంది. అత్యంత సన్నిహితులను నమ్మి ముఖ్యమైన కార్యక్రమాలు వారికి అప్పగిస్తారు, అయితే కార్యక్రమాలు విజయవంతం అవుతాయి కానీ ఫలితాలు మాత్రం మీ వరకు రావు. సొమ్ము చేతికి రాకపోగా స్నేహితులతో విభేదాలు ఏర్పడతాయి. ఇలాంటి సంఘటనల వల్ల మానసికమైన డిప్రెషన్ ఏర్పడుతుంది. దూరప్రాంత ప్రయాణాలకు సంబంధించి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. దివాళా తీసిన ఒక పెద్ద ఆర్థికసంస్థలో మీరు పెట్టుబడి పెట్టిన లక్షలాది రూపాయలు కొంతైనా చేతికి వస్తాయని ఆశిస్తారు, మీ ఆశ నిరాశ అవుతుంది. ధర్మానికి, న్యాయానికి కానికాలం దాపురించింది అని నిశ్చయించుకుంటారు. న్యాయబద్ధంగా బాధితులకు రావలసిన ధనాన్ని

మసిపూసి మారేడుకాయ చేసి రాజకీయ నాయకులే దిగమింగుతారు. నిత్యం అష్టమూలికా తైలంతో నల్లవత్తులతో దీపారాధన చేయండి. నిత్యం మహాతీర్థం పొడితో మీ ఇష్టదైవానికి అభిషేకం చేయండి, ఇది చాలా విశిష్టమైన అభిషేకం. సంవత్సర ద్వితీయార్థంలో రాజకీయ పరపతి వల్ల ఆర్థికంగా ఎదుగుతారు, కొన్ని సాంకేతిక కారణాల వల్ల ఆకస్మికంగా విలువైన ఆస్థులను కొనుగోలు చేస్తారు. పరిస్థితుల ప్రభావం వల్ల సహోదరివర్గానికి అండగా నిలవవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. నూతన వాహనాన్ని కొనుగోలు చేస్తారు. తీర్థయాత్రలకు, ఆధ్యాత్మిక విషయాలకు సమయాన్ని, ధనాన్ని వెచ్చిస్తారు. ఒరిగిపోయిన (చనిపోయిన) ఒక జీవి జ్ఞాపకాలు మిమ్మలను తీవ్రంగా బాధిస్తాయి. ఐ.ఐ.టి., ఎంసెట్‌లో మంచి ర్యాంకులను సాధిస్తారు. వైద్యవృత్తిని అభ్యసించాలనే మీ అభిలాష నెరవేరుతుంది. ప్రింటింగ్, ప్రచార సంబంధిత విషయాలు, లీజులు, సబ్ లీజులు మీకు అనుకూలంగా లాభిస్తాయి. మీ ప్రయోజనాలు స్థిరంగా ఉంటాయి. ధన సంబంధిత అంశాలపైన, విలువైన ఆభరణాల భద్రత విషయంలోనూ జాగ్రత్త వహించాలి. దురుసుగా మాట్లాడి చొరవగా దూసుకుపోయే వ్యక్తుల వల్ల మీ ప్రయోజనాలు దెబ్బతినే అవకాశం ఉంది. కొన్ని సందర్భాలలో ముఖ్యమైన వ్యక్తుల చెప్పుడు మాటలు విని మీ నుండి కనీస వివరణ కోరకుండా, విషయాలు తెలుసుకోకుండా మీకు వ్యతిరేకంగా ఏకపక్ష నిర్ణయాలు చేస్తారు. కమర్షియల్ ఏరియాలో ఒక విలువైన ఆస్తిని కొనుగోలు చేస్తారు. జలసంబంధమైన వ్యాపారాలు కలిసివస్తాయి. అన్నదమ్ముల మధ్య ఆప్యాయతలు ఉంటాయి. అనువంశికంగా రావలసిన ఆస్తి విషయంలో మీరు ఎలాంటి విభేదాలు సృష్టించరు, అందరి నిర్ణయమే నా నిర్ణయం అని మిన్నకుంటారు, ఎలాంటి ఇబ్బంది లేకుండా మీ వాటా మీకు వస్తుంది. పెద్దల ఆరోగ్యం గురించి కొంత ఆందోళన ఎదురవుతుంది. గ్రీన్‌కార్డు కోసం ప్రయత్నం చేసేవారికి ఆ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్వల్పమైన అనారోగ్యాల వల్ల చికాకు ఏర్పడుతుంది. న్యాయబద్ధంగా రావలసినటువంటి ప్రయోజనాలను, ప్రమోషన్ వంటి సౌకర్యాలను పోరాడి సాధించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అడుగడుగునా ప్రతి ప్రయోజనానికి ప్రతి మనిషికి కులమే క్వాలిఫికేషన్ అవుతుంది. స్త్రీలతో నిష్కారణమైన విభేదాలు ఏర్పడే పరిస్థితి గోచరిస్తుంది, జాగ్రత్త వహించండి. సి.సి.కెమెరా లాంటివి ఉపయోగించండి, మీకు లాభం చేకూరుతుంది. రాత్రిపూట చేసే దీర్ఘాలోచనలు ఫలిస్తాయి. అవగాహన లోపం వల్ల మీ భాగస్వాములలో ఒకరు తీసుకున్న నిర్ణయాలు మిమ్మల్ని స్వల్పంగా నష్టపరుస్తాయి. ప్రజా సంబంధాలను మెరుగుపరుచుకోవడానికి వివిధ మార్గాలను అనుసరిస్తారు. రహస్య రాయబారాలు కీలకం అవుతాయి, అవి ఫలిస్తాయి. కొద్దిమంది విషయంలో న్యాయస్థానాల ద్వారా చట్టబద్ధంగా కొందరితో విడిపోయే అవకాశం ఉంది, చెప్పుడు మాటలు విని ఇతరులను ప్రోత్సహించడం వల్ల ఈ రకమైన ఎడబాటు సంభవిస్తుంది. వ్యవహారాలను పొడిగించకుండా వెనువెంటనే నిర్ణయాలు తీసుకోవడం వల్ల లాభపడతారు. అయితే మీ ప్రక్కన ఉన్నవారు శల్య సారధ్యం చేసి ప్రతిపనీ చెడగొడతారు. శుభకార్యాల విషయాలు జయప్రదంగా సాగుతాయి. సనాతన విద్యల పట్ల ఆసక్తి కనబరుస్తారు. నరదృష్టి అధికంగా ఉంది. నిత్యం నాగసింధూరాన్ని నొసటన ధరించండి. గృహంలోనూ, వ్యాపార కేంద్రాలలోనూ అష్టమూలికా గుగ్గిలంతో ధూపం వేయటం చెప్పదగిన సూచన. వీలైనంత నిరాడంబరంగా ఉండటానికి ప్రయత్నిస్తారు. మీ సన్నిహితవర్గం దురాశకు పోయి నష్టపోవడం జరుగుతుంది. మీ మాట

విననందుకు వారిని కొంతకాలం దూరంగా ఉంచుతారు. చాలా విషయాలలో గుడ్‌విల్ కలిగిన వ్యక్తిగా, మాట తప్పని వ్యక్తిగా మిమ్మల్ని మీరు నిరూపించుకుంటారు. ఒక సమస్య తీరితే మరొక సమస్య తయారై కూర్చుంటుంది. కొంతమంది విషయాలలో మీరు చూపించిన మంచితనం వ్యతిరేక ఫలితాలకు దారితీస్తుంది. ఆరోగ్యపరంగా ప్రకృతి వైద్య విధానాలను అవలంబిస్తారు, అవి మీకు సరిపడక ఇబ్బందులను ఎదుర్కొంటారు. కనిపించిన ప్రతిదానినీ ఆచరించాలని అనుకోవద్దు. అందువల్ల లేనిపోని ఇబ్బందులు వస్తాయి. చాలాకాలంగా అనుకుంటున్న దూరప్రాంత ప్రయాణం మళ్ళీ వాయిదా పడుతుంది. వైజ్ఞానిక రంగంలోని వారికి, డాక్టర్లకు, లాయర్లకు, బోధనారంగంలో ఉన్నవారికి మంచి ఫలితాలు గోచరిస్తున్నాయి. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి కాలం కలిసివస్తుంది. వినోద కార్యక్రమాలకు ప్రాధాన్యతనిస్తారు. మీరు క్రమశిక్షణతో ఉంటేనే ఇంట్లో పరిస్థితులు అదుపులో ఉంటాయని గ్రహించండి. మీ వ్యసనాలను సమర్థించుకునే ప్రయత్నాలు చేయవద్దు. మీ వాక్ చాతుర్యం, శక్తిసామర్థ్యాల ప్రయోజనాలకు పనికివస్తాయి, చాలా సందర్భాలలో అక్కరకు వస్తాయి. ఎంత ధనం వచ్చినా చేతిలో నిలవడం లేదనే చింత ఏర్పడుతుంది. పగలూ, ప్రతీకారాలకు దూరంగా ఉంటారు, అవకాశం వచ్చినా శత్రువర్గాన్ని ఏమీ చేయక విడిచిపెడతారు. బద్దకం, అతినిద్ర కొంతకాలం ఇబ్బంది పెడతుంది. సంవత్సర ప్రథమార్థంలో వ్యాపారపరంగా వినూత్నమైన ప్రయోగాలు చేసి లాభం కన్నా మంచి పేరు సాధిస్తారు. కొద్దిరోజులు (సుమారుగా ఒక నెలరోజులు) కారణంలేని నిష్కారణమైన అసంతృప్తి నెలకొని ఉంటుంది. చికాకుగా, కోపంగా ఉంటారు. నిద్రలేమి, పీడకలలు, అజీర్తివల్ల, ఎలర్జీవల్ల ఇబ్బందులు ఎదుర్కొంటారు. దైవికం అనే పొడితో ధూపం వేయండి. ఇంటికి పట్టిన అన్ని రకాల దారిద్ర్యాలు పోతాయి. ప్రభుత్వం నుండి రావలసిన బిల్స్ చేతికి రావడానికి సమయం పడుతుంది. ఆర్థికపరమైనటువంటి ఒత్తిడి తాత్కాలికంగా ఏర్పడుతుంది. ఈ విషయాన్ని ముందుగా గ్రహించి మీకు రావల్సిన బిల్స్ పెండింగ్‌లో పడకుండా జాగ్రత్తలు తీసుకోండి. లంచాలు ఇవ్వక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. వాయిదా పద్ధతులలో కొన్ని కొనుగోళ్ళు చేస్తారు, అయితే వాటిలో నాణ్యత ప్రశ్నార్థకం అవుతుంది. షేర్లకు దూరంగా ఉండండి. రుచికరమైన ఆహారాన్ని స్వీకరించినప్పుడల్లా ఏదో రకమైన ఆరోగ్య సమస్య తలెత్తుతుంది. ఏవి ఏ విధంగా ఉన్నా ఎన్ని ఇబ్బందులు పడినా మొత్తం మీద ఈ సంవత్సరం పురోగతి సాధిస్తారు. అధికార ప్రాప్తికి సంబంధించిన విషయాలు ప్రాప్తిస్తాయి. మనోధైర్యం, స్థిరత్వం పెరుగుతుంది, లక్ష్యసాధనను ఛేదించగలుగుతారు. జీవితభాగస్వామి ఆరోగ్య విషయంలో ఇబ్బందులు ఏర్పడుతాయి. మోకాళ్ళ నొప్పులు, కండరాల నొప్పులు, డిప్రెషన్ ఇబ్బంది పెట్టే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. డాక్యుమెంట్స్, లిఖిత పూర్వితమైన వ్యవహారాలయందు జాగ్రత్త వహించాలి. కొనుగోళ్ళ వ్యవహారంలో మోసపోయే అవకాశం వుంది, జాగ్రత్త వహించండి. మిమ్మల్ని అడ్డంపెట్టుకుని తప్పుడు పనులు చేస్తున్న వాళ్ళను దూరంగా పెడతారు. అసమర్థులను, అధికార దుర్వినియోగం చేసేవారికి మీ నుండి తగిన దండన లభించకపోవడంచే పరోక్షంగా మీరు వాళ్ళను సమర్థించారన్న అపోహలు వస్తాయి. వ్యక్తిగత విషయాలు, కుటుంబ విషయాలతో ముడిపడిన ముఖ్య వ్యవహారాలలో ఒక్కసారిగా తొందరపడటం సరికాదని మనస్సులో సరిపెట్టుకుంటారు. గ్రహస్థితి రీత్యా ఇది సమర్థనీయమైనటువంటి చర్య, మీ రూటే కరెక్టు. ఉపకరించే పరిచయాలు

వృద్ధి చెందుతాయి, పరపతి కలిగిన వారితో పరిచయాలు మరింత బలపడతాయి. పదేపదే స్నేహితులకు సహాయసహకారాలు అందించవలసి రావడం చికాకుగా మారతాయి. మీ రక్తబంధువులకు మీరు చేసే సహాయసహకారాలు ఎలా ఉన్నా గృహంలో అశాంతి పెరుగుతుంది. వాళ్ళ కోరికలు ఎవరూ తీర్చలేరని సరిపెట్టుకుంటారు. విద్యార్థినీ, విద్యార్థులు జ్ఞానచూర్ణాన్ని సేవించాలి, ఇందువలన జ్ఞాపకశక్తి పెరుగుతుంది. ఈ రాశిలో జన్మించినవారు ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయించాలి, నలుపు వత్తులతో శనికి దీపారాధన చేయాలి. అఘోరపాశుపత హోమం చేయాలి. సామాజిక వాతావరణం మారుతున్న పరిస్థితులు, పెరుగుతున్న విద్వేషాలు మీమీద ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ ప్రభావం చూపే అవకాశం ఉంది. ఆక్వా రంగంలో ఉన్నవారికి, పౌల్ట్రీ రంగంలో ఉన్నవారికి ఫలితాలు బాగున్నాయి. పప్పుధాన్యాలు, వ్యవసాయ అనుబంధ వస్తువుల వ్యాపారం చేసేవారికి, విద్యాలయాలు, హాస్పిటల్స్ బాగా లాభాలు తెచ్చిపెడతాయి. మీ విద్యాసంస్థలపై ఆరోపణలు వచ్చినా, ఇతరులు చెడుగా ప్రచారం చేసినా మీ పరపతిని, ధనాన్ని ఉపయోగించి ఎలాంటి మచ్చ రాకుండా జాగ్రత్తపడతారు. దయారహితంగా వ్యవహరిస్తున్నారన్న ఆరోపణలు వస్తాయి, ఎవరు ఏమనుకున్నా ఈ సంవత్సరం పురోగతి బాగుంది. ఏలినాటి శని ప్రభావం వల్ల అమెరికా అధ్యక్షులుగా పోటీ చేస్తున్న ట్రంప్ గెలిచే అవకాశాలు లేవు. హిల్లరీ క్లింటన్ గారికి అనుకూల ఫలితాలు వస్తాయి. ప్రతిరోజూ, ప్రతినిత్యం పూజా కార్యక్రమాలలో పరిమళ గంధాన్ని, పరిమళ జువ్వాదిని వాడండి. పునర్వివాహ సంబంధమైన విషయాలు కూడా ఈ సంవత్సరం ముడిపడతాయి.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. కష్టపడి చదివినటువంటి చదువుకు ఉద్యోగం, గుర్తింపు లభిస్తుంది. మీరు గర్విష్టి, కోపిష్టి అని మీ చుట్టుపక్కలవారు ప్రచారం చేస్తారు, మళ్ళీ వాళ్ళే మీ సహాయం కోరతారు. ఇలాంటివారు కూడా ఉంటారా అని ఆశ్చర్యపోతారు. విలువైనటువంటి వస్తుసామాగ్రిని, ఆభరణాలను కొనుగోలు చేస్తారు. కుటుంబానికి మీరు ఆర్థిక కవచం అవుతారు. వృత్తి, ఉద్యోగాలలో శారీరక, మానసిక వత్తిడి అధికం అవుతుంది. మీ స్థాయి, జీతం పెరుగుతుంది. సౌందర్య చిట్కాల పట్ల ఆకర్షితులు అవుతారు, చివరకు ఇటువంటి వాటి వల్ల ఎటువంటి ప్రయోజనం లేదని తెలుసుకుంటారు. మిమ్మల్ని ఇష్టపడుతున్న ఓ వ్యక్తిని తిరస్కరిస్తారు. చర్మ సంబంధమైన వ్యాధులు స్వల్పంగా ఇబ్బంది పెట్టే అవకాశం ఉంది, ఎక్కువ జాగ్రత్తలు వహించండి. పూర్తి చేయవలసినటువంటి చిన్న చిన్న విద్యాకోర్సులను పూర్తి చేస్తారు. స్వగృహ యోగ్యత ఏర్పడుతుంది. ఎన్నిసార్లు సహాయం చేసినా విసుగు, విరామం లేకుండా సహాయం అర్థించే బంధువర్గం పట్ల విసిగి వేసారిపోతారు. విదేశాలలో స్థిరనివాసం గురించి అవసరమైన అనుమతి పత్రాలు అందుకుంటారు. మీ సహోదరసహోదరీ వర్గానికి చేయూతనిచ్చి మీ పరపతితో ఉద్యోగం ఇప్పించాలన్న యత్నాలు చేసి భంగపడతారు. సుమంగళి పసుపు వాడడం శుభప్రదం. ఆరావళి కుంకుమతో, లక్ష్మీ చందనంతో మహాలక్ష్మీదేవిని పూజించండి, మంచి ఫలితాలు సంభవిస్తాయి. క్రీడలలో మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. సంగీత, సాంస్కృతిక రంగాలల్లో మంచి

**చెప్పులతో వివాహ వేదిక ఎక్కి ఆశీర్వచనము చేయకూడదు.**

గుర్తింపు లభిస్తుంది, ప్రతిష్ఠాత్మకమైన అవార్డులు కూడా అందుకుంటారు. సమాజంలో జరుగుతున్న సంఘటనలు మిమ్మల్ని మానసికంగా తీవ్ర ప్రభావితం చేస్తాయి. అందువల్ల మీరు అన్ని విషయాలలోనూ జాగ్రత్తగా ఉంటారు. ఉపయుక్తమైన పరిచయాలు, స్నేహాలు కొన్ని సందర్భాలలో కొండంత అండగా నిలుస్తాయి. మీ పేరుమీద ఇతరులు చేసే వ్యాపారాలు బాగుంటాయి. పరపతి కలిగిన వారితో పరిచయాలకు దూరంగా ఉంటారు. కుటుంబ శ్రేయస్సుకు, పెద్దల అభీష్టానికి విలువ ఇస్తారు, వాళ్ళ మనోభీష్టానికి వ్యతిరేకంగా ఏ పనీ చేయడానికి ఇష్టపడరు. నిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. ఎవరి ఆకర్షణలోనూ, మాయలోనూ పడకుండా మచ్చలేని మనిషిగా జీవితం కొనసాగించాలని గట్టిగా నిర్ణయించుకుంటారు. కార్యాలయంలో మీ పనితీరు కీలకమైన అధికారులకు ఎంతగానో నచ్చుతుంది, ఇందువల్ల మీ గౌరవం కూడా పెరుగుతుంది. వైద్యవిద్య అభ్యసించాలన్న మీ కోరిక నెరవేరుతుంది. బెల్లంతో పాటే ఈగలు వచ్చినట్లుగా కార్యాలయంలో శత్రువర్గం, మిత్రవర్గం, విమర్శించే వర్గం ఏర్పడతారు. ఏ చిన్న తప్పు దొర్లకుండా కార్యక్రమాలను నిర్వహించడానికి శ్రమించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఎయిర్ హోస్టెస్, నర్సింగ్ కోర్సులను అభ్యసించేవారికి అనుకూలమైన కాలం. పోటీ పరీక్షలలో విశేషమైన కృషిచేసి అధికారం కలిగిన ఉద్యోగం సంపాదించుకోగలుగుతారు. దైనందిన జీవితంలో కొన్ని మార్పులు తెచ్చుకుంటారు నిత్యం అష్టమూలికా తైలంతో, లక్ష్మీ వత్తులతో దీపారాధన చేయండి. రాజకీయాలలో ఆసక్తి ఉన్నవారికి మంచి అవకాశాలు లభిస్తాయి. ఆరోగ్యానికి కావలసిన వాటిపట్ల శ్రద్ధ వహిస్తారు. పుత్రసంతాన ప్రాప్తి కలుగుతుంది. ఐ.ఐ.టి ఇతర సాంకేతిక విద్యలయందు సానుకూల ఫలితాలు సాధిస్తారు. ఫైనాన్స్ బిజినెస్‌లకు, స్పెక్యులేషన్‌లకు, షేర్స్‌కు దూరంగా ఉండండి. దీర్ఘకాలికంగా ఉన్నటువంటి ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. సంతాన పురోగతి బాగుంటుంది, సంతానం మీ సూచనల మేరకు నడుచుకుంటారు, మిమ్ములను అతిక్రమించి ఎటువంటి నిర్ణయాలు చేయరు. **"కలకాలం కలిసి జీవిద్దాం అనుకున్న వ్యక్తులతో అనూహ్యరీతిలో దైవం కూడా తలవని విధంగా చట్టం విడదీస్తుంది అని ఎంతమాత్రం ఊహించలేరు. మన ఊహలకు, ఆశలకు అతీతంగా ప్రబలమైనటువంటి ఓ శక్తి జీవితాలను శాసిస్తుందని సాక్షిభూతంగా నిరూపితం అవుతుంది".** ప్రభుత్వపరంగా రావలసినటువంటి లీజులు, లైసెన్సులు మొదలైనవి లభిస్తాయి. సమాజంలో రాజకీయంగా వస్తున్న మార్పులు ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ మీ మీద ప్రభావం చూపుతాయి. అయినవాళ్ళకు, రక్తసంబంధీకులకు పెద్దమొత్తంలో ఆర్థిక సాయం చేస్తారు. అధికారుల వలన అనవసరమైన చిక్కులు, ఇబ్బందులు ఏర్పడతాయి. సొంతంగా చిన్న చిన్న వ్యాపారాలు చేసుకునేవారికి కాలం అనుకూలంగా ఉంది. ప్రతిరోజూ పరిమళ గంధంతో, పరిమళ జువ్వాదితో పూజ చేసుకోండి, శుభప్రదం.





# 2017-2018 లో ధనుస్సురాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 11 | వ్యయం - 5 | రాజ - 7 | అవ - 5 |

**మూల 1, 2, 3, 4 పా॥లు, పూర్వాషాఢ 1, 2, 3, 4 పా॥లు, ఉత్తరాషాఢ 1వ పాదాల యందు పుట్టినవారు "యే, యో, బా, బి, భూ, ధా, భా, డ, భే" అను అక్షరములను తమ పేరునకు మొదట గలవారు ధనుస్సురాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**ధనుస్సురాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. వృత్తిఉద్యోగాల పరంగా శారీరక, మానసిక వత్తిడి అధికంగా ఉంటుంది. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా ఉంటాయి. కాంట్రాక్ట్ పద్ధతిన ఉద్యోగాలు చేస్తున్నవారికి ఉద్యోగం పర్మినెంట్ అవుతుంది. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తలు అవసరం. దుష్ప్రచారాలను పట్టించుకోకుండా మీ పని మీరు చేసుకుపోవడం వల్ల సానుకూల ఫలితాలను సాధిస్తారు. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. సహోదరవర్గం వల్ల మేలు కలుగుతుంది. రాజకీయపరమైన నిర్ణయాలు లాభిస్తాయి. నయవంచకుల సలహాలు ప్రక్కన పెడతారు. ఉన్నతాధికారులు మీ శ్రమను గుర్తిస్తారు. పిల్లల విద్యావిషయమై ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు, డబ్బు ఖర్చుపెడతారు. కొంతమందికి వాలెంటరీ రిటైర్మెంట్ తీసుకోవాలనే ఆలోచనలు వస్తాయి. సహోద్యోగులు మీమీద చేస్తున్న దుష్ప్రచారం అబద్ధాలేనని నిరూపిస్తారు. ముఖ్యమైన సభలు, సమావేశాలకు ఆహ్వానాలు అందటం మీకు ఆశ్చర్యం కలిగిస్తుంది. బహిరంగ సభల్లో చక్కగా ప్రసంగిస్తారు, కొన్ని అవార్డులు మీకు వస్తాయి. దొంగస్వామీజీల మోసకారి మాటలు విని నష్టపోయే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. ముఖ్యమైన విషయాలు రహస్యంగా ఉంచడం వల్ల ఎంతగానో లాభపడతారు. మీరు ఊహించనటువంటి మంచి అవకాశం వస్తుంది, నూతన బాధ్యతలను సంతోషంగా స్వీకరిస్తారు. బదిలీ కోరుకునే వారికి ఉద్యోగంలో బదిలీ లభిస్తుంది. విదేశీఉద్యోగ, విద్యాప్రయత్నాలు ఫలిస్తాయి, ప్రతిష్ఠాత్మకమైన యూనివర్సిటీలలో సీటు లభిస్తుంది. కార్యాలయంలో ఉద్యోగుల తగాదాలు, బంధువులతో విభేదాలు పతాకస్థాయికి చేరుతాయి. గత అనుభవాలను దృష్టిలో ఉంచుకుని జోక్యం చేసుకోకుండా మౌనంగా ఉంటారు, ప్రేక్షకపాత్ర వహిస్తారు. టీవీ, సినీరంగంలోనివారికి, కళాకారులకు, సాంకేతిక సిబ్బందికి నూతన అవకాశాలు కలిసివస్తాయి, వచ్చిన అవకాశాలను సక్రమంగా సద్వినియోగం చేసుకుంటారు. దురభ్యాసాలకు, విందులు, వినోదాలకు దూరంగా ఉంటారు, అయినా కొన్ని సందర్భాలలో విందులు వినోదాలలో పాల్గొనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. సంగీత, సాహిత్య, లలితకళల పట్ల ఆసక్తి కనబరుస్తారు. సంతానం అభివృద్ధి వల్ల సమాజంలో వారు సాధించిన విజయాల వల్ల మీ పరపతి, గౌరవం పెరుగుతుంది. సంతానంలో ఒకరికి సంగీతం నేర్పించాలనే ఆలోచన కలుగుతుంది. నిరుద్యోగులైన విద్యావంతులకు తాత్కాలిక ఉద్యోగాలు, పార్ట్ టైం ఉద్యోగాలు లభిస్తాయి. సంవత్సర ద్వితీయార్ధంలో, ఉద్యోగాలు పర్మినెంట్ అవుతాయి, వాహన యోగ్యతా,

స్వగృహ యోగ్యతా సూచిస్తున్నాయి. కలలు కనే స్వాతంత్ర్యం, హక్కు మీకు ఉంది కానీ అది నిజం చేయడం సాధ్యమా అనేది భగవంతుడి సంకల్పంతోనే సాధ్యం అవుతుంది. ఒరిగిపోయిన (గతించిన) ఒక జీవి జ్ఞాపకాలు మనస్సును బాధిస్తాయి. మీరు చేసిన ఆధ్యాత్మిక కార్యక్రమాల తాలూకు విషయాలు పదిమందీ మెచ్చుకునేలా ఉంటాయి. చాలామంది మీ మార్గాన్నే అనుసరిస్తారు. మానసిక సంతోషం కోసమే ధర్మకార్యాలు చేస్తారు. ప్రచారం కోసం, పేరుకోసం కాదు. మనల్ని మనం సంస్కరించుకుంటే సమాజాన్ని ఉద్ధరించినట్లే అని భావిస్తారు. ఎవరూ చెప్పకుండా మీరే కొన్ని మార్పులు తెచ్చుకుంటారు. **"మనం ఇతరులకు ఏం చేశాం అన్నది ఆలోచించండి, ఇతరులు మీకు ఏం చేశారన్నది ఆలోచించవద్దు"**, నిరాశ చెందవద్దు. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వహిస్తారు. ఫలితం కోసం ఎదురు చూడరు. భగవంతుడిని కోరికలు అడిగే పద్ధతికి స్వస్తి చెబుతారు. శారీరక రుగ్మతలకన్నా మానసిక రుగ్మతలు చాలా ప్రమాదకరం అని గ్రహిస్తారు. అసూయాద్వేషాలకు దూరంగా ఉంటారు, మంచి జరిగినా చెడు జరిగినా ఏమాత్రం చలించరు. ఇది మీకు మీరుగా తెచ్చుకున్న మార్పు. ప్రతిరోజూ అష్టమూలికా తైలంతో ఇష్టదైవం సన్నిధిలో లక్ష్మీవత్తులతో దీపారాధన చేయండి, పూజలో పరిమళ గంధాన్ని, పరిమళ జువ్వాదిని వాడండి. సిద్ధగంధాన్ని నొసటన ధరించండి. చాలా విషయాలలో మీకు మీరుగా చాలా మార్పులు తెచ్చుకుంటారు. విదేశాలలో ఉన్న మీ బంధువర్గానికి, మిత్రులకు ఇక్కడి ఆస్తులు కొనుగోలు చేయడంలో సహకరిస్తారు. బాధ్యత అంతా మీరే తీసుకుని ఆస్తులు కొంటారు, ఆస్తుల విలువ రెట్టింపు అవుతుంది. బంధుమిత్రుల సంతోషానికి అవధులు ఉండవు, సన్నిహితులు ఇచ్చిన బహుమతులు స్వీకరించరు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న విద్యాసంస్థలకు, సేవాసంస్థలకు మంచి కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. కష్టపడడంలో ఉన్న ఆనందం ఎందులోనూ లేదని మీరు భావిస్తారు. మీరు చెప్పే మంచి మాటలు, బోధనలు అందరికీ నచ్చుతాయి, అందరూ ఆచరిస్తారు. మీ ఇంట్లోవాళ్ళకు మాత్రం మీ మాటలు రుచించవు. ఈ ధనుస్సు రాశి వారికి ప్రబలమైన ఏలిననాటి శని నడుస్తుంది, ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయించాలి. నలుపువత్తులతో దీపారాధన చేయాలి, అఘోరపాశుపత హోమం చేయాలి. కుటుంబ వ్యవహారాలను నిర్లక్ష్యం చేస్తున్నారనే అపవాదు వస్తుంది. ఎటువంటి విమర్శలకు ప్రతిస్పందించకుండా నిండుకుండలా ఉంటారు. విలువలేని వ్యక్తులకు ప్రాధాన్యతనిచ్చి మాట్లాడడానికి ఇష్టపడరు. ఆచరణలో మీ ఈ నిర్ణయం మంచి ఫలితాలను ఇస్తుంది. సాంకేతికవిద్యలో చక్కగా రాణిస్తారు, వ్యాపారసంబంధమైన విషయాలు కూడా లాభిస్తాయి. పన్నులు వసూలు చేసే అధికారుల వల్ల కొన్ని చికాకులు సంభవిస్తాయి. మీరు అభిమానించి ఆశలు పెట్టుకున్న వ్యక్తులు మంచి స్థితిని సాధిస్తారు. మీ మనోబలానికి, మనోధైర్యానికి ఇది ఒక కారణం అవుతుంది. ఎన్ని విధాలా చెప్పినా మారని వ్యక్తులు కొంతమంది ఉంటారు, వీళ్ళలో మార్పు తీసుకురాలేమని వదిలివేస్తారు. దైవసంకల్పం ముందు మానవుడు చాలా బలహీనుడని కొన్ని సంఘటనలు నిరూపిస్తాయి. మార్పు, పరివర్తన కాలానుగుణంగానే నడుస్తాయి కానీ మన ప్రయత్నాల వల్ల రావని గ్రహిస్తారు. ఇన్సురెన్స్ విషయంలో జాగ్రత్త వహించండి. చోర (దొంగ) భయం పొంచి ఉంది. పూర్వీకులు రాసిన డాక్యుమెంట్లు, వీలునామాలోని లోపాలు కీలకసమయంలో ఇబ్బంది పెడతాయి.స్పష్టతలేని పెద్దల అభిప్రాయాలు సంకటానికి గురిచేస్తాయి. జ్ఞాపకశక్తిని పెంచుకునే ప్రయత్నాలు చేస్తారు. విద్యార్థినీవిద్యార్థులు సరస్వతి తిలకం నొసటన ధరించి, జ్ఞానచూర్ణాన్ని సేవించడం చెప్పదగిన సూచన.మార్షల్ ఆర్ట్స్ పట్ల ఆకర్షితులు అవుతారు.అన్యభాషలు తెలుసుకోవటం చాలా అవసరం అని భావిస్తారు, ఆ దిశగా మీరు శక్తివంచన లేకుండా కృషి చేస్తారు.సహోదరసహోదరీ

వర్గానికి రహస్యంగా ఆర్థికసాయం చేస్తారు. ఫ్యాన్సీ షాపు కలవారికి, ఎలక్ట్రానిక్ వస్తువుల విక్రయేతలకు, స్టేషనరీ వ్యాపారస్తులకు, బ్యూటీపార్లర్ల వారికి, చేతివృత్తుల పనివారికి, సుగంధద్రవ్య వ్యాపారులకు, ఎగ్జిబిషన్ కౌంటర్స్ వారికి, హోల్‌సేల్ వ్యాపారులకు, పబ్లిషర్స్‌కు అనుకూలంగా ఉంది. విలువైన భూములను, వస్తువులను గతంలో కొనుగోలు చేయడం వల్ల చాలా మేలు జరుగుతుంది, వాటి విలువ చాలా పలుకుతుంది. రియల్ ఎస్టేట్ వ్యాపారరంగంలో ఉన్నవారికి కాలం అనుకూలంగా ఉంది. వ్యాపారపరంగా నూతన నిర్ణయాలు తీసుకుంటారు, అవి సానుకూల ఫలితాలను ఇస్తాయి, ప్రజాదరణ పొందుతారు. చెప్పుడు మాటలు విని అయిన వాళ్ళందరినీ దూరం చేసుకుని నష్టపోతారు. దురుసుగా మాట్లాడి అయినవాళ్ళని దూరం చేసుకోవడం మంచి లక్షణం కాదు, కోపంగా మీరు అలా మాట్లాడినప్పటికీ నిజానిజాలు బేరీజు వేసుకుంటారు. విషయాలను కంటితో చూసి నిజాలను నిర్ధారించుకుంటారు. వస్త్రవ్యాపారం చేసుకునే వారికి సాధారణ ఫలితాలు ఉన్నాయి, శ్రమకు తగిన ఫలితం లభించదు. బంధువుల మధ్య ప్రేమానురాగాలు బాగానే ఉంటాయి. నిర్మాణరంగంలో రాణిస్తారు, గుడ్‌విల్ పెరుగుతుంది. ప్రతిరోజూ ప్రతినిత్యం అష్టమూలికా తైలంతో, అరటినార వత్తులతో మీ ఇష్టదైవం సన్నిధిలో దీపారాధన చేయండి. మహాతీర్థం పొడితో, సిద్ధగంధం పొడితో అభిషేకం చేయండి, చాలా మంచిది. తక్కువ వ్యవధిలో సాగే తాత్కాలిక వ్యాపారాలు, నీటికి సంబంధించిన వ్యాపారాలు బాగుంటాయి. కోర్టు వ్యవహారాలలో విజయం సాధిస్తారు, అనుకూలమైన తీర్పులు వస్తాయి. ట్రావెల్స్, ఆటో మొబైల్స్ వ్యాపారాలు బాగుంటాయి. ఇతరుల పేరుమీద చేసే వ్యాపారాలు బాగుంటాయి. కొన్ని వివాదాలకు దూరంగా ఉండాలనే వ్యాపారంలో మీ లాభాలు తగ్గించుకుంటారు. సంవత్సర ద్వితీయార్ధంలో ఇతరుల పేరుమీద వ్యాపారాలు చేయకూడదు అని నిర్ణయించుకుంటారు. చెక్కులు బౌన్స్ అవడం చికాకు కలిగించే వ్యవహారంగా మారుతుంది. ఫైనాన్షియల్ స్కీమ్స్, లక్కీ డ్రాల వల్ల నష్టపోతారు. మీరు ధనం పెట్టుబడి పెట్టిన దివాళా తీసిన ఫైనాన్స్ కంపెనీ నుంచి కొద్దో గొప్పో ధనం వస్తుందని ఆశిస్తారు, మీ ఆశ నిరాశే అవుతుంది. ప్రభుత్వాల పరంగా, అధికారుల పరంగా ఎలాంటి ఊరట లభించదు. నేరస్థులకు అధికారులే అమ్ముడుపోతే ఇక వచ్చేది ఏముంది. పాల ఉత్పత్తులు, ఇంటర్నెట్ సెంటర్, వైద్య పరికరాలు అమ్మే వ్యాపారాలు చాలా బాగుంటాయి. షేర్స్ వ్యాపారం, ఆన్‌లైన్ వ్యాపారాలు వద్దు. మంచి పెళ్ళి సంబంధం కుదురుతుంది, శుభకార్యాలు చేస్తారు. మీ మీద ఉన్న బరువుబాధ్యతలను తీర్చుకుంటారు. పునర్వివాహ సంబంధ వ్యవహారాలు కూడా సానుకూల పడతాయి. కంప్యూటర్ దగ్గర అవసరానికి మించి ఎక్కువగా కూర్చోవద్దు. సినిమాలకు, టీవీలకు ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తారు. క్షమించరాని స్వంత వ్యక్తులను క్షమించి వాళ్ళకు ఒక దారి చూపిస్తారు. మీరు ఎంత చేసినా వ్యక్తులలో మాత్రం మార్పురాదు. అంతర్గత వేదన చెప్పుకోవడానికి మనుషులే కరువవుతారు. శుభకార్యాల నిమిత్తం ధనాన్ని విశేషంగా ఖర్చు చేస్తారు. అవినీతిపరమైన అధికారుల వల్ల కొన్ని చికాకులు ఏర్పడతాయి. నిత్యం దైవికం అనే పొడితో వ్యాపార ప్రదేశంలోనూ, ఇంట్లోనూ ధూపం వేయండి. అంతరాత్మ సాక్షిగా తీసుకున్న నిర్ణయాలకే కట్టుబడి ఉంటారు. ఉద్యోగపరంగా నూతన బాధ్యతలు సంతోషాన్ని కలిగిస్తాయి, మీడియాపరంగా మీరు కోరుకున్న అవకాశాలు కలిసివస్తాయి. కీలకమైన రాష్ట్రప్రభుత్వ ఉద్యోగం లేదా కేంద్రప్రభుత్వ ఉద్యోగం లభిస్తుంది. రాజకీయ పదవుల్లో ఉన్నవారికి అవినీతి, అధికార దుర్వినియోగం అన్న అపవాదులు వస్తాయి, జాగ్రత్త వహించండి. అవివాహితులైన వారికి వివాహ యోగ్యత ఉంది, సంతానం లేని వారికి సంతానప్రాప్తి కలుగుతుంది. మీ వ్యక్తిగత కుటుంబ విషయాలను బహిర్గతం చేస్తున్న వ్యక్తిని గమనించి

దూరంగా ఉంచుతారు. పాతస్నేహితులను, భాగస్వాములను కలిసి చర్చించి నూతన వ్యాపారం ప్రారంభిస్తారు. కొన్ని సందర్భాలలో చదివిన చదువుకు, చేసే ఉద్యోగానికి సంబంధం ఉండదు. బిజినెస్ మేనేజ్‌మెంట్‌లో రాణిస్తారు. కొత్త బాధ్యతలు సరిగ్గా నిర్వర్తించలేకపోతున్నారన్న అపవాదులు, ఆరోపణలు వచ్చే అవకాశం ఉంది. అన్నింటికి మీ శక్తిసామర్థ్యాలే జవాబు చెబుతాయి. వాహనాన్ని నడిపేటప్పుడు జాగ్రత్త వహించండి, వీలైనంత వరకు సెల్ఫ్ డ్రైవింగ్‌కు దూరంగా ఉండండి. ధనుస్సురాశి వారికి ఏలిననాటి శని నడుస్తుంది కనుక ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయాలి, నలుపువత్తులతో దీపారాధన చేయాలి, అఘోరపాశుపత హోమం చేయాలి. సరి అయిన సామర్థ్యం కలిగినటువంటి సన్నిహితులు కరవు అవడం వలన ప్రతి విషయం మీరే దగ్గర ఉండి చూసుకోవాల్సిన పరిస్థితి వస్తుంది. యూనియన్‌లకు సంబంధించిన విషయాలు వివాదాస్పదంగా మారతాయి. మీ వ్యక్తిగత పరపతి పెరగడంతో పాటు, శత్రువులు కూడా పెరుగుతారు. సమాజంలో ఓ స్థాయి కలిగినవారు కూడా మీపై నిష్కారణంగా అసూయాద్వేషాలు పెంచుకుంటారు. నిత్యం నాగసింధూరాన్ని నొసటన ధరించండి, సర్వదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. ఉద్యోగపరంగా మీపై కక్ష సాధించాలనుకునే మీ పై అధికారికి స్థానచలనం కలుగుతుంది. మరొకరి తరఫున మీరు లిఖిత పూర్వకమైన అభ్యర్థనలు వ్రాయవలసి వస్తుంది, దీని నుండి తప్పించుకోవడానికి మార్గం దొరకదు. మీకు అత్యంత సన్నిహితులైనవారికి అండదండగా ఉండి సహాయం చేస్తారు, ఇది తప్పని పరిస్థితి. బంధుమిత్రులకు సహాయం చేయడం వల్ల గృహంలో కొన్ని చికాకులు ఎదురవుతాయి. మీ సంతాన విషయంలో ముఖ్యంగా వాళ్ళ చదువుల విషయంలో కొన్ని స్పష్టమైన నిర్ణయాలు చేయవలసి వస్తుంది, అధికంగా ధనాన్ని ఖర్చు పెట్టవలసిన పరిస్థితి రావచ్చు. పెండింగ్‌లో ఉన్న బిల్లులు సమయానికి చేతికి అందుతాయి. ప్రభుత్వపరమైన ఉత్తర్వులు, కాంట్రాక్టులు మీ అంచనాల మేరకు ఫలిస్తాయి. సాంకేతిక కారణాల వల్ల కొన్ని ఆస్తులు అమ్మడానికి ఆటంకాలు వస్తాయి. వృత్తిఉద్యోగాలపరంగా మీకంటే పెద్దస్థాయి కలిగిన వారితో అంతరంగిక చర్చలు ఫలిస్తాయి. ఉభయులకు ఆసక్తికరమైన అంశంపై ఒప్పందం కుదురుతుంది. ఆరోగ్యపరమైన విషయాలలో జాగ్రత్తలు అవసరం. ఈ.ఎన్.టి సమస్యలు, మోకాళ్ళనొప్పులు, బ్యాక్ పెయిన్ రావచ్చును. గతంలో పాల్గొన్న క్రీడలలో, సాంస్కృతిక సాహిత్య కార్యక్రమాలలోని అప్పటి పరిచయాలు, సర్టిఫికెట్లు ఇప్పుడు మీకు ఉపయోగపడతాయి. దొంగస్వామీజీల వల్ల, దొంగబాబాల వల్ల మోసపోతారు. సొంతవాళ్ళ వల్ల అధర్మ నిర్ణయాలు వినవలసి వస్తుంది. సమాజంలో ఉన్నతస్థాయిలో ఉండి అందరి దృష్టిలో ధర్మమూర్తులుగా ప్రఖ్యాతిగాంచిన వారు మీ విషయంలో అధర్మ నిర్ణయాలు చేస్తారు. ఉపాధ్యాయులు, అధ్యక్షులు కూడా మీ పట్ల వివక్ష చూపుతారు. మీరు ఒక ప్రాంతానికో, కులానికో చెందినవారిగా మీ మీద ముద్రవేస్తారు, తెలివిగా నిర్ణయాలు తీసుకోండి. దేవాలయాల విధ్వంసం గుర్తుకు వచ్చినప్పుడల్లా మీ మనస్సు బాధపడుతుంది.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఎక్కువ అనుకూల ఫలితాలు సూచిస్తున్నాయి. జీవితాశయం సాధిస్తారు. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు, మంచి ఉద్యోగం లభిస్తుంది. విద్యాసంబంధమైన విషయాలలో పురోగతి బాగుంది, వైద్యవిద్యకు సంబంధించి మీ కృషి ఫలిస్తుంది. అవివాహితులైన స్త్రీలకు వివాహకాలం. సంతానం లేని వారికి సంతానప్రాప్తి. మీరు ఎంతగానో అభిమానించిన వ్యక్తిని సమాజం కోసం వదులుకోవాల్సి వస్తుంది. ఎంతో కష్టతరమైన కార్యాలను ఎవరి ప్రోత్సాహం లేకుండా ఒంటరిగా పోరాడి సాధిస్తారు. కుటుంబ బాధ్యతలను సక్రమంగా

నిర్వర్తిస్తారు. పదవిలో ఉండి పదిమందికి సహాయపడతారు, మీకు మీరుగా ఏమీ చేసుకోలేరు. సంతానసంబంధమైన విషయంలో స్వల్ప ఒడిదుడుకులు ఏర్పడతాయి, మొండిగా ఉన్న సంతాన విషయంలో ఎంతో ఓర్పు వహిస్తారు. మెల్లగా మంచి మాటలతో వారిని దారిలో పెట్టగలుగుతారు. జీవితభాగస్వామితో విభేదాలు వస్తాయి, సర్దుకుని పోవడానికి ప్రయత్నిస్తారు. కొంతమంది విషయంలో జీవితభాగస్వామితో విసిగిపోయి విడిపోవడం సంభవిస్తుంది. మీ మంచితనాన్ని అలుసుగా తీసుకుని మీ మీద పెత్తనం చేసే స్త్రీల విషయంలో కాస్త ఆలస్యంగా ప్రతిఘటిస్తారు. మీతో వైరం పెట్టుకోవడానికి భయం కలిగే పరిస్థితులు సృష్టిస్తారు. సహోదరసహోదరీ వర్గానికి అండగా ఉంటారు. ఇచ్చిన దబ్బులు తిరిగిరావు, జాగ్రత్త వహించండి. ఇతరులకు ఇచ్చిన ధనం అప్పు కాదు దానం అని భావించండి. ప్రతిరోజూ ప్రతినిత్యం ఆరావళికుంకుమతో, అష్టగంధం పొడితో మహాలక్ష్మీదేవికి పూజ చేయండి, సుమంగళి పసుపును వాడండి. ఆరోగ్యపరమైన విషయాలలో జాగ్రత్తలు తీసుకోవాలి. చాలామంది మీ మీద చూపిస్తున్న ప్రేమాభిమానాలు మీరున్న స్థితిని చూసి, మీరు సంపాదించిన ధనాన్ని చూసి మాత్రమేనని ఆలస్యంగా గ్రహిస్తారు. ఆభరణాలు, వాహనాలు కొనుగోలు చేస్తారు. స్వంత ఇల్లు ఉండి కూడా అద్దె ఇంట్లో ఉండాల్సి వస్తుంది. సెంటిమెంటు వస్తువుల విషయంలో జాగ్రత్త వహించండి. నిజం నిప్పులాంటిది అది ఎప్పటికైనా బయటపడుతుంది. అదే విధంగా మీ నిజాయితీతో వెలుగుచూస్తుంది. మీమీద అపవాదులు ప్రచారం చేసినవాళ్ళు, పుకార్లు ప్రచారం చేసినవాళ్ళు తలదించుకునే పరిస్థితి వస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపిస్తారు. పూజలలో పరిమళ గంధాన్ని, పరిమళ జువ్వాదిని ఉపయోగించండి. దొంగస్వామీజీలను, దొంగబాబాలను నమ్మి నష్టపోతారు. ఉద్యోగంలో పదోన్నతులు వస్తాయి. న్యాయస్థానాల పరంగా న్యాయం జరుగుతుంది. క్రమశిక్షణ పద్ధతులు అవలంబిస్తున్న మిమ్ములను అందరూ అభిమానిస్తారు, ప్రయోగాలు చేసేటప్పుడు జాగ్రత్త వహించండి. గతంలో నేర్చుకున్న ఇతర భాషల వల్ల లాభపడతారు. అసూయాగ్రస్తమైన ఈ ప్రపంచంలో మీకు ఇష్టంలేని విషయాలు పట్టించుకోకండి, మీకు ఇష్టమైన విషయాలపైనే దృష్టిని కేంద్రీకరించండి. సాధ్యమైనంత వరకు మీ మనస్సుకు ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉండండి. సంగీతసాహిత్యరంగాలలో అవార్డులు, కీర్తిప్రతిష్టలు లభిస్తాయి. జీవితంలో కొత్త వ్యక్తుల ప్రవేశం అనేక కొత్త మలుపులకు దారితీస్తుంది. దూరదేశంలో చదువుకోవాలనుకున్న మీ ఆశ నెరవేరుతుంది. మీ మనస్సులోని భావాలను ఇతరులకు తెలియజేయడం వల్ల చాలామందికి విరోధి అవుతారు, మీ మనస్సులోని మాట ఎవరికీ చెప్పవద్దు. తల్లిదండ్రులు, పెద్దలు, బంధువులతో విభేదాలు వచ్చే పరిస్థితులు ఉన్నాయి. ఆకస్మికంగా శుభకార్యాలు నిశ్చయం అవుతాయి. స్వయం సంపాదనతో స్థిరాస్తి కొనుగోలు చేస్తారు. బ్యూటీపార్లర్లు లాభిస్తాయి. అలంకరణ సామాగ్రి వ్యాపారాలు, పరిశోధనలు లాభిస్తాయి. క్రూరమైన మనస్తత్వం కలిగిన వ్యక్తులతో కొంత కాలం సహజీవం చేయవలసి వస్తుంది. సుందరమైన, మనోహరమైన ప్రదేశాలను సందర్శిస్తారు. వంశ వృద్ధి జరుగుతుంది. మీరు చేసే ప్రతిపనికి దైవానుగ్రహం తోడవుతుంది. ప్రతిరోజూ లక్ష్మీతామర వత్తులతో అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి, మంచి జరుగుతుంది.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121





# 2017-2018 లో మకరరాశి ఫలితములు

| ఆదాయం - 14 | వ్యయం - 14 | రాజ - 3 | అవ - 1 |
|---|---|---|---|

**ఉత్తరాషాఢ 2, 3, 4 పాదములు, శ్రవణం 1, 2, 3, 4 పాదములు, ధనిష్ఠ 1, 2 పాదముల యందు పుట్టినవారు "జో, జా, జీ, జూ, జే, ఖా, గా, గీ" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు మకరరాశికి చెందినవారు.**

# 2017-2018 సంవత్సర ఫలితములు

**మకరరాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. ఏలిననాటి శని ప్రభావం వల్ల ఎటువంటి ఇబ్బందులు రాకుండా ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం శైవాగమనం ప్రకారం చేయాలి. ఆర్థికంగా ఎంత ఆదాయం వచ్చినా దాచుకునేది ఏమీ ఉండదు. రావాల్సిన డబ్బుకు ఖర్చు రెడీగా ఉంటుంది. వివాదాలు, తగాదాలు, మధ్యవర్తి పంచనామాలు, రాజీయత్నాలు, పరిష్కారాలు మొదలైనవి తప్పకపోవచ్చు. మీ ప్రమేయం లేని విషయాల్లో కూడా మీ పేరు వినబడుతుంది, చాలా సందర్భాలలో మిమ్ములను మీరు నిరూపించుకోవలసి వస్తుంది. రాజకీయ ముసుగులో ఉన్న రౌడీల దౌర్జన్యానికి ఇబ్బంది పడతారు. సాంకేతికవిద్య, వైద్యవిద్యకు సంబంధించిన విషయాలు, విదేశీ విద్యకు సంబంధించిన విషయాలు కూడా అతికష్టం మీద సానుకూలపడతాయి. గతంలో అవకాశం ఉన్నా ఆస్తులు కొనుగోలు చేయనందుకు బాధపడతారు. ప్రతిష్ఠాత్మకమైన యూనివర్సిటీలలో సీటు లభించడం కష్టం అవుతుంది. రాజకీయపరమైన వ్యూహాలు అంతగా లాభించవు. బలమైన శత్రువర్గాన్ని కూడా లెక్కచేయరు. ఉన్నతాధికారులతో మంచి సంబంధబాంధవ్యాలు కలిగి ఉంటారు. సమాజాన్ని మోసం చేస్తున్న వ్యక్తులను, సంస్థలను ప్రజాబలంతో ఎదుర్కొంటారు. అందరికీ న్యాయం జరిగేలా కృషి చేస్తారు. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు. నిరుద్యోగుల కష్టాలు తీరుతాయి, మంచి ఉద్యోగాలు లభిస్తాయి. ఆరోగ్య సంబంధిత విషయాలలో, సెల్ఫ్ డ్రైవింగ్ విషయాలలో జాగ్రత్తలు అవసరం. సహోదరసహోదరి వర్గానికి కీలక సమయంలో ఎలాంటి సహాయం చేయలేకపోతారు. సన్నిహిత వర్గం వల్ల కొన్ని ప్రయోజనాలు పొందుతారు. నూతన వ్యాపారం కలిసివస్తుంది, ప్రస్తుతం చేస్తున్న వ్యాపారంలో చాలా రకాల మార్పులు చేస్తారు. దీర్ఘకాలిక ఋణాలు వేలల్లో వసూలు చేసుకుంటారు. హుందాగా కనబడటానికి అలంకరణకు ప్రాముఖ్యతనిస్తారు, విలువైన కాస్మోటిక్స్‌ని పదేపదే కొనుగోలు చేస్తారు. కుటుంబంలో అశాంతి వాతావరణం లేకుండా మీకు మీరుగా చాలావరకు సర్దుకుపోతారు. స్త్రీల వల్ల చికాకులు, ఇబ్బందులు సంభవిస్తాయి. జ్యేష్ఠ కుమార్తె లేదా జ్యేష్ఠ కుమారుడి విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారు. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి, శుభకార్యాలు మీ శక్తికి మించి ఘనంగా నిర్వహిస్తారు. ఇది

మీ బంధువర్గంలోనూ, మిత్రులలోనూ అసూయకు దారితీస్తుంది. అయిన వాళ్ళే ప్రతిదానికీ అసూయపడితే ఇక బయటి వాళ్ళ సంగతి ఏమిటి, సమాజం ఎటుపోతుంది, మనం ఎటు పయనిస్తున్నాం అని బాధ కలిగించే విషయాలను పట్టించుకోకూడదు అని నిశ్చయించు కుంటారు. కోర్టులలో ఉన్న వివాదాస్పద విషయాలు మీకు అనుకూలంగా మారతాయి, కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. మీ మంచితనాన్ని ఆసరాగా తీసుకుని బంధువులే మోసం చేయాలని అనుకుంటారు. ఎక్కడపడితే అక్కడ గుడ్డి సంతకాలు చేయకండి. మధ్యవర్తిగా ఉండవద్దు, అత్యవసరంగా సంతకాలు చేయాల్సిన పరిస్థితి ఎదురైతే నిపుణుల సలహాలు తీసుకుని సంతకాలు చేయండి. మూతపడిన పరిశ్రమలను తక్కువ ధరకు కొనుగోలు చేసి తద్వారా వ్యాపారం ప్రారంభిస్తారు. ఇతరుల గుడ్‌విల్ మీకు ఉపయోగపడుతుంది. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న విద్యాసంస్థలకు, సేవాసంస్థలకు మంచి ప్రఖ్యాతి లభిస్తుంది, అదే సమయంలో కొన్ని విమర్శలు కూడా వినిపిస్తాయి. విమర్శల ద్వారా వచ్చిన సూచనలను పాటించి ఎక్కడా లోపం లేకుండా చేసుకుంటారు. ప్రతి విషయాన్ని రెండు వైపులా ఆలోచించి నిర్ణయం తీసుకుంటారు, ఇది మీకు లాభించే అంశం. కొన్ని విషయాలలో నిర్ణయాలు తీసుకోకపోవడమే మంచి నిర్ణయం అని భావిస్తారు. మీరు మెతకమనిషి అని ఇతరులు వేలు పెట్టి చూపించినా మీరు మాత్రం మీ వైఖరిని మార్చుకోరు. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు లాభిస్తాయి. ఇతరులకు సంబంధించిన వస్తువులు, డాక్యుమెంట్లు మీ దగ్గర దాచిపెట్టవలసిన పరిస్థితి వస్తే తిరస్కరించండి. మీకు ఎంత సన్నిహితులైన వారు అయినా సరే నిర్మొహమాటంగా వ్యవహరించండి. పార్ట్‌టైం ఉద్యోగాలు చేస్తున్నవారికి, తాత్కాలిక ఉద్యోగాలు చేస్తున్నవారికి ఉద్యోగాలు పర్మినెంట్ అవుతాయి. దివాళా తీసిన కంపెనీ నుంచి కొద్దో గొప్పో ధనం వస్తుందని ఆశ పడతారు, కానీ మీ ఆశ నిరాశే అవుతుంది. అవివాహితులైన వారికి వివాహం కుదురుతుంది. కాస్త ఆలస్యం అయినా మంచి సంబంధం కుదురుతుంది, అభిప్రాయాలు కుదరక కొంతమంది వ్యక్తులతో శాశ్వతంగా లేక చట్టబద్ధంగా విడిపోవడం జరుగుతుంది. అవినీతిపరులైన అధికారులకు దూరంగా ఉంటారు, కార్యాలయంలో మీ స్థానాన్ని, స్థాయిని పదిలం చేసుకుంటారు. ప్రభుత్వపరమైన అధికార ఉత్తర్వులు, కాంట్రాక్టులు, సబ్ కాంట్రాక్టులు లాభిస్తాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలను విస్మరించరాదు. ప్రతిరోజూ మహాతీర్థం పొడితో, సిద్ధగంధంతో మీ ఇష్టదేవతలకు అభిషేకం చేయండి. పుణ్యక్షేత్రాలను సందర్శిస్తారు, మీ శక్తి కొలది దానధర్మాలు చేస్తారు. దేవాలయ ప్రతిష్ఠకు అందుకు సంబంధించిన వ్యవహారాలకు పూర్తిగా సహకరిస్తారు. గతించిపోయిన (చనిపోయిన) మీ ఆత్మీయుల జ్ఞాపకార్థం కొన్ని మంచి కార్యక్రమాలు చేస్తారు. విదేశాలలో స్థిరపడ్డ మీ ఆత్మీయవర్గంతో కలిసి తాత్కాలిక వ్యాపారాలు చేస్తారు, లాభాలు ఓ మాదిరిగా ఉంటాయి. జల, వాయు, ఆహార కాలుష్యం వల్ల ఇబ్బందిపడతారు. ఆలోచించకుండా వెంటనే సమాధానం చెప్పడం మీ శక్తి మరిచిపోయి చేసే వాగ్దానాల వల్ల కొన్ని చేదు అనుభవాలు తప్పవు. మీ ఆపద్ధర్మ అబద్ధాల వల్ల చాలామంది నష్టపోతారు. మీరు సాధించిన విజయం వెనుక అంగబలం, అర్థబలం, అధర్మ వ్యూహప్రతివ్యూహాలు, కులబలం, అధికారుల అండదండలు ప్రధానమైనవి. మీ శక్తిసామర్థ్యాల వల్లనే విజయం సాధించాం అనడం అవాస్తవం, ఈ విషయాన్ని ఆలస్యంగా అయినా లోకం గుర్తిస్తుంది. కొన్ని సందర్భాలలో రహస్యంగా కొన్ని అప్పులు చేస్తారు, రహస్యంగానే తీర్చివేస్తారు. ఆర్థికసమస్యలు వచ్చినప్పుడల్లా ఆదాయమార్గాలు అప్పటికప్పుడు ఏర్పడతాయి. దైవానుగ్రహం సంపూర్ణంగా ఉందని రుజువు

అవుతుంది. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీలో రాణిస్తారు. చాలా సందర్భాలలో మీ కృషికి తగిన ఫలితాలు లభించవు. మానవత్వం అక్కడక్కడా మిగిలి ఉందని రుజువు చేసే విధంగా కొన్ని సంఘటనలు జరుగుతాయి. నిత్యం సిద్ధగంధాన్ని నొసటన ధరించండి, సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. అష్టమూలికా తైలంతో, అరటినార వత్తులతో దీపారాధన చేయండి. దూరప్రాంత ప్రయాణాలు లాభిస్తాయి. గ్రీన్‌కార్డు కోసం ప్రయత్నించే వారికి గ్రీన్ కార్డు లభిస్తుంది. ప్రేమవివాహాలు కలిసిరావు. పునర్వివాహం కోసం ప్రయత్నించే వారికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయి. శత్రువర్గం పిటీషన్స్ వల్ల ఉద్యోగంలో బదిలీ తప్పకపోవచ్చు. వ్యాపార సంబంధమైన విషయాలలో కొన్ని మార్పులకు మీరు అంగీకరించని కారణంగా కొన్ని అగ్రిమెంట్లు వాయిదా పడతాయి. ప్రత్యర్థివర్గంలోని గ్రూపు రాజకీయాలను మీకు అనుకూలంగా మార్చుకోగలుగుతారు. ఈ విషయంలో సన్నిహిత సహచర వర్గం సహాయసహకారాలు అందుతాయి. చెప్పుకోదగిన కారణం లేకుండా ముఖ్యమైన వ్యక్తులు కొంతకాలం దూరం అవుతారు. ఎదుటివారి మనోభావాలను గౌరవించకపోయినా కనీసం వారు చెప్పే విషయాలను ఓపికగా వినండి. మీవల్ల కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు వాయిదా పడ్డాయన్న ఆరోపణలు రాకుండా జాగ్రత్త వహించండి. సన్నిహితుల విషయంలో అతిగా జోక్యం చేసుకోవద్దు, **"అతి సర్వత్రా వర్జయేత్"** అన్న సామెతను గుర్తుంచుకోండి. వైవాహిక సంబంధమైన ఇబ్బందులు ఎదుర్కొంటున్నవారు చట్టపరంగా విడిపోవడం అనివార్యంగా తోస్తుంది. గతంలో విభేదించిన విషయాలను ప్రస్తుతం సమ్మతించవలసి వస్తుంది. స్వంతవాళ్ళ మీద ఎక్కువగా ఆధారపడవద్దు. జాతకం ప్రకారం రుద్రాక్షలు ధరించండి, రుద్రాక్షలు ధరించాలంటే నియమనిష్ఠలు ఉండాలి. అపోహలతో చేసే నిర్ణయాలు, ఆలోచించకుండా చేసే పనులు నష్టం కలిగిస్తాయి. సెక్యూరిటీకి ప్రాధాన్యతనిస్తారు. కొన్ని వ్యాపారాలలో రొటేషన్ లాభాలు బాగుంటాయి, ఖర్చులు అధికంగా ఉండటం వల్ల లాభాలు అధికంగా కనబడవు. వ్యాపార సంబంధమైన విషయాలలో మీతో చర్చించకుండా మీ భాగస్వాములు స్వంత నిర్ణయాలు తీసుకుంటారు, ఇది మీకు ఎంతో ఆగ్రహం కలిగిస్తుంది, సమయం వచ్చినప్పుడు సమాధానం చెప్పవచ్చునని మిన్నకుంటారు. సాహిత్య, కళా, విద్యా, సామాజిక, పరిశోధన రంగాలలో మీరు చేస్తున్న కృషికి ఆశించిన స్థాయిలో గుర్తింపు, గౌరవం లభించవు. అపరాలు తప్పుకుంటే మిగిలేది అదృష్టమే అని గ్రహించండి. స్థిరాస్తుల వ్యవహారాలలో పెద్దలు మీకు అనుకూలంగా వ్యవహరిస్తారు. స్పెక్యులేషన్స్, షేర్ల వల్ల నష్టపోతారు. స్త్రీలతో విభేదాలు, స్త్రీల అనారోగ్యం రెండూ ఇబ్బంది కలుగజేస్తాయి. మంచి అవకాశాలు వెతుక్కుంటూ వస్తాయి, కొన్ని కారణాల వల్ల వాటిని పూర్తిగా వినియోగించుకోలేరు. అందరినీ దిక్కరించి ఓ ముఖ్యమైన కార్యక్రమాన్ని పూర్తిచేయగలుగుతారు. స్వగృహ యోగ్యతా, వాహన యోగ్యతా ఉంది. విందులు, వినోదాలు ఎక్కువగా ఆకర్షిస్తాయి. పిక్నిక్‌లకు దూరంగా ఉండడం మంచిది. సంతానానికి టూ వీలర్ కొనివ్వద్దు. మందుల వ్యాపారులకు, వైద్యులకు, మద్యపు వ్యాపారులకు, బ్లాక్ మార్కెట్ వ్యాపారులకు, కల్తీ వస్తువుల విక్రేతలకు, చేతివృత్తి పనివారికి, విద్యారంగంలో ఉన్నవారికి, ఆహారకూరగాయల వ్యాపారులకు ఈ సంవత్సరం బాగుంది. స్వంతమనుషుల వల్ల ఆశించిన పనులు నెరవేరవు, దీనికిగాను మరొకరిని వెతుక్కోవలసి వస్తుంది. కోర్టుతీర్పులు అనుకూలంగా వచ్చినా ఆచరణలోకి రావడానికి ఆలస్యం అవుతుంది. గన్ లైసెన్స్‌లకు సంబంధించి మీరు చేస్తున్న ప్రయత్నాలు ప్రభుత్వపరంగా మంజూరు అవుతాయి. ప్రభుత్వపరమైన కాంట్రాక్టులలో

లంచాలు పోగా మీకు మిగిలేది ఏమీ ఉండదు. మీరు కొన్న స్థిరాస్తుల విలువ అనూహ్యంగా పెరుగుతుంది. కానీ వాటిని అమ్మడానికి ప్రయత్నిస్తే సాంకేతికపరమైన ఇబ్బందులు ఎదురవుతాయి. మీ సంస్థలోని భాగస్వాములు, సహోద్యోగులు ఓర్పులేని వారై ఉంటారు, వాళ్ళకి తొందర ఎక్కువ. మీకు ఇది ఇబ్బంది కలిగించే వ్యవహారంగా మారుతుంది. మీకంటే పెద్దస్థాయి కలిగిన వారితో అంతరంగిక చర్చలు ఫలిస్తాయి, ఉభయులకు ఆసక్తికరమైన అంశాలపై ఒప్పందం కుదురుతుంది. ఆరోగ్యపరంగా జాగ్రత్తలు అవసరం. కీళ్ళనొప్పులు, ఈ.ఎన్.టి. సమస్యలు రావచ్చును. అదనపు బాధ్యతలు, అధికారాలు స్వీకరించకూడదని నిర్ణయించుకుంటారు. ఎప్పుడో వచ్చిన మెరిట్ సర్టిఫికెట్స్ ఇప్పుడు ఉపయోగపడతాయి. వివాహాది శుభకార్యాలు ఘనంగా నిర్వహిస్తారు, మానసిక ప్రశాంతత లభిస్తుంది. మీ మిత్రవర్గానికి శత్రువులైన వారందరికీ మీరు శత్రువులుగా ఉండవలసిన పరిస్థితి లేదని గ్రహించండి. సిద్ధగంధంతో శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించండి, మంచి జరుగుతుంది. వ్యవసాయదారులకు శ్రమకు తగిన ఫలితం లభించవచ్చు. పాత సమస్యలు, పాత శత్రువులు మళ్ళీ తెరమీదకు వస్తారు. నిష్కారణమైన నిందలు, అపోహలు, ఆరోపణలు మానసిక వత్తిడికి కారణం అవుతాయి. మీరు అమలు చేసిన మార్గదర్శక సూత్రాలు అందరికీ ఆచరణ సూత్రాలు అవుతాయి. కనిపించని కృతజ్ఞత కొరకు ఎదురుచూసి నిరాశపడతారు. ఉద్యోగంలో, వ్యాపారంలో కృతఘ్నుల యత్నాలు ఫలించవు. మీ స్వయంకృతాపరాధాలే మిమ్మల్ని ఇబ్బందికి గురిచేస్తాయి. దురభ్యాసాలకు బానిసలైన సిబ్బంది వల్ల నష్టం జరుగుతుంది. కొందరికి ఇతరుల మీద ద్వేషం, మీ మీద అభిమానంగా మారి సహాయపడతారు. ప్రత్యర్థివర్గానికి తగిన కారణం చూపి ఇబ్బందులపాలు చేయగలుగుతారు. మీరు కలలుకన్న గమ్యానికి చేరుకోవడానికి కష్టపడతారు. మీపై వచ్చిన ఆరోపణలకు వివరణ ఇవ్వరు, దృష్టి మరల్చే ప్రయత్నం చేసి విజయం సాధిస్తారు. ఎంతో కష్టపడి సాధించిన పదవి వల్ల మానసిక ప్రశాంతత ఉండదు. గతంలో విభేదించిన విషయాలను ప్రస్తుతం సమర్థించవలసి వస్తుంది. సంవత్సర ద్వితీయార్థంలో కాంట్రాక్టులు, సబ్ కాంట్రాక్టులు, లైసెన్సులు, లీజు పొడిగించే అంశాలు కొంత వివాదాస్పదం అవుతాయి. ప్రతి చిన్న విషయానికి పలుకుబడి ఉపయోగించాల్సి వస్తుంది, అధికారంలో ఉన్న రాజకీయనాయకుల జోక్యం అనివార్యం అవుతుంది. స్నేహితులతో, అభిరుచి కలిగిన వారితో ఒక మంచి ప్రయాణం చేస్తారు, మనస్సుకి ఎంతో ఆనందం కలుగుతుంది. కుటుంబంలో మీరు కోరుకున్నట్లుగానే మంచి మార్పులు వస్తాయి. పేరుప్రతిష్ఠలు ఆశించకుండా సేవా దృక్పథంతో కష్టమైన పనులు నిర్వహిస్తారు. వృత్తిఉద్యోగాలకు సంబంధించి కోర్టుతీర్పులు ఉపశమనం కలిగిస్తాయి. మీ ప్రయోజనాలను పరిరక్షించుకోవడానికి ఎవరూ సహకరించని పరిస్థితులలో, విధిలేని పరిస్థితిలో లంచాలు ఇచ్చి మీరు అనుకున్న కార్యక్రమాలు పూర్తి చేసుకుంటారు. వ్యక్తిగత సంభాషణల ద్వారా ప్రత్యర్థుల కార్యక్రమాలు బయటపడతాయి. ఉద్యోగపరంగా జరిగిన పొరపాటుకు వెంటనే సంజాయిషీ ఇచ్చి సమస్య పెద్దది కాకుండా జాగ్రత్త వహిస్తారు. స్థిరాస్తులకు సంబంధించి వివాదాలు ఏర్పడతాయి, కొన్ని కోర్టువ్యవహారాలు ఎటూ తేలక చికాకు కలిగిస్తాయి. విందులు, వినోదాలు మీకు లాభించేవి కావు అని గుర్తించండి. ఇతరులు ఇచ్చే విలువైన బహుమతులు, కానుకలు స్వీకరించవద్దు. ముఖ్యమైన వ్యవహారాల గురించి పెద్దలతో మాట్లాడుతున్నప్పుడు వినయం పాటించండి. దీర్ఘకాలికంగా వాయిదా పడుతున్న దైవసంబంధమైన మొక్కులను తీరుస్తారు. అంతరంగిక చర్చలు జరిగే చోట

కొత్తవారిని రానివ్వకండి. ముఖ్యమైన పత్రాలు, ఆర్థిక లావాదేవీలకు సంబంధించిన పత్రాలు ఎవరూ ఊహించని చోట భద్రపరచండి. మనోధైర్యంతో మీరు తీసుకున్న నిర్ణయం మీ జీవితాన్నే మలుపు తిప్పబోతున్న విషయం ఆ క్షణాన మీకు తెలియదు. ఆత్మీయులు, అయినవాళ్ళు వద్దని వారించినా మీ అంతరాత్మ సాక్షికి విరుద్ధంగా నిర్ణయించలేరు, మీ మనస్సు చెప్పిందే చేస్తారు. వృత్తిఉద్యోగాలపరంగా ఏదో ఒక వర్గానికి కాపు కాయవలసిన పరిస్థితి నుండి తప్పుకుంటారు. విద్యార్థినీవిద్యార్థులు సరస్వతీ తిలకాన్ని నొసటన ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి. సభలు, సమావేశాలు ప్రాధాన్యతను సంతరించుకుంటాయి. మహాతీర్థం పొడితో మీ ఇష్టదేవతలకు అభిషేకం చేయండి. దైవికం అనే పొడితో గృహంలోనూ, వ్యాపార ప్రదేశంలోనూ ధూపం వేయండి. నరదృష్టి, గృహదిష్టి మొదలైనవి అన్నీ పోతాయి. బహిరంగ ప్రదేశ సమావేశాలలో ప్రసంగించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. జ్యేష్ఠ సంతానం కుటుంబానికి అండగా ఉంటారు. దొంగస్వామీజీలను, దొంగబాబాలను నమ్మి మోసపోతారు. ఇష్టమైనట్లు మాట్లాడి అయినవాళ్ళను దూరం చేసుకుంటారు. ఊహలు, అపోహలు వీడి వాస్తవాలు తెలుసుకుని జీవించడం చెప్పదగిన సూచన. మీడియాపరంగా ఖ్యాతి లభిస్తుంది. టీవీ, సినీరంగాల వారికి మంచి అవకాశాలు లభిస్తాయి. హోల్‌సేల్, రిటైల్ వ్యాపారులకు అనుకూలంగా ఉంది. నిర్మాణరంగంలో ఉన్నవారికి అనుకూల ఫలితాలు గోచరిస్తున్నాయి. ఫారిన్ కొలాబరేషన్ కంపెనీలతో వ్యాపార సంబంధమైన సంబంధాలు పెట్టుకుంటారు. మీ పేరు మీద ఇతరులు చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ప్రభుత్వసంస్థల ద్వారా లాభాలు పొందుతారు. పైరవీలు చేసి ప్రభుత్వపరమైన వ్యాపారాలు సంపాదిస్తారు. అధిక శ్రమకు ఓర్చి వృత్తివ్యాపారాలలో మంచి ఫలితాలు సాధిస్తారు. వ్యూహాలు, ప్రతివ్యూహాలు నిత్యకృత్యం అవుతాయి. ఊహించని పరిణామాలు ఏర్పడినా ధైర్యంగా ఎదుర్కొంటారు. సాంకేతికవిద్యలో రాణిస్తారు. గతించిపోయిన (చనిపోయిన) ఆత్మీయుల జ్ఞాపకాలు మిమ్మల్ని బాధిస్తాయి. పుస్తకపఠనం పట్ల ఆసక్తి పెరుగుతుంది, గ్రంథరచన చేయాలన్న ఆలోచన వస్తుంది. వృథాఖర్చులు చాలావరకు అరికడతారు. బద్ధకం, నిద్ర, నీరసం, మతిమరుపు వల్ల కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు ఇరకాటంలో పడతాయి. బంధువులలో మిమ్ములను ఆరాధించేవారు ఉంటారు, వ్యతిరేకించేవారు కూడా ఉంటారు. ఈ రెండింటినీ సమానంగానే చూస్తారు. మీ మీద అతిగా ఆధారపడుతున్న సన్నిహితుల పట్ల అసహనం ప్రదర్శిస్తారు. కొందరి విషయంలో ఆర్థికబంధాలే అభిప్రాయభేదాలకు దారితీస్తాయి. ఏదేమైనా ఈ సంవత్సరం ప్రతి విషయంలోనూ జాగ్రత్తగా మసలుకోవడం చెప్పదగిన సూచన. నిత్యం నాగసింధూరం ధరించండి.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. జీవితాశయాన్ని సాధిస్తారు. శుభకార్యాలు జయప్రదంగా జరుగుతాయి. మీ మీద ఉన్న బాధ్యతలను సక్రమంగా నెరవేర్చగలుగుతారు. కొన్ని విషయాలకు సంబంధించి జీవితభాగస్వామితో అభిప్రాయాలు కలవకపోవచ్చు, ఏకాభిప్రాయం కుదరకపోవచ్చు. సాంకేతిక, వైద్యవిద్యలలో రాణిస్తారు. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు, మీకిష్టమైన ఉద్యోగాన్ని పొందగలుగుతారు. ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగాలకు సంబంధించిన అంశాలు బాగున్నాయి. దొంగస్వామీజీల వల్ల, దొంగబాబాల వల్ల నష్టపోతారు. విలువైన వస్తువులు అని భావించి దిక్కుమాలిన వస్తువులను

కొంటారు. వైద్యవిద్యకు సంబంధించిన విషయాలు మీరు అనుకున్నట్లుగా జరుగుతాయి. రాజకీయపదవులు వచ్చే అవకాశం ఉంది. గతంలో లభించిన రాజకీయపదవి వల్ల లబ్ధిపొందుతారు. అయినవాళ్ళకి, సొంతవాళ్ళకి భేదం లేకుండా ఎంతో సహాయం చేస్తారు. మీకున్న అవకాశాలను ఉపయోగించుకుని పదిమందికి ఉపయోగపడే పనులు చేస్తారు. నమ్మిన వ్యక్తి మోసం చేస్తాడు. కొన్ని సందర్భాలలో తల్లిదండ్రులను, పెద్దలను ధిక్కరించవలసి వస్తుంది. ఎవరేమనుకున్నా సరే మీరు అనుకున్నది చేసి చూపిస్తారు. భవబంధాలను, రక్తసంబంధాలను లెక్కచేయరు. ప్రతిరోజూ, ప్రతినిత్యం ఆరావళి కుంకుమతో, లక్ష్మీ చందనంతో మహాలక్ష్మీదేవికి పూజ చేయండి. సంతానం లేనివారికి సంతానప్రాప్తి సంభవం, అవివాహితులైన కన్యలకు వివాహకాలం. అడుగడుగునా సమస్యలను అధిగమించవలసి వస్తుంది. ఆటంకాలు చాలా వస్తాయి. ఎరుపు వత్తులతో, పసుపు వత్తులతో దీపారాధన చేయండి. జీవితంలో ఎదురీదుతున్నామన్న భావన కలుగుతుంది. ఎవరూ అండగా లేరన్న భావన కృంగదీస్తుంది. కొంతకాలం సన్నిహితంగా మెలిగిన వ్యక్తితో శాశ్వతంగా విడిపోవాల్సి వస్తుంది. ప్రేమవివాహాలు విఫలం అవుతాయి. పునర్వివాహ సంబంధ విషయాలు ఫలిస్తాయి. అలంకరణ సంబంధమైన వ్యాపారాలు లాభిస్తాయి. పిల్లల వల్ల కొన్ని ఇబ్బందులు ఎదురైనా సమసిపోతాయి. ఇంటికి అవసరమైన ఖరీదైన వస్తువులు కొనుగోలు చేస్తారు. స్వార్ధపూరితమైన ఈ ప్రపంచంలో ఎంతోమందికి సహాయం చేసి నష్టపోతారు. కీలకమైన సమయంలో మాటసహాయం చేసే వారు కూడా కరవు అవుతారు. వ్యాపార సంస్థలు లాభాలలో ఉంటాయి. ప్రభుత్వపరమైన స్కీములు మీకు ఉపయోగడపతాయి. చిట్టీలు, ఫైనాన్స్ వ్యాపారాలు చేసేవాళ్ళు నష్టపోతారు. తనఖా పెట్టిన వస్తువులను విడిపిస్తారు. **"స్త్రీకి స్త్రీయే శత్రువు"** అన్న సామెత మీ విషయంలో నిజమవుతుంది. సంగీతంలో మీకున్న ప్రజ్ఞకు మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. గతించిపోయిన మీ ఆత్మీయుల జ్ఞాపకాలు మిమ్మల్ని బాధిస్తాయి. మీడియాపరంగా గుర్తింపు లభిస్తుంది. వృత్తిఉద్యోగాలపరంగా మీరు తీసుకున్న నిర్ణయాలు వివాదాస్పదం అవుతాయి. మీ నీతికి, నిజాయితీకి లభించేవి ఆరోపణలు, అపోహలు, ఎవరు ఎంతగా భయపెట్టినా ధైర్యంగా మీ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తారు. మహాతీర్థం పొడితో మీ ఇష్టదైవానికి అభిషేకం చేయండి, దైవికం పొడితో ధూపం వేయండి. వెన్నుచూపి పారిపోవటం మీ చరిత్రలో లేదు అని నిరూపిస్తారు. దివారాత్రిళ్ళు వృత్తి, ఉద్యోగాల కోసం శ్రమించినా గుర్తింపులేని ఉద్యోగాలను మానేసి మరోచోట ఉద్యోగం చూసుకుంటారు. విదేశాలలో చదువుకోవాలనే మీ కోరిక నెరవేరుతుంది. విదేశాలలో ఉద్యోగం చేసే యోగ్యత స్పష్టంగా ఉంది. ఏది ఏమైనా సంవత్సర ప్రథమార్ధం కన్నా ద్వితీయార్ధం బాగుంది. ప్రతిరోజూ తామవత్తులతో అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. ఏలిననాటి శని ప్రారంభం అయింది గనుక ప్రతి విషయంలోనూ జాగ్రత్తలు చాలా అవసరం. ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, నలుపు వత్తులతో దీపారాధన చేయండి, అఘోరపాశుపత హోమం చేయించండి.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121





# 2017-2018 లో కుంభరాశి ఫలితములు

| ఆదాయం - 14 | వ్యయం - 14 | రాజ - 6 | అవ - 1 |
|---|---|---|---|

**ధనిష్ఠ 3, 4 పాదములు, శతభిషం 1, 2, 3, 4 పాదములు, పూర్వాభాద్ర 1, 2, 3 పాదముల యందు పుట్టినవారు "గు, గే, గో, సా, సీ, సు, సే, సో, దా" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు కుంభరాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**కుంభరాశి :** ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. కుంభరాశి వారికి ఈ సంవత్సరం బాగుంది. ఆర్థికపురోగతి బాగుంది. వృత్తిఉద్యోగాలపరంగా సంతృప్తి కలుగుతుంది. దీర్ఘకాలిక సమస్యలు పరిష్కారం అవుతాయి. కోర్టుతీర్పులు అనుకూలంగా వస్తాయి. ప్రేమ, మమకారం ఎవరిమీద అయితే పెంచుకున్నారో వాళ్ళు మంచి అభివృద్ధిలోకి వస్తారు. నవగృహ నిర్మాణం అనే కల నెరవేరుతుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వ్యాపార సంబంధమైన విషయాలు ఇబ్బంది లేకుండా నడుస్తాయి. భాగస్వామ్యంతో చేసే ఏ వ్యాపారమైనా కలిసి వస్తుంది. ప్రతిష్టాత్మకమైన యూనివర్సిటీలలో చదువుకోవడానికి సీటు వస్తుంది, వైద్యవిద్యకు సంబంధించి మీ కృషి ఫలిస్తుంది. కష్టానికి తగిన ఫలితం ప్రతి విషయంలోనూ ఉంటుంది. వినూత్నమైన ఆధ్యాత్మిక వ్యాపారాలు బాగుంటాయి. నూతన వాహనాన్ని కొనుగోలు చేస్తారు. విందులు, వినోదాలకి సాధ్యమైనంత దూరంగా ఉంటారు, అయినప్పటికీ కొన్ని విందులు, వినోదాలకు వెళ్ళవలసి వస్తుంది. ఎదుటివాళ్ళ ఆంతర్యం అర్థం అవుతుంది. విష మనస్తత్వం కలిగిన వ్యక్తుల వైఖరి ప్రత్యక్షంగా చూస్తారు. ఇలాంటి వాటిని లెక్కచేయకుండా మీరు అనుకున్న కార్యక్రమాన్ని ధైర్యంగా నడిపిస్తారు. ఉన్నతాధికారులు, రాజకీయనాయకుల వద్ద పలుకుబడి ఉన్నా ఉపయోగించుకోవడానికి ఇష్టపడరు. కెరియర్ పరంగా ఉన్నత శిఖరాలను అధిరోహిస్తారు. ఇతరులు మీ వ్యక్తిత్వానికి ప్రభావితం కావడం జరుగుతుంది. సనాతన విద్యలపట్ల ఆసక్తి చూపిస్తారు, దానికోసం కొంత సమయాన్ని వెచ్చిస్తారు. గతించిన ఓ వ్యక్తి జ్ఞాపకాలు మీ మనోవేదనకు కారణం అవుతాయి. మీరు చెప్పే మాటలు, సూచనలు సమాజానికి, స్నేహితులకు ఎంతగానో ఉపయోగపడతాయి. ఇంట్లో వాళ్ళకు మాత్రం మీ మాటలు ఎంతమాత్రం రుచించవు. ఉద్దేశ్యపూర్వకంగా మీరు చెప్పిన పనులు చేయరు. మీ ఓర్పుకి, సహనానికి పరీక్షగా మారినా మీ కోపాన్ని అదుపులో ఉంచుకుంటారు. మూర్ఖులను మార్చలేమని నిర్ణయించుకుంటారు. అనంతమైన కాలచక్ర భ్రమరంలో మార్పులు కచ్చితంగా వస్తాయి. మంచిమాటలు పెడచెవిన పెట్టిన మీ వాళ్ళు ఫలితం ఎలా ఉంటుందో తెలుసుకుంటారు. విదేశాలలో ఉద్యోగం చేసేవారికి స్థిరత్వం లభిస్తుంది. ఆహార నియమాలు పాటిస్తారు, అరుగుదలకు సంబంధించిన ఇబ్బందులు రావచ్చును. ర్యాష్ డ్రైవింగ్ పనికిరాదు,

సెల్ఫ్ డ్రైవింగ్‌కి వీలైనంత దూరంగా ఉండండి. దూరప్రాంత ప్రయాణాలు చేసి, రహస్య చర్చలు కొనసాగించి లాభం చేకూర్చే ఒప్పందాలను కుదుర్చుకుంటారు, కొన్ని వృథా ప్రయాణాలు కూడా చేయవలసి వస్తుంది. ప్రతిష్టాత్మకమైన పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు. ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్., ఐ.ఐ.టి వంటివాటికి ఎంపిక అవుతారు, గణిత విద్య (సి.ఎ.) లాభిస్తుంది. వైద్యరంగంలో దయామయుడిగా పేరు పొందుతారు. వైద్యపరమార్థం కేవలం డబ్బులు సంపాదించడం కోసం కాదని దాని ద్వారా కొన్ని జీవితాలను నిలబెట్టడానికి భగవంతుడు అవకాశం ఇచ్చాడని భావిస్తారు. విశ్రాంతి అనే పదాన్ని మరచిపోతారు, ప్రతిక్షణం కష్టపడితే కానీ ఉన్నతస్థానాన్ని దక్కించుకోలేము అన్న భావన మీ మదిలో కలుగుతుంది. ఒకస్థాయి సాధించడానికి ఎంత కష్టపడాలో అది నిలబెట్టుకోవడానికి మరింత కష్టపడాల్సి వస్తుంది. వృత్తిఉద్యోగాలపరంగా మీ స్థాయిని, స్థానాన్ని నిలబెట్టుకోవడానికి చాలా విధాలుగా శ్రమిస్తారు. స్థిరచరాస్తుల పంపకం విషయంలో నిర్ణయాన్ని భగవంతుడికే వదిలివేస్తారు, దక్కిన దానితో తృప్తిపడతారు. శల్య సారథ్యం చేసేవారు అధికం అవుతారు. **"స్నేహం అనెడి మూడు అక్షరముల తీయని మాట మన సంస్కృతి సాంప్రదాయాలలో ప్రముఖమైన స్థానాన్ని పొంది ఎన్నో మహత్తరమైన కార్యక్రమాలకు, ఆదర్శమైన విషయాలకు సమాజ పరిరక్షణలు ప్రధాన భాగం వహించి వర్ధిల్లుతుంది. స్నేహమే జీవితంగా, ప్రాణంగా భావించి స్నేహానికి నిజమైన అర్థాన్ని తెలియజేసిన మహనీయులు ఎందరో ఉన్నారు".** పవిత్రమైన స్నేహం ముందు ధనం కానీ రాజ్యాధికారం కానీ మరే ఇతర ప్రలోభాలు కానీ పనిచేయవని, స్నేహం శాశ్వతమైన, పవిత్రమైన బంధం అని భావించి దానిని ఆచరించి మనకు సందేశాలు అందించిన మహనీయులు ఎందరో ఉన్నారు. స్వార్థం అనెడి మూడు అక్షరముల మాట పవిత్రమైన స్నేహాన్ని విధ్వంసం చేస్తుంది. స్నేహానికి కొత్త భాష్యాలు, వక్రభాష్యాలు చెపుతుంది. స్నేహం వ్యాపారం అని, స్వార్థం అని చెపుతుంది. ఎంతమందికి ఎన్ని విధాలుగా సహాయపడినా కృతజ్ఞత, అభిమానం అనేవి మచ్చుకైనా కానరాదు. ఈ పోటీప్రపంచంలో నిలదొక్కుకోవడానికి, కుటుంబాన్ని పోషించడానికి ముఖ్యంగా పిల్లల ఎదుగుదలకు గట్టి పునాది వేయడానికి అందుకు అవసరమైన ధనం కోసం సిద్ధాంతాలను తాకట్టు పెట్టవలసిన పరిస్థితి వస్తుంది. వృద్ధులు, పెద్దల సంక్షేమానికి ఎక్కువ ఖర్చు చేస్తారు. ఆదర్శవంతమైన మార్గంలో సక్రమంగా నడుస్తున్నప్పటికీ బంధువర్గం నుండి విమర్శలు వస్తాయి, ఇది ఎంతో బాధకలిగించే అంశంగా మారుతుంది. చిల్లర ఖర్చులు అధికం అవుతాయి. విదేశీయాన సంబంధమైన విషయాలు లాభిస్తాయి. ధనం సంపాదించడానికి మీ వ్యూహాలు మంచి ఫలితాలను ఇస్తాయి. మీ తెలివితేటల వల్ల, మీరు చేసే పనుల వల్ల మీరే కాకుండా ప్రక్కవారు కూడా లాభపడతారు. లాభం వచ్చే వాటిల్లో ధనాన్ని వాటాగా పెడతారు, సంతానం కోసం ధనాన్ని దాచిపెడతారు. సేవాసిబ్బంది వల్ల ఇబ్బంది పడతారు. మీ బాధ్యతలకు సంబంధించి కొన్ని వివాదాస్పద విషయాలలో జోక్యం చేసుకుంటారు. సమాజసేవలో మంచి ప్రఖ్యాతి వస్తుంది. వృద్ధాశ్రమాలను చక్కగా నిర్వహిస్తారు, విరాళాలు వస్తాయి. వేలం పాటలో విలువైన వస్తువులను చవకగా కొనుగోలు చేస్తారు. అసాంఘిక శక్తుల పట్ల అప్రమత్తంగా ఉంటారు. మితిమీరిన మంచితనం చేదు అనుభవాలకు దారితీస్తుందని గ్రహిస్తారు. ముఖ్యమైన విషయాలలో కీలక సమయంలో ఎవరినీ సంప్రదించకుండా నిర్ణయాలు తీసుకుంటారు. దూరప్రాంతంలో ఉన్న మీ వాళ్ళను కొంతకాలం ఆర్థికంగా ఆదుకోవాల్సి వస్తుంది. కొనుగోలు చేసిన స్థిరాస్తుల విలువ పెరిగినా వాటిని అమ్మడానికి వీలులేని పరిస్థితి వస్తుంది. ప్రతి

విషయంలోనూ ఇంట్లోవాళ్ళ జోక్యం అవసరం అవుతుంది. చర్మసంబంధమైన వ్యాధులు వచ్చే అవకాశం ఉంది. సంతానాన్ని ప్రేమగా చూసుకుంటారు, సంతానం వల్ల సంఘంలో గౌరవం పెరగడమే కాకుండా మానసిక సంతోషం కలుగుతుంది. ప్రజాసంబంధాలను పెంచుకుంటారు. ప్రతి విషయాన్నీ తెలుసుకోవాలనే ఆరాటం పెరుగుతుంది. ప్రతి విషయంలోనూ సహనం కోల్పోకుండా విచక్షణాయుతంగా ప్రవర్తిస్తారు. సాంప్రదాయక వంటకాలపై ఇష్టం పెంచుకుంటారు, ఫాస్ట్‌ఫుడ్స్ వల్ల ఇబ్బంది పడతారు. భాగస్వామ్య వ్యాపారంలో జరుగుతున్న మోసాన్ని గ్రహించి, నమ్మకద్రోహులను సాగనంపుతారు. అయితే ఈ ప్రక్రియ కొంత ఆలస్యం అవుతుంది. మితిమీరిన ఆత్మవిశ్వాసం, నమ్మకం పనికిరాదని గ్రహిస్తారు. జీవితభాగస్వామితో సర్దుకుపోతారు. విద్యారంగంలో ఉన్నవారికి, విద్యాసంస్థలు నడిపేవారికి కాలం చాలా అనుకూలంగా ఉంది. మానవత్వం లేని మనుషుల దగ్గర ఎంత మొత్తుకున్నా ఫలితం శూన్యం అని గ్రహిస్తారు. సమాజంలో ఉన్నతస్థాయి కలిగి, మహోన్నతమైన భావాలు కలిగిన వ్యక్తులతో కొంతకాలం కలిసి పనిచేస్తారు, వాళ్ళకి మీరు సన్నిహితులు అవుతారు. సిద్ధగంధంతో, మహాతీర్థం పొడితో ఇష్టదేవతలకు, ఇష్టదేవుళ్ళకు అభిషేకం చేయండి. అష్టమూలికా తైలంతో, ఓం నమశ్శివాయ వత్తులతో దీపారాధన చేయండి. దీర్ఘకాలిక సమస్యలు పరిష్కారం అవుతాయి. నరదృష్టి, గృహదృష్టి, చీడా, పీడా పోవడానికి దైవికం అనే పొడితో ఉదయం, సాయంత్రం ధూపం వేయండి. మానసిక ప్రశాంతత లభిస్తుంది. దైవానుగ్రహం ఉంటే ఏదైనా సాధ్యమేనని కాలం మరోసారి రుజువు చేస్తుంది. ఆకస్మిక ధనప్రాప్తి కలుగుతుంది. మీ క్రియేటివిటీతో రూపొందించిన సీరియల్స్, డాక్యుమెంటరీలు మంచి ప్రజాదరణ పొందుతాయి. కార్యాలయంలో ఇతరుల అసమర్థత మీ పాలిట వరంగా మారుతుంది. ముఖ్యమైన కార్యాలు, కీలకమైన పనులు మీకు అప్పగించబడతాయి. గతంలో ఆగిపోయిన ఒక అమ్మకం వలన ప్రస్తుతం లాభం పొందుతారు. లాభాలు ఆశించిన వాటిపై కొద్దిగా లాభాలు వస్తాయి. అప్పటికప్పుడు అనుకుని చేసే కార్యక్రమాల వలన ప్రయోజనాలు ఎక్కువగా వస్తాయి. నేర్పుగా కొన్ని విషయాలలో తప్పుకుని నష్టాలు రాకుండా బయటపడతారు. ముఖ్యమైన వ్యక్తులతో మీకున్న సంబంధ బాంధవ్యాలను మరింత పటిష్టం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు. బంధువర్గంలో ఉన్న పెద్దలే నవ్వుతూ ద్రోహం చేస్తారు, మీకు వ్యతిరేకంగా మాట్లాడతారు. ఆర్థికంగా పరిపుష్టి కలిగిన వారికే ఇంకా మేలు చేయాలని పంచాయితీలు చేస్తారు. వాళ్ళను ఎదిరించి, దిక్కరించి ప్రయోజనం లేదని తెలుసుకుంటారు. వయస్సులో పెద్దవారు అని నమ్మకం ఉంచినందుకు మీ పొరపాటుకు మీరే తిట్టుకుంటారు. **"కాలగమనం ఎప్పుడూ ఒకేలా ఉండదు"**, వివాదాలను నిదానంగా అధిగమిస్తారు. స్నేహితుల సహకారం వలన వ్యాపారంలో లాభించే ఆర్డర్లు వస్తాయి. అందివచ్చిన అవకాశాలని సద్వినియోగం చేసుకుని లాభపడతారు. సంవత్సర ద్వితీయార్థంలో వృత్తిఉద్యోగాలపరంగా పోటీరాజకీయాలు చోటుచేసుకుంటాయి. కాంట్రాక్టులు, వర్క్ ఆర్డర్లు, టెండర్లు, సబ్ లీజులు లాభిస్తాయి. చేసిన పనికి రావాల్సిన బిల్లులు కొంతకాలం పెండింగ్‌లో ఉంటాయి. తనఖాలో ఉన్న వస్తువులను, డాక్యుమెంట్లను విడిపించి కొన్ని మొండి బాకీలను సర్దుబాటు చేస్తారు. చిన్న చిన్న ప్రయోజనాలు కీలక సమయంలో అండగా ఉండి ఉపయోగపడతాయి. నిర్మాణకార్యక్రమాలు మెల్లగా పురోగమనంలో ఉంటాయి. సన్నిహితుడైన ఆత్మీయుడికి మధ్యవర్తిగా లేదా హామీగా ఉండవలసి రావచ్చు. అదనపు బరువుబాధ్యతలు విసుగు, చికాకు పుట్టిస్తాయి. ఉద్యోగపరంగా, వ్యాపారపరంగా ప్రశాంతత ఉండదు.

వ్యాపారరంగంలో వచ్చిన లాభాలను వ్యాపార విస్తరణకు, పాతబాకీలను తీర్చడానికి ఖర్చు పెడతారు. శారీరకంగా, మానసికంగా ఒత్తిడి అధికమయినా భరిస్తారు. వ్యాపార అభివృద్ధి నిమిత్తం ఓ దూరప్రాంత ప్రయాణం చేస్తారు, అది లాభిస్తుంది. కఠోరంగా శ్రమిస్తారు, అసాధారణమైన ఫలితాలు సాధిస్తారు. ప్రభుత్వపరంగా మీకు రావలసిన ప్రయోజనాలు, ప్రమోషన్లు, అవార్డుల కోసం అంతర్గత పోరాటం తప్పనిసరి అవుతుంది. భాగస్వాముల ఖర్చు ఉమ్మడి ఖాతాలలో వాడడం వాళ్ళ వాటాలను మించిపోతుంది. ఇలాంటివి సామరస్యంగా నాలుగుగోడల మధ్య పరిష్కరిస్తారు. యూనియన్ కార్యక్రమాలలో మీ అవసరం లేనట్లుగా ప్రవర్తించిన ఓ వర్గం ఇప్పుడు మీపై ఆధారపడుతుంది, ప్రతి పనినీ మీరే ముందుకు తీసుకువెళ్ళవలసి వస్తుంది. యూనియన్‌లో, సమాజంలో మీ ప్రతిష్ట పెరుగుతుంది. మీపై మోపబడిన నిందలు ఒట్టి బూటకాలు అని తేలిపోతుంది. ఇలాంటి కార్యక్రమాల వల్ల మీ వ్యక్తిగతపనులకు ఆటంకాలు అవుతాయి. మీ వ్యాపారాలపై ఎక్కువగా ట్యాక్స్ పడే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. ఏ పనిని అయినా పట్టుదలతో సాధించి తీరాలని ఒక స్థిరమైన నిర్ణయానికి వస్తారు. కుటుంబవ్యవహారాలలో గోప్యంగా వ్యవహరిస్తారు. మీరు సంపాదించిన ఆస్తి మీ కష్టార్జితం అని రుజువు చేసుకోవాల్సి వస్తుంది. పిల్లలు సక్రమమైన మార్గంలో పయనించడానికి జాగ్రత్తలు తీసుకుంటారు. కుటుంబ విషయాలు, వ్యక్తిగత విషయాలు పిల్లల ముందు చర్చించరు. అమ్మకాలు, కొనుగోళ్ళకు సంబంధించిన వ్యవహారాలలో ఎంత జాగ్రత్తగా ఉన్నా మాట తప్పే మనుషుల వల్ల కొంత నష్టపోతారు. నీటివనరులు ఆదుకుంటాయి. విదేశాలలో ఉన్న మీ వాళ్ళు మీకు అండగా నిలుస్తారు. ఇతరుల నిష్కారణమైన ద్వేషానికి మందు కనిపెట్టలేమని గ్రహించండి. నీచమైన అధికారులు కొందరు నిబంధనలకు తిలోదకాలు ఇచ్చి మీకు అన్యాయం చేశారని విచారించవద్దు, మీ ప్రయోజనాలు రాచబాటలో వస్తాయి. ప్రజాప్రతినిధులు, రాజకీయనాయకులు మీరు చేసిన మేలు మరచిపోతారు, డబ్బులు తీసుకుని మీ వ్యతిరేక వర్గానికి మేలు చేస్తారు. దీర్ఘకాలిక పోరాటానికి మీరు సంకల్పించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. సంవత్సర ద్వితీయార్ధంలో చికాకులు పోయి మంచికాలం వస్తుంది, మీ నెలసరి ఆదాయం రెట్టింపు అవుతుంది. మారిన సామాజిక, రాజకీయ పరిస్థితులు మీకు సంతోషాన్ని కలిగిస్తాయి. మీ సన్నిహిత వర్గానికి చట్టపరమైన చిక్కులు, ట్యాక్స్ వసూలు చేసే అధికారుల వల్ల ఇబ్బందులు మీ శత్రువర్గం వల్ల ఏర్పడతాయి. గృహంలోని వ్యక్తుల ఆరోగ్యం గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాల్సి వస్తుంది. స్పెక్యులేషన్స్, ఆన్‌లైన్ వ్యాపారాలలో నష్టపోకుండా ఉండడం మీకు పరోక్షమైన లాభం, వీటికి దూరంగా ఉంటే చాలా మంచిది. క్లిష్టమైన సమయంలో ఎవరి దగ్గరా చెప్పుకోదగిన ధనం లేనప్పుడు మీవద్ద ఉన్న ధనం గొప్ప అవకాశాన్ని కలిగిస్తుంది. పెట్టిన పెట్టుబడికి రెట్టింపు లాభం పొందుతారు. సాంకేతిక, వైద్యరంగాలలో ఉన్నవారికి కుళ్ళు రాజకీయాల వల్ల రావలసిన ప్రయోజనాలు రావు. పరిమళ గంధం, పరిమళ జువ్వాదితో పూజ చేయడం మంచిది. ప్రతిరోజూ స్నానం చేసేటప్పుడు ఒక చిటికెడు సర్పదోష నివారణ చూర్ణాన్ని బొక్కెనలో వేయండి. వ్యాపారంలో చేసే మార్పులు, ప్రచారం సత్ఫలితాలనిస్తాయి. కరస్పాండెన్సులు, సాంస్కృతిక కార్యక్రమాలు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, వైద్య, విద్య, మందుల వ్యాపారం, ఎరువుల వ్యాపారం, రియల్ ఎస్టేట్ మొదలగునవి లాభాల బాటలో నడుస్తాయి. విదేశీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్నేహం అక్కడక్కడా మిగిలి ఉందని కొన్ని సంఘటనలు రుజువు చేస్తాయి. వివాహం కానటువంటి మగపిల్లలకు వివాహం కుదురుతుంది. జీవితంలో

క్రమక్రమంగా అభివృద్ధి చోటు చేసుకుంటుంది. వ్యాపార సంబంధమైన నూతన ఒప్పందాలకు, కొన్ని మార్పులకు, శుభకార్యాలకు మీరు అంగీకరించని కారణంగా అవి వాయిదా పడతాయి. శుభకార్యాల విషయంలో ఏది మంచో, ఏది చెడో మీరే నిర్ణయించుకోండి అని కుటుంబసభ్యులకు వదిలివేస్తారు. శుభకార్యాలకు డబ్బు ఖర్చు పెట్టడం ఇతరత్ర విషయాలలో భద్రత వహించండి. ప్రత్యర్థి వర్గంలోని గ్రూపు రాజకీయాలు మీకు అనుకూలిస్తాయి. ముఖ్యమైన విషయాలలో కుటుంబసభ్యుల సహకారం మీకు సంతోషం కలిగిస్తుంది. మీ మంచి ప్రవర్తనతో ముఖ్యమైన వ్యక్తులను, ఆత్మీయులను దగ్గరకు చేర్చుకుంటారు. ఏకపక్ష నిర్ణయాలు చేయకుండా ఎదుటివారు చెప్పిన విషయాలను జాగ్రత్తగా వినండి. మీ వల్ల మంచి కార్యక్రమాలు వాయిదా పడ్డాయన్న నిందలు రాకుండా జాగ్రత్త వహించండి. మీ మిత్రువర్గానికి శత్రువులైన వారందరితో మీరు శత్రుత్వం పెంచుకోకండి, ఇది ఎప్పటికైనా మీకు లాభించే అంశంగా మారుతుంది. క్రమశిక్షణ వల్ల మరింత మేలు జరుగుతుంది. వైవాహిక జీవితంలో కొన్ని చిన్నచిన్న ఇబ్బందులు ఏర్పడవచ్చు, దీని ప్రభావం వృత్తిఉద్యోగాలపై లేకుండా జాగ్రత్త వహించండి. సమస్యలను ప్రారంభంలోనే పరిష్కరించుకోవడం మంచిది. ప్రైవేట్ పరంగా రావలసిన బిల్లులు సకాలంలో అందుతాయి. హేతుబద్ధమైన కోరికలతో దైవకార్యక్రమాలను నిర్వహిస్తారు. మీరు ఎదురుచూస్తున్న వీసా వస్తుంది. సంతానపురోగతికి ఖర్చు చేయవలసిన ధనం చేతికి అందుతుంది. ఈ విషయంలో కొంచెం గర్వం ఏర్పడుతుంది. మానసిక ప్రశాంతత ఏర్పరచుకోవడానికి శ్రమిస్తారు. అయితే మానసిక ప్రశాంతత పరిస్థితుల ప్రాబల్యం వల్ల వచ్చేదే కానీ తెచ్చిపెట్టుకుంటే వచ్చేది కాదు అని గ్రహిస్తారు. సమస్యలు పరిష్కారం కావాలి, కొంతమందికి దారి దొరకాలి. అప్పుడే మీకు ప్రశాంతత లభిస్తుంది. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి, అందరికీ నచ్చిన సంబంధం కుదురుతుంది. రచనా వ్యాసంగాలకు పేరు వస్తుంది, ఒక కొత్త కోణంలో వాటిని ఆవిష్కరిస్తారు. కోరికలు అనంతాలు, అవి తీరవు. ఒక కోరిక తీరితే మరొక కోరిక ఇలా కోరికలు చీమల బాటలాగా సాగుతూనే ఉంటాయి. ఎంత కష్టపడినా అవిశ్రాంతిగా శ్రమించినా ఒరిగేది లేదు. మంచితనం, దానధర్మాలు, మన కీర్తిప్రతిష్టలే సుస్థిరంగా నిలిచేవి. ఈ రకమైన ధోరణి నివురుగప్పిన నిప్పులాగా ఆంతర్యంలో ఉండిపోతుంది. పరిస్థితులు కలిసిరాక కలిగే నిర్వేదం కాదు పరిస్థితులు బాగానే ఉన్నాయి, ఈ వేదాంతం మనస్సు లోతులోంచి వచ్చింది. చాలా సమస్యల పరిష్కారానికి ఈ వేదాంతమే మూలం అవుతుంది. ప్రతిరోజూ నాగసింధూరం ధరించండి, దైవికం అనే పొడితో ఉదయం సాయంత్రం ధూపం వేయండి, మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. సంస్థాపరమైన విషయాలు, కుటుంబపరమైన విషయాలు గోప్యంగా ఉంచడానికి జాగ్రత్తలు తీసుకుంటారు. సంవత్సర ద్వితీయార్ధంలో అంతరంగికవ్యక్తులను దూరంగా ఉంచుతారు లేదా స్థానమార్పిడి చేస్తారు. సేవకాసిబ్బంది వల్ల, సహోద్యోగుల వల్ల నష్టాలు ఏర్పడతాయి, వాళ్ళ కారణంగా మీరు ఇతరులకు సంజాయిషీ ఇవ్వవలసిన పరిస్థితులు వస్తాయి. దూరదేశంలో ఉన్న ఆత్మీయులు అభివృద్ధి సాధిస్తారు, ఇది మీ మానసిక ఆనందానికి కారణం అవుతుంది. కొంతమంది వ్యక్తుల విషయంలో విభేదాలు వచ్చి చట్టపరంగా విడిపోయే అవకాశం ఉంది. ప్రతిపనీ ఈశ్వరేచ్ఛను అనుసరించే జరుగుతుంది. మనం మానవులం – మనం సంకల్పిస్తాం భగవంతుడు నిర్ణయిస్తాడు. నిర్ణయాధికారం మన చేతిలో లేనప్పుడు

**ఏది ధర్మమో అది మాత్రం చెబుతాడు వివేకవంతుడు.**

భగవంతుడిని అర్చించడం తప్ప మనం చేయగలిగింది ఏమీలేదు. మనస్సుని భగవంతుడి మీద లగ్నం చేయడానికి ప్రయత్నించండి.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు చాలా బాగుంది. మీకు ఇష్టమైన ఉద్యోగం వస్తుంది. మంచి సంబంధం కుదురుతుంది, కుటుంబ ప్రతిష్టను నిలబెడతారు. అవివాహితులకు వివాహకాలం, సంతానం లేనివారికి సంతానప్రాప్తి సంభవం. మీరు కోరుకున్న చోట చదువుకోవడానికి చక్కని అవకాశం లభిస్తుంది. చదువుకోసం దివారాత్రిళ్ళు శ్రమిస్తారు. గృహంలేనివారికి స్వగృహ యోగ్యత కలుగుతుంది. ఇతరుల అసూయాద్వేషాల వల్ల చిన్న చిన్న విషయాలే చిలికి చిలికి గాలివాన అవుతాయి. ఆర్థికపురోగతి బాగుంటుంది, సంపాదించిన ధనాన్ని సద్వినియోగం చేస్తారు. కళాసాహిత్యరంగాలలో ప్రతిభ పెంచుకో గలుగుతారు. ఆత్మీయులు, జీవితభాగస్వామితో అభిప్రాయభేదాలు వచ్చే అవకాశాలు ఉన్నాయి. ప్రేమవివాహాలు సఫలం కావు. కొంతమంది విషయంలో ఇష్టంలేని వ్యక్తులతో చట్టబద్ధంగా విడిపోతారు. జుట్టు సంరక్షణకి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలి. పి.హెచ్.డి. వస్తుంది, వృత్తిఉద్యోగాలపరంగా నూతన అవకాశాలు కలిసివస్తాయి. ఎక్కువ జీతం వస్తుందని ఉద్యోగానికి ఒప్పుకోరు, మీరు కోరుకున్న ప్రదేశం ఆధారంగా ఉద్యోగ నిర్ణయం చేస్తారు. లాభాలు వచ్చే అంశాలలో ధనాన్ని పొదుపు చేస్తారు లేక పెట్టుబడిగా పెడతారు. మీరు విరోధానికి ఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నారని మీపై ఆరోపణలు వస్తాయి. కొన్ని పుకార్లు తాత్కాలికంగా ఇబ్బంది పెడతాయి. మీరు చేయదలచుకున్న కార్యక్రమాలను నిర్భయంగా చేస్తారు, ఎక్కువమంది సలహాలు తీసుకోరు. జీవితభాగస్వామి అభిప్రాయాలకు మీరు విలువ ఇవ్వలేదన్న విమర్శలు వస్తాయి. మీరు ఎంత సర్దుకుపోయినా వివాదాస్పద మనిషిగానే ముద్రపడతారు. పూజాకార్యక్రమాలలో పరిమళ గంధాన్ని, పరిమళ జువ్వాదిని ఉపయోగించండి. సొంత వ్యాపారాలు కలిసివస్తాయి. మాతృవర్గం వైపు బంధువులకు సహాయం చేయవలసి వస్తుంది. కొన్ని సందర్భాలలో మీరు కష్టపడి సంపాదించిన సొమ్ముమీద మీకు అధికారం లేకుండా పోతుంది. సెంటిమెంటు వస్తువులు చేజారిపోతాయి, ఇంట్లో చిల్లరదొంగతనాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. కీలకసమయంలో సహోదరవర్గం సహాయపడతారు. అన్య భాషలు నేర్చుకోవాలన్న మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆత్మవిశ్వాసం, మనోనిబ్బరం పెరుగుతుంది. అవకాశవాదులు మళ్ళీ దరిచేరుతారు. క్రీడలపట్ల, డ్రైవింగ్ పట్ల మనస్సు మొగ్గు చూపుతుంది. నయవంచకులను మీ దరికి రాకుండా నిరోధించగలుగుతారు. ప్రతిష్టాత్మకమైన పోటీలో విజయం లభిస్తుంది. చిన్నతనంలో మిమ్మల్ని ఆదరించి, అభిమానించిన ఉపాధ్యాయులను ఆదుకుంటారు, వాళ్ళకి కావలసిన సహాయం చేస్తారు. ఉమ్మడిగా ఏ కార్యక్రమాలు చేపట్టవద్దు, ఒంటరిగా ప్రతి కార్యక్రమాన్ని నిర్వహించడం మేలు. సీటు బదిలీ కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ముఖ్యమైన డాక్యుమెంట్ల భద్రత విషయంలో జాగ్రత్త వహించండి. సంతానసంబంధమైన విషయాలు పురోగమనంలో ఉంటాయి. పిల్లలకోసం చాలా సుఖాలు చంపుకుని వాళ్ళ అభివృద్ధికి శ్రమిస్తారు. పిల్లలు మీ మాట ధిక్కరించడం జరుగుతుంది, ద్విచక్ర వాహనం కొనుగోలు విషయం ప్రధాన సమస్య అవుతుంది. వీసా లభిస్తుంది, గ్రీన్‌కార్డు లభిస్తుంది. ప్రతిరోజూ ఆరావళి కుంకుమతో లక్ష్మీచందనంతో మహాలక్ష్మీదేవిని అర్చించండి. వాహన సౌఖ్యం ఏర్పడుతుంది. వీలైనంత

విభేదాలకు దూరంగా ఉండండి. మీకు మీరుగా సమస్యలను పెద్దవిగా చేయవద్దు, మరొకరు సమస్యను పెద్దది చేస్తే అప్పటికప్పుడు ఒక నిర్ణయం తీసుకోవచ్చు. మీ ఆత్మగౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకోవడానికి ఎంతో శ్రమిస్తారు. ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. వంటి సివిల్ సర్వీసెస్‌కి ఎంపిక అవుతారు. ఐ.ఐ.టి., సి.ఎ., ఎం.బి.ఎ.లలో కూడా రాణిస్తారు. ఎంత సాధించినా గర్వపడరు, పెద్దల పట్ల గౌరవం కలిగి ఉంటారు. వివాహాది శుభకార్యాలు ఘనంగా జరగడం మీ మానసిక సంతోషానికి కారణం అవుతుంది. ఈ సంవత్సరం జీవితం మంచి మలుపు తిరుగుతుంది. ప్రతిరోజూ అష్టమూలికా తైలంతో, లక్ష్మీతామర వత్తులతో దీపారాధన చేయండి. సర్పదోష నివారణార్థం, నవగ్రహ దోష నివారణార్థం సర్పదోష నివారణ చూర్ణంతో, సర్వరక్షా చూర్ణాన్ని కలిపి స్నానమాచరించండి.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121





**మంచిపనిని ఎప్పుడూ వాయిదా వేయకూడదు.**



# 2017-2018 లో మీనరాశి ఫలితములు

| ఆదాయం - 11 | వ్యయం - 5 | రాజ - 2 | అవ - 4 |
|---|---|---|---|

**పూర్వాభాద్ర 4వ పాదము, ఉత్తరాభాద్ర 1, 2, 3, 4 పాదములు, రేవతి 1, 2, 3, 4 పాదముల యందు పుట్టినవారు "ది, దు, శ్యం, ఝా, దా, దే, చా, చి" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు మీనరాశికి చెందినవారు.**

## 2017-2018 సంవత్సర ఫలితములు

**మీనరాశి :-** ఈ రాశివారికి ఈ సంవత్సరం బాగుంది. ఆర్థిక పరిస్థితులు కుదుటపడతాయి. దీర్ఘకాలిక సమస్యలు తీరిపోతాయి. వ్యాపారసంబంధమైన విషయాలు బాగున్నాయి. వ్యాపారంలో నూతన మార్పులు, చేర్పులు కలిసివస్తాయి. ప్రజాదరణ బాగుంటుంది. ప్రచార సంబంధాలు మెరుగుపరుచుకోవడానికి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. నిరుద్యోగులకు ఉద్యోగం లభిస్తుంది. వ్యాపారంలో రొటేషన్, లాభాలు బాగుంటాయి. చాలా విషయాల్లో మీ ఆలోచనా విధానం సరైన ఫలితాలను ఇస్తుంది. సహోదరసహోదరీ వర్గానికి అండగా ఉంటారు. కారణాలు ఏమైనా వృత్తిఉద్యోగ విషయాలలో కఠినంగా ప్రవర్తిస్తారు. న్యాయబద్ధంగా మీరు వ్యవహరించే తీరు చాలామందికి నచ్చదు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న విద్యాసంస్థలు గట్టి పోటీని, విమర్శలను ఎదుర్కోవలసి వస్తుంది. సంతానపురోగతి బాగుంటుంది. విదేశాలు వెళ్ళడానికి అవకాశాలు వస్తాయి. విదేశాలలో ఉన్నవారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. కళా, సాహిత్య రంగాలలో రాణింపు ఉంటుంది. ఉన్నత ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. పార్ట్ టైం జాబులు పర్మినెంట్ అవుతాయి, ఉన్నతాధికారులు మీ శ్రమను గుర్తిస్తారు. కుటుంబ విషయాల కారణంగా కొంతమంది వాలెంటరీ రిటైర్మెంట్ తీసుకుంటారు. మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. అవార్డులు, రివార్డులు లభిస్తాయి. దొంగస్వామీజీల వల్ల నష్టపోతారు. నిర్మాణ సంబంధమైన పనులు వేగవంతం అవుతాయి. సొంత వ్యాపారాలు, భాగస్వామ్యవ్యాపారాలు బాగుంటాయి. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. విద్యా సంబంధమైన విషయాలు బాగున్నాయి, మెరిట్ మార్కులు సాధిస్తారు. దగ్గరిదాకా వచ్చి దూరంగా వెళుతున్న సంబంధాలు మానసిక వేదనకు కారణం అవుతాయి. సంవత్సర ద్వితీయార్ధంలో మంచి సంబంధం కుదురుతుంది, వివాహం ఘనంగా చేస్తారు. రాజకీయపరమైన జీవితం బాగుంటుంది, వ్యక్తిగత కుటుంబప్రతిష్ఠ పెంచుకోగలుగుతారు. స్థాయి తక్కువ మనుషులతో సంబంధబాంధవ్యాలు తెంచుకుంటారు. మానసికమైన ఉల్లాసాన్ని, మనోధైర్యాన్ని కలిగి ఉంటారు. సంతానం విషయంలో కొన్ని కఠినమైన నిర్ణయాలు అనివార్యం అవుతాయి. వృత్తిపరంగా నక్క మనస్తత్వం కలిగిన వ్యక్తుల వలన ఇబ్బందులు ఎదురవుతాయి. మహోన్నతమైన శిఖరాలను అధిరోహించాలన్న మీ కృషి పురోగతిలో ఉంటుంది. మీ వ్యక్తిగత, వ్యాపార, ఆర్థికసంబంధమైన విషయాలు ఎంత గుట్టుగా ఉంటే అంత మంచిది. ప్రేమ వివాహాలు విఫలం అవుతాయి. తాత్కాలిక వ్యామోహంలో జీవితాన్ని కష్టాలపాలు చేసుకోవద్దు. మధ్యమధ్యలో జీవితభాగస్వామితో విభేదాలు ఏర్పడతాయి.

ఈ రాశిలో జన్మించిన కొంతమంది చట్టబద్దంగా శాశ్వతంగా విడిపోయే పరిస్థితులు గోచరిస్తున్నాయి. విదేశాలలో ఉన్న మీ సన్నిహితులు మంచి పురోగతిలో ఉంటారు, అవసరమైన సమయంలో మిమ్మల్ని ఆదుకుంటారు. తోటల పెంపకం విషయంలో విశేష శ్రద్ధ వహిస్తారు. ఆధునిక వ్యవసాయం పట్ల ఆసక్తి పెంచుకుంటారు. మీ అభిరుచికి తగిన విధంగా ఒక గార్డెన్ హౌస్‌ను ఏర్పాటు చేసుకుంటారు. ఏకపక్ష నిర్ణయాలు తీసుకోరు, అందరితో చర్చించి నిర్ణయాలు తీసుకుని అమలు చేస్తారు. అందరినీ కలుపుకుని పోయే విధానాన్ని అనుసరిస్తారు. పెట్టిన పెట్టుబడి కొంతకాలం లాభాల రూపంలో ఉండిపోతుంది. వ్యక్తిగత అవసరాలకు, కుటుంబ అవసరాలకు ఖర్చులు ఎక్కువ సూచిస్తున్నాయి. మీ దైనందిన జీవితంలో వినూత్నమైన మంచి మార్పులు వస్తాయి. కార్యాలయంలో రాజకీయాలు అధికం అవుతాయి, కులసంబంధమైన రాజకీయాలు చోటు చేసుకుంటాయి. ఇతరుల సలహాలు నచ్చేవి అమలు చేయండి, అంతేగానీ ఇతరుల సలహాలు చెప్పడానికి వీలులేని భయం వాతావరణం మాత్రం కలిగించవద్దు. పట్టుదలతో పాటు, పట్టు విడుపులు కూడా మంచికి దారితీస్తాయని గ్రహించండి. నూతన కొనుగోళ్ళు లాభిస్తాయి. వివాదాస్పద అంశాలు, మధ్యవర్తి పంచనామాలు మీకు అనుకూలంగా మారతాయి. వైరివర్గం గుడ్‌విల్‌ని దెబ్బతీయగలుగుతారు. భవిష్యత్తులో వ్యాపారానికి ఉపయోగపడే ఖాళీస్థలాన్ని రహస్యంగా కొనుగోలు చేస్తారు. యోగాభ్యాసాల ద్వారా ఆరోగ్యం ఎంతో మెరుగవుతుంది. ప్రభుత్వపరంగా, ప్రైవేట్ పరంగా రావలసిన బిల్లులు ఆలస్యం అవుతాయి. ఆర్థికసంస్థల నుండి, బ్యాంకుల నుండి లోనులు తీసుకుంటారు. అతికష్టం మీద ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది. ప్రాధాన్యతలేని సీటుకు తాత్కాలికంగా బదిలీ అవుతారు. వృత్తి, ఉద్యోగాలలో ఎదురవుతున్న రాజకీయాలను రాజకీయ పలుకుబడితోనే అధిగమిస్తారు. కుటుంబ వ్యవహారాలలో కొంత అప్రశాంతమైన వాతావరణం ఏర్పడుతుంది. ఎవరినీ ఏమీ అనకుండా తలవంచుకుని వెళితే గొడవలు ఉండవు. ఇదేమిటి అని ప్రశ్నిస్తే గొడవలు, తగాదాలు చిన్నపిల్లలకు కూడా సమాధానం చెప్పలేని పరిస్థితి ఏర్పడుతుంది. కుటుంబంలో సమీప బంధువుల జోక్యం దీనికంతటికి కారణం అని మీకే అర్థమవుతుంది. తెలివిగా వ్యవహరించి బంధువులను కుటుంబ వ్యవహారాలకు దూరంగా ఉంచుతారు. పోటీ పరీక్షలలో ఘనవిజయం సాధిస్తారు, తద్వారా మంచి అవకాశాలు కలిసివస్తాయి. పెద్దల ఆరోగ్యం గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారు. గతించిపోయిన వ్యక్తి జ్ఞాపకాలు మధ్యమధ్యలో బాధిస్తాయి. పిల్లల విషయంలో దృతరాష్ట్ర ప్రేమ కనబరచకండి. అది ఇబ్బందులకు దారితీస్తుంది. విద్యారంగంలో కృషిచేసే వారికి ఆరంభంలోనే ఉద్యోగం వస్తుంది. చాలా సందర్భాలలో మీ మేధస్సు ప్రశంసించబడుతుంది. వాస్తవిక దృష్టితో ఆలోచించి తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు కలిగిన వారిని దరిచేర్చుకుంటారు. కుల, మత, వర్గాలకు అతీతంగా శక్తిసామర్థ్యాలకు పెద్ద పీట వేస్తారు. ఏరోనాటికల్ ఇంజనీర్‌గా మీ ప్రతిభ రాణిస్తుంది. ఉద్యోగపరంగా ఇతరులపై వచ్చిన నిందలు, ఆరోపణలు ఎంతవరకు వాస్తవమో తేల్చి నివేదిక ఇవ్వవలసిన బాధ్యత మీపై పడుతుంది. సున్నితమైన ఈ అంశంలో వాస్తవాల కన్నా మానవతా దృక్పథంతో ఆలోచించి నిర్ణయాలు చేస్తారు. అదనపు ఆదాయ మార్గాలను అన్వేషిస్తారు. మీ అన్వేషణ ఫలిస్తుంది. నూతన ఆదాయ మార్గాలలో శ్రమించి మంచి ఫలితాలను పొందుతారు. బాగా చదువుకుని కుటుంబప్రతిష్ఠ నిలబెట్టుకోవడానికి సంతానం ఉత్సాహంగా శ్రమిస్తారు. కొన్ని ముఖ్యమైన ఆర్థిక అవసరాలకు ఒక స్థిరాస్తి తాకట్టు పెడతారు. ప్రయాణాలు, రహస్య చర్చలు ఫలిస్తాయి. మీ ఓపిక, సహనం చాలా విజయాలకు దారితీస్తుంది. విద్యార్థినీవిద్యార్థులు సరస్వతీ తిలకాన్ని నొసటన ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి. మధ్యవర్తిత్వం చేయడం వల్ల కొన్ని చట్టపరమైన ఇబ్బందులు రావచ్చు. ఆర్థికపరమైన విషయాలలో మధ్యవర్తిత్వం చేయవద్దు.

వివాహాది శుభకార్యాల విషయంలో ఇతరులకు సహాయం చేస్తారు. బాధ్యత అంతా మీపై వేసుకుంటారు. మీ ఇంట్లో జరిగే శుభకార్యానికి బంధుమిత్రుల నుండి ఇదే రకమైన సహాయసహకారాలు లభిస్తాయి. ఒక పదవికి సంబంధించి మీ పేరు పరిశీలనలో ఉంటుంది. ఇన్సురెన్సు విషయంలో జాగ్రత్త వహించండి, ఇందుకు సంబంధించిన పత్రాలను కూడా భద్రంగా ఉంచండి. ఖర్చు పెట్టినందుకు తగిన సంతోషం, శ్రమించినందుకు తగిన ప్రతిఫలం లభిస్తాయి. వైరివర్గం గురించిన రహస్య సమాచారం మీ చేతికి అందుతుంది. వాళ్ళు తప్పుచేశారన్న కొన్ని సాక్ష్యాధారాలు మీ చేతికి లభిస్తాయి. తొందరపడకుండా సమయసందర్భాల కోసం ఎదురుచూస్తారు. ప్రేమపెళ్ళిళ్ళకు సంబంధించిన వ్యవహారాలు చికాకు కలిగిస్తాయి, ఇలాంటి వాటిని ప్రోత్సహించరు. పునర్వివాహం చేసుకోవాలనుకునే వారి ప్రయత్నాలు ఫలిస్తాయి. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండండి. కొన్ని అమ్మకాలకు సంబంధించిన విషయాలలో లాభపడతారు. ఋణాలు తీరుస్తారు, తనఖాలు విడిపిస్తారు. విలువైన వస్తువులను, ఆభరణాలను కొనుగోలు చేస్తారు. అనుకూలమైన ఫలితాలు మొత్తం మీకే దక్కవు. వ్యవహారాలకు ఏమాత్రం సంబంధించని వ్యక్తులకు వాటాలు పంచవలసి వస్తుంది. మీ ఎదుగుదల కొందరికి కంటకంగా మారుతుంది. అసూయాగ్రస్తులైన ఇటువంటి వారితో మీ సన్నిహితులు కూడా చేరడం మీకు ఆశ్చర్యం కలిగించే అంశంగా మారుతుంది. ఎంతగానో అండగా ఉంటారనుకున్న వ్యక్తులు పాండవుల మీద ప్రేమతో ఏదో కారణం చూపి భీష్మ, ద్రోణులవలే అస్త్రసన్యాసం చేస్తారు పరోక్షంగా మీ శత్రువర్గానికి బలం కలిగిస్తారు, మీ మనోధైర్యాన్ని దెబ్బతీస్తారు. చరిత్ర ఎప్పుడూ పునరావృతం అవుతూనే ఉంటుందని గ్రహిస్తారు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న సేవాసంస్థలకు ఆర్థికసహాయం లభిస్తుంది. పన్నులు వసూలు చేసే అధికారుల వల్ల ఇబ్బందులు ఎదురుకావచ్చు, జాగ్రత్త వహించండి. చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునేవారికి కాలం చాలా అనుకూలంగా ఉంది. ఆర్థిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగం చేయడమా? మానడమా? అనే ఆలోచనతో ఎటూ నిర్ణయించుకోలేరు. ఉపయోగంలేని వ్యక్తుల సాంగత్యం ఇబ్బందిగా మారుతుంది, వాళ్ళను వదిలించుకోవడం మీకు చాలా కష్టంగా మారుతుంది. మేలు చేస్తారని మీరు భావించిన వ్యక్తులు ముఖం చాటువేస్తారు, కీడు చేస్తారనుకున్న వ్యక్తులు మీకు మేలు చేస్తారు. సహోదరవర్గం సమాజంలో మంచి స్థాయిని సాధిస్తారు, మీకు అండగా నిలబడతారు. క్రయవిక్రయాలలో బంధువులు లేక మధ్యవర్తులు వాళ్ళ స్వార్థ ప్రయోజనాల కోసం మిమ్మల్ని పక్కదారి పట్టించే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. మహోన్నతమైన వ్యక్తులతో కలిసి పనిచేయాలన్న మీ ఆకాంక్ష నెరవేరుతుంది. ఆధ్యాత్మికమైన ప్రసంగాలు, స్వామీజీల ప్రవచనాలు మిమ్మల్ని ఎంతగానో ఆకర్షిస్తాయి. కొన్ని విషయాలలో గుర్తింపు లభించలేదని మీరు పడినటువంటి బాధకు ఉపశమనం కలుగుతుంది. సంతానపురోగతి బాగుంటుంది. అనంతమైన వారి కోరికలను తీర్చడానికి మిక్కిలి శ్రమించవలసి వస్తుంది. కొన్ని సందర్భాలలో సంతానం మీద ప్రేమతో ఇలా చేస్తున్నానా? లేక వారి బెదిరింపులకి భయపడి ఇలా ప్రవర్తిస్తున్నానా? అనే మీమాంశ ఏర్పడుతుంది. మోకాళ్ళకు సంబంధించిన నొప్పులు, కీళ్ళనొప్పులు, చెవి, ముక్కు, గొంతుకకు సంబంధించిన నొప్పులు మిమ్మల్ని ఇబ్బంది పెట్టే అవకాశం ఉంది. కార్యాలయ సంబంధమైన విషయాలు అభూతకల్పనలతోటి మీడియా ద్వారా వెల్లడి అవుతాయి, కార్యాలయ ప్రతిష్టకు తాత్కాలికంగా భంగం కలుగుతుంది. మీ అత్యంత సన్నిహితమైన మిత్రవర్గాన్ని కూడా ఉపేక్షించకుండా ఉద్వాసన చెప్పవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అసమర్థత, బాధ్యతారాహిత్యాన్ని మీరు సహించలేరు. స్త్రీ సంతానానికి సంబంధించిన విషయాలలో మీకు సంతోషం కలుగుతుంది, వాళ్ళ పురోగతి బాగుంటుంది. గతంలో మీ వల్ల ప్రయోజనం పొంది రాజకీయంగా ఉన్నతస్థానాలు పొందిన వ్యక్తులు తిరిగి

మీ సహాయసహకారాలు అర్థిస్తారు. నక్క మనస్తత్వం కలిగిన వ్యక్తులను మళ్ళీ ప్రోత్సహించ కూడదు అని కఠిన నిర్ణయం తీసుకుంటారు, మీ సహాయసహకారాలు అందించరు. మీ విలువ, గుడ్‌విల్ అందరికి తెలిసివస్తుంది. స్త్రీలతో ఏర్పడిన సమస్యలు సమసిపోతాయి. బంధువులతో బంధుత్వం కలుపుకోవడానికి మీరు ఇష్టపడరు. దూరప్రాంతంలో ఉన్న మీ సంతానానికి, ఆత్మీయులకు, చిన్నపాటి ఇబ్బందులు ఎదురవుతాయి. వాళ్ళకు మనోధైర్యం కలిగే చర్యలు సమర్థవంతంగా మీ కర్తవ్యాన్ని నిర్వహిస్తారు. పూజాకార్యక్రమాలలో మహాతీర్థం పొడి, సిద్ధగంధం, పరిమళ గంధాన్ని ఉపయోగించండి. ఇతరులు మీ పేరుమీద చేసే బినామీ వ్యాపారాలు కలిసివస్తాయి. సంవత్సర ద్వితీయార్ధంలో ప్రభుత్వసంబంధమైన పైరవీలు అనుకూలిస్తాయి. ఊహించనటువంటి పరిణామాలు వృత్తిఉద్యోగాలలో ఎదురైనా మీ తెలివి తేటలతో వాటిని అధిగమించగలుగుతారు. ఫిక్స్‌డ్ డిపాజిట్ల రూపంలో ధనాన్ని పొదుపు చేస్తారు. జీవితంలో ఇది మీరు అనుకున్న వ్యక్తులకు ఉపయోగపడాలని ఆశిస్తారు. కుటుంబంలో ఐకమత్యం లోపించడం వల్ల కొద్దికాలం (సుమారు నెల) మానసిక ప్రశాంతత కరువవుతుంది. తాత్కాలికంగా సర్దుకుపోయే మనస్తత్వం ఏర్పరచుకోవడం వల్ల మీరు ఆశించిన మార్పులు ఇతరులలోనూ, స్వంతవారిలోనూ వస్తాయి. ప్రతిరోజూ అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. స్పెక్యులేషన్‌కి దూరంగా ఉండడం మంచిది. తక్కువ వ్యవధిలో సాగే తాత్కాలిక వ్యాపారాలు, వాటికి సంబంధించిన అంశాలు, లాభాలు బాగుంటాయి. మీ శత్రువర్గం చేసే ఫోర్జరీ సంతకాలు, ఆకాశరామన్న ఉత్తరాల వల్ల స్వల్పమైన చిక్కులు ఏర్పడతాయి. ఆయుర్వేద వైద్యం పట్ల మక్కువ పెరుగుతుంది. బలవంతులైన ప్రత్యర్థుల బలహీనతలు మీకు దొరుకుతాయి, వాటిని ఎలా ఉపయోగించుకోవాలో అలా ఉపయోగించుకోగలుగుతారు. దూరప్రాంతంలో ఉన్న మీ వారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. కాలం సజావుగా సాగుతున్నప్పటికీ వర్గవైషమ్యాలు, రాయబారాలు విసుగు కలిగిస్తాయి. వాటిని వదిలించుకోలేని పరిస్థితి, పూర్తిగా వదలిపెట్టలేని పరిస్థితి ఏర్పడుతుంది. కోపాన్ని అదుపులో ఉంచుకోవడం వల్ల లాభపడతారు. అంతరంగికులు అని నమ్మి ఇతరుల గురించి మీరు చేసిన కొన్ని వ్యాఖ్యలు వివాదాస్పదం అవుతాయి. పునర్వివాహాలు విజయవంతం అవుతాయి. జీవితభాగస్వామి ఆరోగ్యవిషయమై శ్రద్ధ వహించాలి. భేదాభిప్రాయాలు సృష్టించి కుటుంబ అశాంతికి కారణమైనవారిని గుర్తించి కూడా ఎలాంటి చర్యా తీసుకోలేరు. అదృష్టవశాత్తు మీ శత్రువర్గానికి సన్నిహితులైన సలహాదారులు మీకు అంతరంగికులు అవుతారు. శత్రుదోష నివారణార్థం, ఆరోగ్యం కోసం సుమంగళి పసుపుతో అభిషేకం చేయండి. అసత్య ప్రచారం చేస్తున్న మీ ప్రత్యర్థులు మీకన్నా బలవంతులైనా మీరు లెక్కచేయరు. వాళ్ళ ద్వారా వచ్చిన రాయబారాలు, రాజీయత్నాలు మీరు నమ్మరు, నమ్మినట్లు నటిస్తారు. పరిస్థితులను జాగ్రత్తగా అంచనా వేసి స్వంత వ్యూహాలను అమలుచేస్తారు. రాజకీయాలలో పాల్గొనాల్సి వస్తుంది, ఇందువల్ల ఓ వర్గం దూరం అవుతారు. చిల్లరమల్లర తగాదాలను పదేపదే పరిష్కరించవలసి వస్తుంది, ఈ రకమైన వాతావరణానికి దూరంగా ఉండాలని చాలా ప్రయత్నిస్తారు. మీరు ధనం పెట్టుబడిగా పెట్టిన దివాళ తీసిన ఫైనాన్స్ కంపెనీ నుంచి కొద్దో గొప్పో ధనం వస్తుందని ఆశిస్తారు, మీ ఆశ నిరాశే అవుతుంది. వంశాభివృద్ధి కలుగుతుంది. సన్మానాలు, సత్కారాలు పొందుతారు. విందు, వినోదాల కార్యక్రమాలలో మీరు ఎప్పుడూ ఆకర్షణ బిందువుగా నిలుస్తారు. సమాజంలో వివిధ రంగాలలో పేరుప్రఖ్యాతలు ఉన్న వ్యక్తులను మీ స్వహస్తాలతో సత్కరించి మంచి పేరు తెచ్చుకుంటారు. ఎన్ని రకాలుగా సహాయం చేసినా ఎంత చెప్పినా కొంతమంది వ్యక్తులలో మార్పురాదని ఆలస్యంగా గ్రహిస్తారు. ఆర్థికపరమైన అంచనాలు కొన్ని సందర్భాలలో మీరు ఊహించిన దానికన్నా రెట్టింపు అవుతాయి. ఎంత ఆదాయం ఉన్నా కొన్ని సందర్భాలలో మీరు ఊహించిన

**ఉత్తరీయము లేకుండా గృహస్థు ఉండకూడదు. ఒకవేళ ఉంటే మర్యాద తెలియని వాడిగా గుర్తు.**

దానికన్నా ఖర్చులు రెట్టింపు అవుతాయి. కార్యాలయంలో మీతోపాటు మరికొందరికి ప్రమోషన్లు, ఆర్థికపరమైన ప్రయోజనాలు వస్తాయి, ఈ రకమైన సంఘటనలు నిర్వేదానికి, నిరాశకు దారితీస్తాయి. శ్రమించిన వాడికి, దొంగకు ఒకే విధమైన స్థానం, గౌరవం లభించడం మీరు సహించలేరు. కొన్ని కఠినమైన నిర్ణయాలు చేయడానికి సిద్ధపడతారు. అసమర్థులతో, స్వార్థపరులతో కలిసి పనిచేయలేమని నిర్ణయించుకుంటారు. సాంకేతిక పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు. ఐ.ఐ.టి వంటి వాటికి ఎంపిక అవుతారు. సంవత్సర ద్వితీయార్థంలో ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. పాత బాకీలు తీర్చివేస్తారు, మొండికి పడిన బకాయిలు చేతికి అందివస్తాయి. తల్లిదండ్రులకు, పెద్దలకు ప్రాధాన్యతనిస్తారు. వాళ్ళకు చెప్పనిదే ఏ పనీ చేయరు. స్నేహం అంటే వ్యాపారం అని మీ దృష్టిలో తేలిపోతుంది. వ్యాపారాత్మక స్నేహాలు అనవసరం అని భావిస్తారు. ప్రతి విషయంలోనూ స్వప్రయోజనాలకే ప్రాముఖ్యతను ఇవ్వాలని నిర్ణయించుకుంటారు. ఆడపిల్లలను మీరు అతి గారాబం చేయడం వల్ల కొన్ని విమర్శలు వస్తాయి, ఎవరు ఎన్ని మాట్లాడుకున్న కూతురిపట్ల మీ ప్రేమాస్పద వైఖరి మారదు. కుటుంబసభ్యుల సౌకర్యం కొరకు అధికంగా డబ్బులు ఖర్చుచేస్తారు. ఇతరుల కష్టాలలో పాలుపంచుకుంటారు. అవివాహితులైన వారికి వివాహకాలం. గొప్ప పనులు సాధించడానికి గొప్ప వ్యక్తుల సహకారం అవసరం లేదని, పట్టుదల ఉంటే చాలు అని నిరూపిస్తారు. స్వయం అభివృద్ధి ప్రణాళికలు కామధేనువు వలె మేలు చేస్తాయి. విదేశీవస్తువులు అమితంగా ఆకర్షిస్తాయి. ప్రతిరోజూ యజ్ఞభస్మాన్ని వాడండి. నూతన వ్యక్తులతో పరిచయాలు ఏర్పడతాయి. ఇతర భాషలలో కూడా ప్రావీణ్యత సాధించగలిగితే మరిన్ని మంచి ఫలితాలు అందుకోగలమని భావిస్తారు. కఠినమైన బాధ్యతలను కూడా విజయవంతంగా నిర్వహిస్తారు. కళ్ళు అలసటకు లోనుకాకుండా జాగ్రత్తలు తీసుకోండి, దృష్టిదోషం వచ్చే అవకాశం ఉంది. ముఖ్యమైన కార్యక్రమాలు ఒడిదుడుకులు లేకుండా పూర్తి చేయగలుగుతారు. ప్రతిరోజూ సర్వదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, మానసికమైన సంతోషాన్ని, ధైర్యాన్ని కలిగి ఉంటారు.

**స్త్రీలకు ప్రత్యేకం :**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. విద్య, సాంస్కృతిక, క్రీడారంగంలో విశేషంగా రాణిస్తారు. రాజకీయసంబంధమైన జీవితం బాగుంటుంది. మీ శక్తిసామర్థ్యాలకు గాను ప్రభుత్వ, ప్రైవేటుసంస్థలపరంగా గౌరవ పురస్కారాలు లభిస్తాయి. ఆర్థికపరిస్థితి బాగుంటుంది. పోటీ పరీక్షలను ప్రతిష్టాత్మకంగా తీసుకుంటారు, ఎలాగైనా విజయం సాధించాలనే మీ మొండితనం విజయవంతమైన ఫలితాలను ఇస్తుంది. ప్రేమవివాహాలకు సంబంధించి కీలకమైన నిర్ణయాలు తీసుకోవలసి వస్తుంది, దీనిపై మీ అభిప్రాయాన్ని దాటవేయడానికి సమయం ఉండదు. సాంకేతికవిద్యలో బాగా రాణిస్తారు. తల్లిదండ్రులతో పెనవేసుకున్న అనుబంధాలు ఏమవుతాయోనన్న సందిగ్ధ పరిస్థితి ఏర్పడుతుంది. కార్యాలయంలో అనుకూలమైన వాతావరణం ఉంటుంది, ప్రమోషన్ లభిస్తుంది. విదేశీయాన ప్రయత్నాలు ఫలిస్తాయి. వైవాహికజీవితంలో కొద్దిపాటి ఒడిదుడుకులు ఏర్పడవచ్చు. మీ పిల్లలపై ఇతరుల పెత్తనం మీకు నచ్చని అంశంగా మారుతుంది. ఒకప్పుడు మీరు అత్యంత గౌరవించిన వ్యక్తులే ఇప్పుడు బద్ధ శత్రువులు అవుతారు. మీ దైనందిన జీవితానికి భిన్నంగా నూతన రంగంలో ప్రవేశించాల్సి వస్తుంది. అయితే అందులోనూ రాణింపు, గౌరవం లభిస్తాయి. పిల్లలను మందలించేటప్పుడు పరుషమైన పదజాలాన్ని ఉపయోగించవద్దు. కీలకమైన విషయాలలో పెద్దల సలహాలు కోరతారు. మీకు జరుగుతున్న అన్యాయాన్ని, మీ ఆక్రోశాన్ని వెళ్ళబోసుకుంటారు. పెద్దలు అండగా నిలిచి మీ సమస్యలను పరిష్కరిస్తారు. ప్రతిరోజూ ప్రతినిత్యం లక్ష్మీచందనంతో,

ఆరావళికుంకుమతో మహాలక్ష్మీ పూజ చేయండి. బంధువుల మధ్య, స్నేహితుల మధ్య రాజీ కుదుర్చడానికి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మీరు కోరుకున్న ఉద్యోగం లభించడం మీ మానసిక సంతోషానికి కారణం అవుతుంది. సివిల్స్‌కి ఎంపిక అవుతారు, మెడిసిన్ సీటు లభిస్తుంది. మీ పేరు మీద ఇతరులు చేసే వ్యాపారాలు బాగుంటాయి. లీజులు, లైసెన్సులు, రెన్యువల్స్ మీ కుటుంబానికి లాభిస్తాయి. జాలి, దయ లేని శాడిస్టు అధికారుల వల్ల కొద్దికాలం ఇబ్బందిపడతారు. వంశపారంపర్యంగా రావలసిన ఆస్తిలో మీ వాటా మీకు దక్కుతుంది. జ్యేష్ఠ సంతానం విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం, మొండివాళ్ళను సరైన దారిలో పెట్టవలసిన కష్టతరమైన బాధ్యత మీపై పడుతుంది. ఆవేశంలో మీరు మాట్లాడిన మాటలకు నష్టపోవటం, చింతించాల్సి రావడం జరుగుతుంది. ప్రతికూలమైన గ్రహప్రభావం వల్ల జీవితభాగస్వామి లేక తత్సమానమైన వ్యక్తితో విభేదాలు తీవ్రతరం అవుతాయి (కొద్ది మంది విషయంలో). నిత్యం మహాతీర్థం పొడితో, సిద్ధగంధంతో అభిషేకాలు చేయండి. పునర్వివాహ ప్రయత్నాలు చేసుకునేవారికి ఆ ప్రయత్నాలు ఫలిస్తాయి. మీపై ఇతరుల పెత్తనాన్ని సహించరు, మీ ఆత్మాగౌరవాన్ని కాపాడుకోవడానికి అన్ని విధాలుగా ప్రయత్నిస్తారు. నూతన కోర్సులను పూర్తిచేసి అనుకూలమైన ఫలితాలను సాధిస్తారు. వ్యాపారంలో మీరు ప్రవేశపెట్టిన నూతన ప్రొడక్ట్స్ అత్యంత ప్రజాదరణకు నోచుకుంటాయి. సరదాగా అభ్యసించిన కోర్సు ఇప్పుడు మీకు అక్కరకు వస్తుంది. దూరదృష్టితో మీరు చేసే ప్రతి పనీ కలిసివస్తుంది. మీ చెడు కోరుకునే వారు మీకు అత్యంత సమీపంలోనే ఉన్నారన్న విషయాన్ని గమనించండి. అనుకూలమైన గ్రహ ప్రభావం వల్ల నూతన ప్రయోగం కలుగుతుంది. సంవత్సర ద్వితీయార్థంలో వృత్తిఉద్యోగాల పరంగా అనుకూలమైన మార్పులు వస్తాయి. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి, సంతానం లేని వారికి సంతానప్రాప్తి కలుగుతుంది. నిత్యం అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి, ఆరావళికుంకుమతో మహాలక్ష్మీదేవికి పూజ చేయండి. నవగ్రహ దోష నివారణార్థం, సర్పదోష నివారణార్థం సర్పదోష నివారణ చూర్ణంతో సర్వరక్షా చూర్ణం కలిపి స్నానమాచరించండి, మంచి ఫలితాలు సంప్రాప్తిస్తాయి. సహోదరసహోదరీ వర్గానికి అండగా నిలవాల్సి వస్తుంది. సహోదరసహోదరీ వర్గానికి అండగా నిలుస్తారు, వాళ్ళ అభివృద్ధి కోసం మీ చేతనయిన సహాయం చేస్తారు. బ్యూటీపార్లర్లు, వస్త్రవ్యాపారం చేసేవాళ్ళకి కాలం అనుకూలంగా ఉంది. తల్లిదండ్రులను, పెద్దలను గౌరవిస్తారు, కీలక సమయంలో వాళ్ళ మాట వినకపోవడంతో నష్టపోతారు. సెల్ఫ డ్రైవింగ్ నేర్చుకోవాలన్న ఆసక్తి పెరుగుతుంది, మార్షల్ ఆర్ట్స్ నేర్చుకుంటారు. పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం కోసం ప్రయత్నాలు చేస్తున్నవారికి ఉద్యోగం లభిస్తుంది. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా ఉంటాయి. స్త్రీకి స్త్రీయే శత్రువు అన్న సామెత మీ విషయంలో నిజం అవుతుంది. అన్యభాషలు నేర్చుకోవాలనే మీ తపన నెరవేరుతుంది. మాట తప్పే నయవంచకుల వల్ల నష్టపోతారు. దొంగస్వామీజీలను, దొంగ బాబాలను నమ్మి ఎక్కువగా నష్టపోతారు. ప్రతిరోజు నాగసింధూరాన్ని నొసటన ధరించండి.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

ఫోన్ : 8466932223 / 4 / 5, 9014126121



# పంచాంగము (2017-2018)

## శ్రీ హేవిళంబినామ సంవత్సరం మార్చి 28 మంగళవారం నుండి ఏప్రిల్ 26 బుధవారం వరకు, చైత్రమాసము, వసంతఋతువు, ఉత్తరాయనం

## మార్చి - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 28 | మంగళవారం | ● అమావాస్య శు.పాడ్యమి ఉ.8.26 | ఉత్తరాభాద్ర మ.1.40 | రా.12.40-2.08 | ఉ.8.34-9.22 రా.11.01-11.48 | ఉ.7.10-8.18 సా.5.45-6.40 |
| 29 | బుధవారం | విదియ రా.2.46 | రేవతి ఉ.11.38 | రా.12.39-2.07 తె.5.46 | ఉ.11.48-12.36 | |
| 30 | గురువారం | తదియ రా.11.42 | అశ్విని ఉ.9.23 | ఉ.7.13 సా.5.03-7.31 | ఉ.10.10-10.59 మ.3.02-3.50 | ఉ.7.45-8.05 సా.5.00-6.00 |
| 31 | శుక్రవారం | చవితి రా.8.40 | భరణి ఉ.7.05 కృత్తిక తె.4.52 | సా.5.59-7.26 | ఉ.8.32-9.21 మ.12.36-1.24 | ఉ.9.30-10.50 సా.4.05-5.10 |

## ఏప్రిల్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 1 | శనివారం | పంచమి సా.5.48 | రోహిణి రా.2.54 | రా.2.34-9.02 | ఉ.6.05-6.54 | ఉ.7.40-8.20 సా.5.15-6.00 |
| 2 | ఆదివారం | షష్ఠి మ.3.16 | మృగశిర రా.1.14 | ఉ.8.07-9.36 | సా.4.39-5.28 | ఉ.7.00-8.00 సా.4.00-4.20 |
| 3 | సోమవారం | సప్తమి మ1.04 | ఆరుద్ర రా.12.00 | ఉ.9.12-10.43 | మ.12.35-1.25 మ.3.01-3.50 | ఉ.7.05-7.25 సా.6.00-7.00 |
| 4 | మంగళవారం | అష్టమి ఉ.11.21 | పునర్వసు రా.11.12 | ఉ.11.36-1.09 | ఉ.8.30-9.19 రా.10.58-11.46 | ఉ.7.30-8.15 సా.5.00-5.45 |
| 5 | బుధవారం | నవమి ఉ.10.03 | పుష్యమి రా.10.52 | ఉ.7.05-8.40 | ఉ.11.45-12.34 | ఉ.6.30-7.00 సా.4.30-5.00 |

# ఏప్రిల్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 6 | గురువారం | దశమి ఉ.9.15 | ఆశ్లేష రా.11.00 | ఉ.11.45-1.21 | ఉ.8.28-9.17 మ.12.34-1.23 | ఉ.8.00-8.30 సా.6.00-6.45 |
| 7 | శుక్రవారం | ఏకాదశి ఉ.8.54 | మఖ రా.11.34 | ఉ.11.7-12.56 | ఉ.8.29-9.17 మ.12.34-1.23 | ఉ.6.00-7.10 సా.6.00-7.00 |
| 8 | శనివారం | ద్వాదశి ఉ.9.00 | పుబ్బ రా.12.33 | ఉ.7.54-9.34 | ఉ.6.00-6.49 | ఉ.10.45-11.15 సా.7.00-7.40 |
| 9 | ఆదివారం | త్రయోదశి ఉ.9.27 | ఉత్తర రా.1.54 | ఉ.8.09-9.51 | మ.12.33-1.22 మ.3.01-3.50 | ఉ.7.00-7.30 సా.6.45-7.15 |
| 10 | సోమవారం | చతుర్దశి ఉ.10.22 | హస్త రా.3.38 | ఉ.10.54-12.37 | మ.12.33-1.22 మ.3.01-3.50 | ఉ.9.10-9.40 సా.4.30-5.10 |
| 11 | మంగళవారం | ○ పౌర్ణమి ఉ.11.37 | చిత్త తె.5.42 | మ.12.19-2.03 | ఉ.8.26-9.15 రా.10.58-11.44 | ఉ.7.00-7.25 సా.5.30-6.10 |
| 12 | బుధవారం | బ.పాడ్యమి మ.1.14 | స్వాతి పూర్తి | ఉ.11.51-1.37 | ఉ.11.43-12.33 | ఉ.9.10-9.40 సా.4.30-5.15 |
| 13 | గురువారం | విదియ మ.3.10 | స్వాతి ఉ.8.06 | మ.2.19-4.06 | ఉ.10.04-10.53 మ.3.01-3.50 | ఉ.7.40-8.15 సా.6.15-7.15 |
| 14 | శుక్రవారం | తదియ సా.5.23 | విశాఖ ఉ.10.47 | మ.3.16-5.03 | ఉ.8.25-9.14 మ.12.32-1.22 | ఉ.6.35-7.10 సా.5.20-6.20 |
| 15 | శనివారం | చవితి రా.7.48 | అనూరాధ మ.1.40 | రా.7.88-9.46 | ఉ.5.55-6.45 | ఉ.7.40-7.45 మ.3.30-4.15 |
| 16 | ఆదివారం | పంచమి రా.10.15 | జ్యేష్ఠ సా.4.39 | మ.2.51-4.39 రా.1.37-3.25 | రా.4.40-5.29 | ఉ.8.10-9.20 సా.6.20-7.30 |
| 17 | సోమవారం | షష్ఠి రా.12.36 | మూల రా.7.33 | సా.6.45-7.33 | మ.12.32-1.21 మ.3.01-3.50 | ఉ.9.30-10.15 సా.5.00-6.00 |
| 18 | మంగళవారం | సప్తమి రా.2.37 | పూర్వాషాఢ రా.10.11 | ఉ.6.12-7.59 | ఉ.8.23-9.12 రా.10.57-11.43 | ఉ.10.40-11.10 సా.7.00-8.00 |

# ఏప్రిల్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 19 | బుధవారం | అష్టమి<br>తె.4.06 | ఉత్తరాషాఢ<br>రా.12.20 | ఉ.6.54-8.39<br>తె.4.36 ల | ఉ.11.41-12.31 | ఉ.9.30-10.00<br>సా.4.30-5.00 |
| 20 | గురువారం | నవమి<br>తె.4.54 | శ్రవణం<br>రా.1.51 | --- | ఉ.10.01-10.51<br>మ.3.00-3.50 | ఉ.7.40-8.10<br>సా.6.00-7.00 |
| 21 | శుక్రవారం | దశమి<br>తె.4.54 | ధనిష్ఠ<br>రా.2.36 | తె.5.59-7.38 | ఉ.8.01-9.11<br>మ.12.31-1.21 | ఉ.9.30-10.15<br>రా.7.00-8.00 |
| 22 | శనివారం | ఏకాదశి<br>తె.4.04 | శతభిష<br>రా.2.32 | ఉ.9.47-11.23 | ఉ.5.51-6.41 | ఉ.7.40-8.10<br>సా.4.30-5.10 |
| 23 | ఆదివారం | ద్వాదశి<br>రా.2.25 | పూర్వాభాద్ర<br>రా.1.40 | ఉ.8.43-10.15 | సా.4.41-5.31 | ఉ.7.00-8.00<br>సా.6.20-7.15 |
| 24 | సోమవారం | త్రయోదశి<br>రా.12.04 | ఉత్తరాభాద్ర<br>రా.12.05 | ఉ.10.38-12.08 | మ.12.30-1.20<br>మ.3.01-3.51 | ఉ.9.10-9.40<br>సా.5.30-6.00 |
| 25 | మంగళవారం | చతుర్దశి<br>రా.10.07 | రేవతి<br>రా.9.55 | ఉ.11.00-12.28 | ఉ.8.19-9.10<br>రా.10.56-11.42 | ఉ.7.00-7.20<br>సా.5.00-5.30 |
| 26 | బుధవారం | ● అమావాస్య<br>సా.5.45 | అశ్విని<br>రా.7.20 | మ.3.46-5.11 | రా.3.48-5.13<br>ఉ.11.40-12.30 | ఉ.9.15-9.40<br>సా.4.30-5.15 |
| **శ్రీ హేవిళంబినామ సంవత్సరం ఏప్రిల్ 27 గురువారం నుండి మే 25 గురువారం వరకు, వైశాఖమాసము, వసంతఋతువు, ఉత్తరాయనం** | | | | | | |
| 27 | గురువారం | శు.పాడ్యమి<br>మ.2.09 | భరణి<br>సా.4.31వ | రా.3.05-4.30 | ఉ.9.59-10.49<br>మ. 3.01-3.51 | ఉ.10.52-11.02<br>సా.4.06-5.42 |
| 28 | శుక్రవారం | విదియ<br>ఉ.10.29 | కృత్తిక<br>మ.1.39 | రా.3.51-5.16 | ఉ.8.18-9.09<br>మ.12.30-1.20 | ఉ.9.15-10.03<br>సా.5.20-6.12 |
| 29 | శనివారం | తదియ ఉ.6.55<br>చవితి రా.3.39 | రోహిణి<br>ఉ.10.57 | మ.3.59-5.26 | ఉ.5.47-6.37 | ఉ.7.32-8.12<br>సా.5.30-6.07 |
| 30 | ఆదివారం | పంచమి<br>రా.12.49 | మృగశిర<br>ఉ.8.33 | సా.4.17-5.45 | సా.4.42-5.32 | ఉ.7.17-8.12<br>సా.6.00-7.00 |

# మే - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 1 | సోమవారం | షష్ఠి<br>రా.10.31 | ఆరుద్ర ఉ.6.37<br>పునర్వసు తె.5.16 | సా.5.57-7.27 | మ.12.29-1.20<br>మ. 3.00-3.51 | ఉ.9.02-10.06<br>సా.5.23-5.45 |
| 2 | మంగళవారం | సప్తమి<br>రా.8.51 | పుష్యమి<br>తె.4.33 | మ.1.02-2.35 | ఉ.8.17-9.07<br>రా.10.56-11.41 | ఉ.10.32-11.01<br>సా.6.43-7.26 |
| 3 | బుధవారం | అష్టమి<br>రా.7.51 | ఆశ్లేష<br>తె.4.29 | సా.5.19-6.54 | ఉ.11.39-12.29 | ఉ.9.00-10.16<br>రా.7.00-7.18 |
| 4 | గురువారం | నవమి<br>రా.7.29 | మఖ<br>తె.5.02 | సా.4.46-6.24 | ఉ.9.57-10.48<br>మ.3.01-3.52 | ఉ.7.25-8.05<br>సా.6.30-7.10 |
| 5 | శుక్రవారం | దశమి<br>రా.7.44 | పుబ్బ పూర్తి | మ.1.25-3.05 | ఉ.8.16-9.07<br>మ.12.29-1.20 | ఉ.9.15-10.12<br>సా.6.40-7.00 |
| 6 | శనివారం | ఏకాదశి<br>రా.8.30 | పుబ్బ<br>ఉ.6.09 | మ.1.50-3.32 | ఉ.5.43-6.34 | ఉ.9.20-11.04<br>రా.7.00-8.02 |
| 7 | ఆదివారం | ద్వాదశి<br>రా.9.42 | ఉత్తర<br>ఉ.7.45 | సా.4.51-6.34 | సా.4.43-5.34 | ఉ.10.04-11.50<br>సా.6.40-7.10 |
| 8 | సోమవారం | త్రయోదశి<br>రా.11.16 | హస్త<br>ఉ.9.44 | సా.6.30-8.15 | మ.12.29-1.20<br>మ.3.02-3.52 | ఉ.9.02-10.06<br>సా.5.45-6.20 |
| 9 | మంగళవారం | చతుర్దశి<br>రా.1.07 | చిత్త<br>మ.12.02 | సా.6.13-8.00 | ఉ.8.15-9.06<br>రా.10.56-11.41 | ఉ.7.00-8.00<br>సా.5.35-6.10 |
| 10 | బుధవారం | ○ పౌర్ణమి<br>రా.3.12 | స్వాతి<br>మ.2.35 | ఉ.8.49-10.36 | ఉ.11.38-12.29 | -- |
| 11 | గురువారం | బ.పాడ్యమి<br>తె.5.28 | విశాఖ<br>సా.5.19 | రా.9.48-11.36 | ఉ.9.56-10.47<br>మ.3.02-3.52 | ఉ.7.20-8.10<br>సా.5.12-6.10 |
| 12 | శుక్రవారం | విదియ పూర్తి | అనూరాధ<br>రా.8.13 | రా.2.31-4.19 | ఉ.8.14-9.05<br>మ.12.29-1.20 | ఉ.9.15-10.10<br>సా.6.10-7.04 |
| 13 | శనివారం | విదియ<br>ఉ.7.51 | జ్యేష్ఠ<br>రా.11.11 | రా.11.23-12.11 | ఉ.5.41-6.32 | ఉ.9.20-11.10<br>రా.7.00-8.05 |

# మే - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 14 | ఆదివారం | తదియ ఉ.10.17 | మూల రా.2.08 | ఉ.8.10-9.58 రా.12.21-2.08 | సా.4.44-5.35 | ఉ.10.08-11.50 సా.5.45-6.10 |
| 15 | సోమవారం | చవితి మ.12.38 | పూర్వాషాఢ తె.4.57 | మ.12.52-2.39 | మ.12.29-1.20 మ.3.02-3.53 | ఉ.9.00-10.05 సా.5.45-6.20 |
| 16 | మంగళవారం | పంచమి మ.2.46 | ఉత్తరాషాఢ పూర్తి | మ.1.46-3.32 | ఉ.8.13-9.04 రా.10.56-11.41 | ఉ.7.00-8.00 సా.6.20-7.05 |
| 17 | బుధవారం | షష్ఠి సా.4.31 | ఉత్తరాషాఢ ఉ.7.26 | ఉ.11.46-1.30 | ఉ.11.38-12.29 | ఉ.9.10-9.40 రా.7.00-7.45 |
| 18 | గురువారం | సప్తమి సా.5.42 | శ్రవణం ఉ.9.26 | మ.1.40-3.21 | ఉ.9.55-10.47 మ.3.03-3.54 | ఉ.7.30-8.00 సా.5.00-6.00 |
| 19 | శుక్రవారం | అష్టమి సా.6.10 | ధనిష్ఠ సా.6.11 | సా.6.11-7.49 | ఉ.8.13-9.04 మ.12.29-1.21 | ఉ.9.15-10.12 సా.5.10-6.07 |
| 20 | శనివారం | నవమి సా.5.51 | శతభిష ఉ.11.24 | సా.5.45-7.20 | ఉ.5.39-6.30 | ఉ.9.20-11.05 రా.7.30-8.10 |
| 21 | ఆదివారం | దశమి సా.4.41 | పూర్వాభాద్ర ఉ.11.21 | రా.8.23-9.55 | సా.4.46-5.37 | ఉ.10.02-11.50 సా.5.40-6.10 |
| 22 | సోమవారం | ఏకాదశి మ.2.43 | ఉత్తరాభాద్ర ఉ.10.10 | రా.9.17-10.46 | మ.12.29-1.21 మ.3.04-3.55 | ఉ.9.00-10.02 సా.5.45-6.20 |
| 23 | మంగళవారం | ద్వాదశి మ.12.02 | రేవతి ఉ.8.24 | రా.2.26-3.53 | ఉ.8.12-9.04 రా.10.57-11.42 | ఉ.7.40-8.00 సా.6.30-8.07 |
| 24 | బుధవారం | త్రయోదశి ఉ.8.47 చతుర్దశి తె.5.07 | అశ్విని ఉ.6.02 భరణి రా.3.14 | మ.2.31-3.56 | ఉ.11.38-12.30 | ఉ.9.03-9.40 రా.7.00-7.40 |
| 25 | గురువారం | ● అమావాస్య రా.1.14 | కృత్తిక రా.12.11 | మ.1.42-3.06 | ఉ.9.55-10.47 మ.3.04-3.56 | ఉ.7.30-8.00 సా.5.10-5.50 |

# మే - 2017

## శ్రీ హేవిళంబినామ సంవత్సరం మే 26 శుక్రవారం నుండి జూన్ 24 శనివారం వరకు, జ్యేష్ఠమాసము, గ్రీష్మఋతువు, ఉత్తరాయనం

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 26 | శుక్రవారం | పాడ్యమి రా. 9.18 | రోహిణి రా. 9.05 | మ. 2.07-3.30 రా. 1.59-3.24 | ఉ. 8.12-9.04 మ. 12.30-1.21 | ఉ. 9.30-10.00 సా. 5.23-7.00 |
| 27 | శనివారం | విదియ సా. 5.31 | మృగశిర సా. 6.08 | రా. 1.37-3.02 | ఉ. 5.38-6.29 | ఉ. 10.35-11.00 సా. 5.30-7.10 |
| 28 | ఆదివారం | తదియ మ. 2.04 | ఆరుద్ర మ. 3.31 | రా. 2.28-3.56 | సా. 4.48-5.40 | ఉ. 7.25-8.00 సా. 6.10-7.10 |
| 29 | సోమవారం | చవితి ఉ. 11.07 | పునర్వసు మ. 1.25 | రా. 8.56-10.26 | మ. 12.30-1.22 మ. 3.05-3.57 | ఉ. 9.10-9.35 సా. 5.12-6.10 |
| 30 | మంగళవారం | పంచమి ఉ. 8.47 | పుష్యమి ఉ. 11.57 | రా. 12.22-1.55 | ఉ. 8.12-9.04 రా. 10.58-11.42 | ఉ. 7.30-7.50 సా. 6.00-7.10 |
| 31 | బుధవారం | షష్ఠి ఉ. 7.10 | ఆశ్లేష ఉ. 11.14 | రా. 11.14-12.51 | ఉ. 11.39-12.31 | ఉ. 9.10-10.15 సా. 6.00-6.35 |

# జూన్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 1 | గురువారం | శు.సప్తమి ఉ. 6.20 | మఖ ఉ. 11.15 | రా. 7.31-9.10 | ఉ. 9.58-10.47 మ. 3.06-3.58 | ఉ. 7.40-8.10 సా. 4.20-5.10 |
| 2 | శుక్రవారం | అష్టమి ఉ. 6.14 | పుబ్బ మ. 12.01 | రా. 7.39-9.21 | ఉ. 8.12-9.04 మ. 12.31-1.23 | ఉ. 9.30-10.02 సా. 5.06-6.10 |
| 3 | శనివారం | నవమి ఉ. 6.51 | ఉత్తర మ. 1.27 | రా. 10.32-12.16 | ఉ. 5.37-6.29 | ఉ. 8.10-8.40 సా. 5.20-6.10 |
| 4 | ఆదివారం | దశమి ఉ. 8.03 | హస్త మ. 3.25 | రా. 12.12-1.58 | సా. 4.50-5.42 | ఉ. 9.40-10.10 సా. 6.45-7.00 |

# జూన్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 5 | సోమవారం | ఏకాదశి<br>ఉ. 9. 42 | చిత్త<br>సా. 5. 48 | రా. 12. 01-1. 48 | మ. 12. 32-1. 23<br>మ. 3. 07-3. 59 | ఉ. 9. 15-9. 35<br>సా. 4. 20-5. 10 |
| 6 | మంగళవారం | ద్వాదశి<br>ఉ. 11. 42 | స్వాతి<br>రా. 8. 28 | రా. 2. 44-4. 31 | ఉ. 8. 13-9. 04<br>రా. 11. 00-11. 44 | ఉ. 9. 30-9. 55<br>సా. 5. 00-6. 10 |
| 7 | బుధవారం | త్రయోదశి<br>మ. 1. 56 | విశాఖ<br>రా. 11. 19 | రా. 3. 48-5. 36 | ఉ. 11. 40-12. 32 | ఉ. 9. 20-10. 15<br>సా. 5. 35-6. 40 |
| 8 | గురువారం | చతుర్దశి<br>సా. 4. 16 | అనూరాధ<br>రా. 2. 15 | --- | ఉ. 9. 57-10. 48<br>మ. 3. 08-3. 59 | ఉ. 10. 50-11. 15<br>సా. 5. 12-6. 10 |
| 9 | శుక్రవారం | ○ పౌర్ణమి<br>సా. 6. 39 | జ్యేష్ఠ<br>తె. 5. 12 | ఉ. 8. 32-10. 20<br>రా. 3. 24-5. 12 | ఉ. 8. 13-9. 05<br>మ. 12. 32-1. 24 | ఉ. 6. 30-7. 10<br>సా. 5. 10-5. 45 |
| 10 | శనివారం | బ. పాడ్యమి<br>రా. 9. 00 | మూల పూర్తి | మ. 2. 10-3. 57 | ఉ. 5. 38-6. 29 | ఉ. 7. 40-8. 30<br>సా. 6. 00-6. 20 |
| 11 | ఆదివారం | విదియ<br>రా. 11. 15 | మూల<br>ఉ. 8. 05 | ఉ. 6. 18-8. 05<br>సా. 6. 47-8. 34 | సా. 4. 52-5. 44 | ఉ. 8. 30-8. 50<br>సా. 6. 10-7. 00 |
| 12 | సోమవారం | తదియ<br>రా. 1. 18 | పూర్వాషాఢ<br>ఉ. 10. 51 | రా. 7. 41-9. 27 | మ. 12. 33-1. 25<br>మ. 3. 09-4. 00 | ఉ. 9. 10-9. 30<br>సా. 5. 10-5. 30 |
| 13 | మంగళవారం | చవితి<br>రా. 3. 02 | ఉత్తరాషాఢ<br>మ. 1. 22 | సా. 5. 44-7. 29 | ఉ. 8. 14-9. 06<br>రా. 11. 01-11. 45 | ఉ. 7. 30-8. 05<br>సా. 4. 50-5. 20 |
| 14 | బుధవారం | పంచమి<br>తె. 4. 22 | శ్రవణం<br>మ. 3. 33 | రా. 7. 50-9. 33 | ఉ. 11. 41-12. 33 | ఉ. 9. 03-9. 40<br>సా. 5. 35-6. 10 |
| 15 | గురువారం | షష్ఠి<br>తె. 5. 08 | ధనిష్ఠ<br>సా. 5. 15 | రా. 12. 45-2. 28 | ఉ. 9. 58-10. 58<br>మ. 3. 09-4. 01 | ఉ. 7. 40-8. 40<br>సా. 5. 20-6. 10 |
| 16 | శుక్రవారం | సప్తమి<br>తె. 5. 15 | శతభిష<br>సా. 6. 22 | రా. 12. 53-2. 31 | ఉ. 8. 14-9. 06<br>మ. 12. 34-1. 26 | ఉ. 9. 20-10. 15<br>సా. 4. 20-5. 10 |
| 17 | శనివారం | అష్టమి<br>తె. 4. 38 | పూర్వాభాద్ర<br>సా. 6. 48 | తె. 4. 16-5. 51 | ఉ. 5. 38-6. 30 | ఉ. 7. 35-8. 10<br>సా. 5. 35-6. 30 |

# జూన్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 18 | ఆదివారం | నవమి రా. 3.16 | ఉత్తరాభాద్ర సా. 6.29 | --- | సా. 4.54-5.46 | ఉ. 9.00-9.30 సా. 6.20-7.10 |
| 19 | సోమవారం | దశమి రా. 1.11 | రేవతి సా. 5.27 | తె. 5.58-7.30 | మ. 12.34-1.26 మ. 3.10-4.02 | ఉ. 6.20-7.00 సా. 5.20-6.00 |
| 20 | మంగళవారం | ఏకాదశి రా. 10.28 | అశ్విని మ. 3.44 | మ. 12.01-1.30 రా. 12.25-1.52 | ఉ. 8.15-9.07 ఉ. 11.03-11.47 | ఉ. 10.40-11.00 రా. 7.20-8.00 |
| 21 | బుధవారం | ద్వాదశి రా. 7.14 | భరణి మ. 1.27 | రా. 12.06-1.31 | ఉ. 11.43-12.35 | ఉ. 9.10-10.05 సా. 6.30-6.55 |
| 22 | గురువారం | త్రయోదశి మ. 3.38 | కృత్తిక ఉ. 10.45 | రా. 12.48-2.12 | ఉ. 9.59-10.51 మ. 3.11-4.03 | ఉ. 8.10-8.40 సా. 4.30-5.10 |
| 23 | శుక్రవారం | చతుర్దశి ఉ. 11.49 | రోహిణి ఉ. 7.49 మృగశిర తె. 4.49 | మ. 12.43-2.07 | ఉ. 8.16-9.07 మ. 12.35-1.27 | ఉ. 7.30-8.05 సా. 5.10-6.05 |
| 24 | శనివారం | ● అమావాస్య ఉ. 8.00 శు. పాడ్యమి తె. 4.21 | ఆరుద్ర రా. 1.58 | మ. 12.13-1.38 | ఉ. 5.40-6.32 | ఉ. 7.40-8.10 సా. 6.10-7.00 |
| **శ్రీ హేవిళంబినామ సంవత్సరం జూన్ 25 ఆదివారం నుండి జూలై 23 ఆదివారం వరకు, ఆషాఢమాసము, గ్రీష్మఋతువు, దక్షిణాయనం** | | | | | | |
| 25 | ఆదివారం | శు. విదియ రా. 1.01 | పునర్వసు రా. 11.26 | మ. 12.42-2.08 | సా. 4.55-5.47 | ఉ. 9.00-9.30 సా. 6.20-6.45 |
| 26 | సోమవారం | తదియ రా. 10.11 | పుష్యమి రా. 9.23 | ఉ. 6.45-8.12 | మ. 12.36-1.28 మ. 3.12-4.04 | ఉ. 9.20-10.10 సా. 5.10-6.05 |
| 27 | మంగళవారం | చవితి రా. 8.00 | ఆశ్లేష రా. 7.58 | ఉ. 9.26-10.56 | ఉ. 8.16-9.08 రా. 11.04-11.48 | ఉ. 11.00-11.20 సా. 7.00-7.20 |
| 28 | బుధవారం | పంచమి సా. 6.32 | మఖ రా. 7.17 | ఉ. 7.38-9.11 రా. 3.19-4.56 | ఉ. 11.44-12.36 | ఉ. 9.30-10.10 సా. 6.30-7.00 |

## జూన్ - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 29 | గురువారం | షష్ఠి<br>సా. 5.52 | పుబ్బ<br>రా. 7.24 | రా. 2.51-4.31 | ఉ. 10.01-10.53<br>మ. 3.12-4.04 | ఉ. 7.40-8.10<br>సా. 6.00-6.20 |
| 30 | శుక్రవారం | సప్తమి<br>సా. 6.00 | ఉత్తర<br>రా. 8.16 | తె. 5.13-6.55 | ఉ. 8.17-9.09<br>మ. 12.37-1.29 | ఉ. 9.30-10.10<br>సా. 5.20-6.02 |

## జూలై - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 1 | శనివారం | అష్టమి<br>సా. 6.51 | హస్త<br>రా. 9.51 | --- | ఉ. 5.42-6.34 | ఉ. 7.40-8.00<br>సా. 6.00-6.20 |
| 2 | ఆదివారం | నవమి<br>రా. 8.19 | చిత్త<br>రా. 12.00 | ఉ. 6.34-8.19 | సా. 4.56-5.48 | ఉ. 8.40-9.10<br>సా. 6.20-7.20 |
| 3 | సోమవారం | దశమి<br>రా. 10.15 | స్వాతి<br>రా. 2.36 | ఉ. 6.13-7.59 | మ. 12.37-1.29<br>మ. 3.13-4.05 | ఉ. 9.30-10.10<br>సా. 4.30-5.15 |
| 4 | మంగళవారం | ఏకాదశి<br>రా. 12.29 | విశాఖ<br>తె. 5.27 | ఉ. 8.52-10.39 | ఉ. 8.18-9.10<br>రా. 11.05-11.50 | ఉ. 7.10-8.20<br>సా. 5.20-6.10 |
| 5 | బుధవారం | ద్వాదశి<br>రా. 2.51 | అనూరాధ పూర్తి | ఉ. 9.57-11.44 | ఉ. 11.46-12.38 | ఉ. 6.20-7.10<br>సా. 6.00-7.10 |
| 6 | గురువారం | త్రయోదశి<br>తె. 5.14 | అనూరాధ<br>ఉ. 8.25 | మ. 2.42-4.30 | ఉ. 10.02-10.54<br>మ. 3.15-4.05 | ఉ. 7.45-8.10<br>సా. 5.20-6.05 |
| 7 | శుక్రవారం | చతుర్దశి పూర్తి | జ్యేష్ఠ<br>ఉ. 11.21 | ఉ. 9.34-11.21<br>రా. 9.18-10.05 | ఉ. 8.19-9.11<br>సా. 12.38-1.30 | ఉ. 7.00-7.20<br>సా. 6.10-7.14 |
| 8 | శనివారం | చతుర్దశి<br>ఉ. 7.31 | మూల<br>మ. 2.11 | మ. 12.23-2.11<br>రా. 12.50-2.36 | ఉ. 5.44-6.36 | ఉ. 7.05-7.20<br>సా. 5.30-6.24 |
| 9 | ఆదివారం | ○ పౌర్ణమి<br>ఉ. 9.36 | పూర్వాషాఢ<br>సా. 4.48 | రా. 12.35-3.21 | సా. 4.57-5.49 | ఉ. 8.00-8.30<br>సా. 6.40-7.10 |
| 10 | సోమవారం | బ. పాడ్యమి<br>ఉ. 11.25 | ఉత్తరాషాఢ<br>రా. 7.09 | రా. 11.30-1.14 | మ. 12.38-1.30<br>మ. 3.13-4.05 | ఉ. 9.10-10.00<br>సా. 4.10-4.20 |

# జూలై - 2017

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 11 | మంగళవారం | విదియ<br>మ. 12.56 | శ్రవణం<br>రా. 9.11 | రా. 1.27-3.10 | ఉ. 8.20-9.12<br>రా. 11.06-11.51 | ఉ. 7.20-8.10<br>సా. 5.20-6.10 |
| 12 | బుధవారం | తదియ<br>మ. 2.03 | ధనిష్ఠ<br>రా. 10.49 | --- | ఉ. 11.47-12.38 | ఉ. 9.20-10.15<br>రా. 8.20-9.10 |
| 13 | గురువారం | చవితి<br>మ. 2.44 | శతభిష<br>రా. 12.00 | ఉ. 6.23-8.03 | ఉ. 10.04-10.55<br>మ. 3.13-4.05 | ఉ. 9.20-9.45<br>సా. 5.20-6.10 |
| 14 | శుక్రవారం | పంచమి<br>మ. 2.55 | పూర్వాభాద్ర<br>రా. 12.41 | ఉ. 6.35-8.14 | ఉ. 8.21-9.12<br>మ. 12.39-1.30 | ఉ. 7.20-7.45<br>సా. 4.40-5.20 |
| 15 | శనివారం | షష్ఠి<br>మ. 2.33 | ఉత్తరాభాద్ర<br>రా12.48 | ఉ. 10.20-11.56 | ఉ. 5.46-6.38 | ఉ. 7.45-8.10<br>సా. 4.30-5.20 |
| 16 | ఆదివారం | సప్తమి<br>మ. 1.37 | రేవతి<br>రా. 12.20 | మ. 12.34-2.08 | సా. 4.57-5.48 | ఉ. 8.00-9.00<br>సా. 6.15-7.10 |
| 17 | సోమవారం | అష్టమి<br>మ. 12.05 | అశ్విని<br>రా. 11.19 | రా. 7.29-9.01 | మ. 12.39-1.30<br>మ. 3.13-4.05 | ఉ. 9.20-10.15<br>సా. 6.15-6.45 |
| 18 | మంగళవారం | నవమి<br>ఉ. 10.00 | భరణి<br>రా. 9.45 | ఉ. 8.17-9.47 | ఉ. 8.22-9.13<br>రా. 11.07-11.51 | ఉ. 10.45-11.20<br>సా. 4.45-5.20 |
| 19 | బుధవారం | దశమి ఉ.7.25<br>ఏకాదశి తె. 4.27 | కృత్తిక<br>రా. 7.45 | ఉ. 8.45-10.13 | ఉ. 11.48-12.39 | ఉ. 6.20-7.10<br>సా. 7.20-8.20 |
| 20 | గురువారం | ద్వాదశి<br>రా. 1.12 | రోహిణి<br>సా. 5.25 | ఉ. 10.12-11.38<br>రా. 10.26-11.52 | ఉ. 10.05-11.52<br>మ. 3.13-4.05 | ఉ. 7.40-8.10<br>సా. 5.20-6.20 |
| 21 | శుక్రవారం | త్రయోదశి<br>రా. 9.49 | మృగశిర<br>మ. 2.53 | రా. 10.24-11.49 | ఉ. 8.22-9.14<br>మ. 12.39-1.30 | ఉ. 9.20-10.12 |
| 22 | శనివారం | చతుర్దశి<br>సా. 6.27 | ఆరుద్ర<br>మ. 12.20 | రా. 11.06-12.33 | ఉ. 5.48-6.40 | ఉ. 7.40-8.10<br>సా. 4.40-5.20 |
| 23 | ఆదివారం | ● అమావాస్య<br>మ. 3.15 | పునర్వసు<br>ఉ. 9.53 | సా. 5.10-6.37 | సా. 4.56-5.47 | ఉ. 8.20-9.10<br>సా. 6.20-7.10 |

# జూలై - 2017

## శ్రీ హేవిళంబినామ సంవత్సరం జూలై 24 సోమవారం నుండి ఆగష్టు 21 సోమవారం వరకు, శ్రావణమాసము, వర్ష ఋతువు, దక్షిణాయనం

| తేది | వారము | తిథి | నక్షత్రము | వర్జ్యము | దుర్ముహూర్తము | శుభసమయం |
|---|---|---|---|---|---|---|
| 24 | సోమవారం | శు.పాడ్యమి<br>మ.12.22 | పుష్యమి<br>ఉ.7.44 | రా.7.37-9.06 | మ.12.39-1.30<br>మ.3.13-4.04 | ఉ.9.10-9.40<br>సా.4.20-5.10 |
| 25 | మంగళవారం | విదియ<br>ఉ.9.57 | ఆశ్లేష ఉ.6.01<br>మఖ తె.4.52 | సా.5.26-6.58 | ఉ.8.23-9.14<br>రా.11.06-11.51 | ఉ.7.20-8.10<br>సా.4.40-5.10 |
| 26 | బుధవారం | తదియ<br>ఉ.8.08 | పుబ్బ<br>తె.4.24 | మ.12.43-2.17 | ఉ.11.48-12.39 | ఉ.9.20-10.10<br>సా.6.20-6.50 |
| 27 | గురువారం | చవితి<br>ఉ.7.01 | ఉత్తర<br>తె.4.40 | ఉ.11.41-1.18 | ఉ.10.06-10.57<br>మ.3.13-4.04 | ఉ.7.40-8.40<br>సా.5.00-6.20 |
| 28 | శుక్రవారం | పంచమి<br>ఉ.6.38 | హస్త<br>తె.5.41 | మ.1.25-3.05 | ఉ.8.23-9.15<br>మ.12.39-1.30 | ఉ.9.20-10.10<br>సా.4.40-5.20 |
| 29 | శనివారం | షష్ఠి<br>ఉ.7.01 | చిత్త పూర్తి | మ.2.15-3.58 | ఉ.5.50-6.40 | ఉ.7.40-8.40<br>సా.5.00-5.20 |
| 30 | ఆదివారం | సప్తమి<br>ఉ.8.06 | చిత్త<br>ఉ.7.23 | మ.1.31-3.16 | సా.4.54-5.45 | ఉ.8.00-8.40<br>సా.6.10 -6.50 |
| 31 | సోమవారం | అష్టమి<br>ఉ.9.46 | స్వాతి<br>ఉ.9.40 | మ.3.53-5.40 | మ.12.39-1.30<br>మ.3.12-4.03 | ఉ.9.20-10.15<br>సా.4.20-5.20 |
| **ఆగష్టు - 2017** | | | | | | |
| 1 | మంగళవారం | నవమి<br>ఉ.11.53 | విశాఖ<br>మ.12.21 | సా.4.51-6.38 | ఉ.8.24-9.15<br>రా.11.06-11.51 | ఉ.7.10-8.05<br>సా.6.40-7.20 |
| 2 | బుధవారం | దశమి<br>మ.2.13 | అనూరాధ<br>మ.3.16 | రా.9.34-11.22 | ఉ.11.48-12.39 | ఉ.9.12-10.10<br>సా.4.20-5.14 |

## దిక్కులు, దిక్పాలురు వారి వివరములు

| దిక్కులు | దిక్కులను పాలించువారు | దిక్పాలకుల భార్యలు | దిక్పాలకుల వాహనములు | నివసించు పట్టణములు | ధరించు ఆయుధములు |
|---|---|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | శచీదేవి | ఏనుగు | అమరావతి | వజ్రము |
| ఆగ్నేయము | అగ్నిహోత్రుడు | స్వాహాదేవి | పొట్టేలు | తేజోవతి | శక్తి |
| దక్షిణము | యముడు | శ్యామలాదేవి | మహిషము | సంయమని | దండము |
| నైరుతి | నైరుతి | దీర్ఘాదేవి | నరుడు | కృష్ణాంగన | కుంతము |
| పడమర | వరుణుడు | కాళికాదేవి | మకరము | శ్రద్ధావతి | పాశము |
| వాయవ్యం | వాయువు | అంజనాదేవి | లేడి | గంధనవతి | ధ్వజము |
| ఉత్తరము | కుబేరుడు | చిత్రలేఖ | గుఱ్ఱము | అలకాపురి | ఖడ్గము |
| ఈశాన్యం | సాంబమూర్తి | పార్వతీదేవి | వృషభము | కైలాసము | త్రిశూలము |

## సమస్త వాస్తు దోష పరిహార తంత్రము



*దోషము పారద్రోలి – సౌఖ్యములు పొందుటకు గణపతి స్థాపన గొప్ప ప్రక్రియ – వాస్తు దోషము ఉన్న దిక్కునందు, గణపతిని స్థాపించినా ఆ దిక్పాలుడు అనుకూలుడై వాస్తు దోషమును ఇవ్వడు. ఖరీదయిన భవంతులను పగులగొట్టి నష్టపోక – గణపతి స్థాపన చేసి సౌఖ్యము పొందగలరు. అంగుష్ట ప్రమాణం కలిగిన గణపతి ప్రతిమను, వేప లేక మారేడు, గంధము, జిల్లేడు వేరులతో ఏదేని ఒక దానిని ఉపయోగించి పుష్కర దినమున ముందుగా గణపతి ప్రతిమను చెక్కించి దోషమున్నదని నిర్ణయించిన దిక్కునందుంచవలెను. ముందుగా షోడశోపచార పూజ చేయవలెను. ప్రతిదినము పటికబెల్లం – అటుకుల నివేదన పెట్టవలెను. దీనికి సమయం కేవలం ఐదు నిమిషములు మాత్రమే. అనారోగ్య నివారణకు – విద్యాభివృద్ధికి – గంధపుచెక్కతో చేసిన ప్రతిమ, ఋణబాధ నివారణ, ధనాకర్షణ, అభివృద్ధి, శత్రువులపై విజయం సమస్త అరిష్టాలు తక్షణం పోవడానికి తెల్ల జిల్లేడు వేరులో గణపతి ప్రతిమ చెక్కించి స్థాపించవలెను. ఇందువల్ల నిస్సంశయముగా వాస్తుదోష పరిహారమై యజమాని సౌఖ్యము నొందగలడు.*

[redacted]

**మేషరాశి వారికి :** ఆర్థిక ఇబ్బందులు, వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో పురోగతి, నిందలు, అవమానాలు, స్థిరాస్తుల కొనుగోలు. కుటుంబ అభివృద్ధి, చిన్న చిన్న ఆరోగ్య సమస్యలు, సన్నిహితులతో నిష్కారణ వైరాలు, ఆధ్యాత్మిక ప్రశాంతత, దొంగస్వామీజీల వల్ల నష్టపోతారు, వస్తు, ఆభరణాల విషయాలలో జాగ్రత్త వహించండి. మరిన్ని మంచి ఫలితాలు రావడానికి అఘోరపాశుపత హోమం చేయాలి.

**వృషభరాశి వారికి :** ఆర్థికంగా బాగుంటుంది. కుటుంబ కలహాలు, మధ్యవర్తి పంచాయితీలు, కోర్టు తీర్పులు మొదలైనవి ప్రధానంగా చోటు చేసుకుంటాయి. సంతాన పురోగతి బాగుంటుంది. కొన్ని స్థిరాస్తులను కొనుగోలు చేస్తారు, కొన్నింటిని అమ్ముతారు. శుభకార్యాలకు ఏవో ఒక ఆటంకాలు ఎదురొస్తాయి. బంధువులతో బంధుత్వం కలిసివచ్చినా అందుకు మీరు ఇష్టపడరు. విదేశీ సంబంధమైన విషయాలు, దూరప్రాంతంలో ఉద్యోగాలు మొదలైనవి లాభిస్తాయి. ప్రతిష్ఠాత్మకమైన విషయాలలో విజయం సాధిస్తారు. అనారోగ్యసమస్యలు ఇబ్బంది పెడతాయి. చేబదులుగా ఇచ్చిన సొమ్ము ఎంతకీ వసూలు కాదు. పూజా కార్యక్రమంలో ఏకాగ్రత కుదరదు. ఇంటివాళ్ళే ఇంటిప్రతిష్ఠను దెబ్బతీస్తారు. వ్యవసాయ సంబంధ విషయాలు సానుకూలపడతాయి. వ్యాపారాభివృద్ధికి చాలా కష్టపడాల్సి వస్తుంది. కొన్ని సందర్భాలలో వ్యాపార స్థలాన్ని మార్చుకోవలసి వస్తుంది. నిష్కారణ తగాదాలు ఎదురవుతాయి. ఈ రాశివారు 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి. ద్విచక్ర వాహనం నడుపవద్దు.

**మిథునరాశి వారికి :** ప్రజా సంబంధాలు పెరుగుతాయి. ప్రజలలో గుడ్‌విల్ పెరుగుతుంది. వ్యక్తిగా మీ ప్రాముఖ్యత మరింతగా పెరుగుతుంది. మోకాళ్ళ నొప్పులు, పాదాల నొప్పులు, వెన్నముక నొప్పులు బాధించే అవకాశం ఉంది. వృత్తి, ఉద్యోగాల పరంగా అభివృద్ధి బాగుంటుంది. ఆర్థికపరిస్థితి బాగుంటుంది. స్థిరాస్తులు, చరాస్తులు కొనుగోలు చేస్తారు. సంతానానికి ఏ లోటు రాకుండా మీరే కేంద్రబిందువుగా ఉండి అందరికి అంతో ఇంతో సహాయం చేయవలసి వుంటుంది. స్త్రీలతో సఖ్యత బాగుంటుంది, కొన్ని ప్రయోజనాలు చేకూరుతాయి. గతించిపోయిన వ్యక్తుల జ్ఞాపకార్థం కొన్ని మంచి పనులు చేస్తారు. ఈ రాశివారు 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**కర్కాటకరాశి వారికి :** కర్కాటకరాశి వారికి శని షష్ఠమంలో ఉన్న కారణం చేత ధనుస్సు, కర్కాటకరాశి వారికి షష్ఠాష్టకం ఉండడం వల్ల ప్రతి విషయంలోనూ పోరాడవలసి వస్తుంది. గుడ్‌విల్ తగ్గుతుంది, ఆరోగ్యసమస్యలు బాధిస్తాయి. విద్యా

సంబంధమైన విషయాలలో వెనుకంజ, సంతానం పురోగమనం మందగించడం, సంతానం చెప్పినమాట వినకపోవడం వంటి సంఘటనలు బాధించవచ్చు. శారీరకంగా, మానసికంగా ఒత్తిడికి లోనవుతారు. షుగర్, బి.పి. ఉన్నవారు జాగ్రత్తగా ఉండాలి. స్థిరాస్తులు అమ్ముదామని ప్రయత్నించినా గతంలో ఉన్న ధర రాదు. అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి లాగా పరిస్థితులు ఉంటాయి. విదేశీయాన ప్రయత్నాలు ఫలిస్తాయి. శుభకార్యాలు కుదురుతాయి. గ్రీన్‌కార్డ్ కోసం ప్రయత్నం చేసే వారికి ప్రయత్నాలు ఫలిస్తాయి. ఈ రాశివారు 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**సింహరాశి వారికి :** శారీరక, మానసిక ఒత్తిడి అధికమవుతుంది. వృత్తి, ఉద్యోగాల పరంగా ఇబ్బందులు ఎదురవుతాయి. ఆర్థికపరమైన విషయాలలో, వ్యాపారాలలో నష్టపోయే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. క్రమశిక్షణరహితమైన జీవితాన్ని గడపాలని భావించినా అందుకు పరిస్థితులు అనుకూలించవు. సంతానానికి సంబంధించిన విషయాలలో కొన్ని ఇబ్బందికరమైన పరిణామాలు ఏర్పడతాయి. మీ పలుకుబడిని, పరపతిని, ధనాన్ని పదేపదే ఉపయోగించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. స్త్రీలవల్ల ఇబ్బందులు కలుగుతాయి. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ నష్టపోయే అవకాశం ఉంది. తక్కువ రేటు పెట్టిన కొన్న స్థిరాస్తులను చాలా ఎక్కువ ధరలకు అమ్ముతారు. వచ్చిన ధనాన్ని లాభాలు వచ్చే వాటిల్లో పెట్టుబడిగా పెడతారు. మీ తెలివితేటలలో, వ్యవహారశైలిలో అనువంత కూడా తప్పు ఉండదు. కానీ ఫలితాలు వచ్చే సమయానికి ఏదో ఒకటి అడ్డుపడుతుంది. ధైర్యంగా పరిస్థితులను ఎదుర్కొంటారు. ఈ రాశివారు 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**కన్యారాశి వారికి :** వివాహ సంబంధమైన విషయాలలో చాలా జాగ్రత్తగా ఉండాలి. వీలైతే నూతన వాహనాల కొనుగోలు వాయిదా వెయ్యండి. ఆర్థికపరమైన విషయాలు మధ్యస్థంగా వున్నాయి. అమితమైన ఆదాయం ఉండదు, అమితమైన ఖర్చు ఉండదు. వచ్చిన డబ్బులు సరిపోతాయి, అప్పుచేయకుండా ఉండడమే గొప్ప విషయం. ఈతిబాధలు ఇబ్బందిపెడతాయి. మీకు సంబంధంలేని విషయాలలో మీ పేరు కూడా వినబడడం, వివాదాలు, తగాదాలు మొదలైనవి సంభవించవచ్చు. అర్థాష్టమ శని కారణంగా అనవసరమైన సమస్యలు వచ్చిపడతాయి. వివాదాస్పద విషయాలలోకి మీ పేరు లాగబడుతుంది. మీరు పెంచిపోషించిన వారితోనే విరోధం ఏర్పడుతుంది. పిల్లలు మనమాట వింటారా ? వినరా? అనే భయం పట్టుకుంటుంది. మోకాళ్ళ నొప్పులు, పాదాల నొప్పులు ఇబ్బందిపెడతాయి. మందులు, డాక్టర్ ఫీజులు అధికమవుతాయి. కుటుంబ ప్రతిష్ఠను దెబ్బతీస్తున్నవారిని దూరంగా పెట్టాలని చూసినా ఆచరణలో అది సాధ్యం కాదు. కొంతమంది సోమరిపోతులను, పనివైనం తెలియని

వారిని, శక్తిసామర్థ్యాలు లేనివారిని ఉద్యోగంలో ఉంచి పోషించవలసి వస్తుంది. వాళ్ళను వెళ్ళగొడితే లేనిపోని సమస్యలు, కుటుంబంలో అశాంతి. ఈ రాశివారు దోషాలు పోగొట్టుకోవడానికి, మంచి ఫలితాలు సాధించడానికి 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**తులారాశి వారికి :** వృత్తి, ఉద్యోగాలపరంగా ఒడిదుడుకులు ఉంటాయి. అండగా ఉండే మిత్రులే, బంధువులే కరువవుతారు. అన్నింటిని స్వయంశక్తి మీదనే నడిపించుకోవలసి వస్తుంది. ఆర్థికపరిస్థితి సామాన్యంగా ఉంటుంది. ఇ.యన్.టి. సమస్యలు వచ్చే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. అనువంశికంగా రావలసిన స్థిరాస్తులలో కొంతమేరకు న్యాయం జరుగుతుంది. సంతానం లేనివారికి సంతానప్రాప్తి, ఉద్యోగం లేనివారికి ఉద్యోగప్రాప్తి కలుగుతుంది. విదేశీయాన సంబంధమైన విషయాలు కలిసివస్తాయి. ఎంతకష్టపడ్డా మీ కష్టానికి తగిన ఫలితం కొంత మాత్రమే లభిస్తుంది. దీర్ఘకాలిక సమస్యలు కొన్ని పరిష్కారమవుతాయి. కొంతమంది వ్యక్తులతో కలువకూడదనే నిర్ణయం తీసుకుంటారు. కోర్టుతీర్పులు అనుకూలంగా వస్తాయి. (కొన్ని విషయాలలో) భాగస్వామ్య వ్యాపారాలలో మోసం జరిగే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. సంతానం విషయంలో కొంత చికాకు కలుగుతుంది, వారిని ఓ దారిలో పెట్ట గలుగుతారు. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు, ప్రభుత్వ ఉద్యోగం వచ్చే అవకాశం ఉంది. ఈ రాశివారు 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**వృశ్చికరాశి వారికి :** ఆర్థిక విషయాలు బాగుంటాయి. ప్రతి సమస్యకి ఏదో ఒక మార్గం దొరుకుతుంది. కుటుంబ ప్రతిష్ఠ పెరుగుతుంది. ఆర్థికపరిస్థితి ఇబ్బంది లేకుండా నడుస్తుంది. ఇతరుల నుండి మీకు రావలసిన ధనం ఎంతో కష్టంగా, ఆలస్యంగా వస్తుంది. సంతానం వల్ల కొంత మానసిక ఆనందం కలుగుతుంది, పూర్తిగా కలుగదు. వివాదాస్పదమైన ఆస్తులను తక్కువధరకు కొని ఎక్కువ ధరకు అమ్ముతారు. ఈ రకమైన సెటిల్‌మెంట్స్ మీ వృత్తిగా మారుతుంది. ఏది ఏమైనా నిలకడమైన వ్యాపారాన్ని నెలకొల్పాలని ఆలోచిస్తారు. మారుతున్నటువంటి సామాజిక పరిస్థితుల వల్ల కుల, మత, వర్గ విచక్షణల వల్ల మీరు ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ నష్టపోతారు. మీరు ఆశపెట్టుకున్న పదవికి మీ పేరు సిఫారసు చేయబడుతుంది. మనోహరమైన ప్రదేశాలను, ఆధ్యాత్మిక కేంద్రాలను, ప్రకృతి అందాలను చూసి మానసిక ఉల్లాసం కలిగి ఉంటారు. వివాహాది శుభకార్యాల విషయంలో కొంత ఇబ్బందికరమైన పరిస్థితి ఏర్పడుతుంది. పునర్వివాహ సంబంధమైన విషయాలలో సానుకూలత ఏర్పడుతుంది. స్థిరాస్తి కోసం మీరు చేసే ప్రయత్నాలు అంతగా ఫలించవు. ఈ రాశివారు మంచి ఫలితాలు సాధించడానికి 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**ధనుస్సురాశి వారికి :** జన్మరాశిలో శని సంచరిస్తున్నాడు. ఏలినాటిశని ప్రభావం ఎక్కువగా ఉంటుంది. స్థిరాస్తుల తాకట్టు విడిపించలేరు. తీసుకున్న మొత్తాలకు ఎక్కువ వడ్డీ చెల్లించాల్సి వస్తుంది. ఉద్యోగంలో చాకిరి ఎక్కువ, గుర్తింపు తక్కువ అవుతుంది. నమ్మినవాళ్ళు, దొంగస్వామీజీలు మోసం చేసే అవకాశం ఉంది. విలువైన వస్తువులు భద్రతా విషయంలో, డాక్యుమెంట్స్ భద్రతా విషయంలో జాగ్రత్తలు తీసుకోండి. తరతరాలుగా వస్తున్నటువంటి కుటుంబ గౌరవం, ప్రతిష్ఠ మీ రక్తసంబంధీకుల వల్ల దెబ్బతింటుంది. మోకాళ్ళ నొప్పులు, వెన్నముక నొప్పులు, చర్మవ్యాధులు బాధించే అవకాశం ఉంది. చాలా విషయాలపట్ల నిర్లిప్తతగా ఉంటారు, పట్టించుకోరు. మీరు శ్రద్ధ తీసుకుని మంచి విషయాలు చెప్పినా ఎవరికీ మీ సలహాలు రుచించవు, మోసగాళ్ళనే నమ్ముతారు, మోసానికి గురవుతారు. దానివల్ల పరివర్తన ఏమన్న కలిగిందా అంటే అదీ లేదు. మీకిష్టం లేని పనులు చేయడమే ధ్యేయంగా ఎంచుకుంటారు. ఈ రాశివారు 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అమృతమహాపాశుపత హోమం చేయించాలి.

**మకరరాశి వారికి :** ఈ రాశివారికి స్థిరాస్తులపరంగా కొన్ని ఇబ్బందులు వస్తాయి. దీర్ఘకాలికంగా ఉన్న రోగాలు ఎక్కువవుతాయి. సమాజంలో ప్రతిష్ఠ నిలబెట్టుకుంటారు, ప్రయోజనాలు వదులుకుంటారు. రెండూ సాధించడం సాధ్యం కాని పని అవుతుంది. కోర్టువ్యవహారాలు ముప్పుతిప్పలు పెడతాయి, చివరికి తీర్పులు మీకు అనుకూలంగా వచ్చినా పెద్దగా సంతోషం ఉండదు. పురాతన వస్తువులను కాని, ఆస్తులను కాని అమ్మవలసి వస్తుంది. వృత్తి, ఉద్యోగాలపరంగా కొంత ఇబ్బందికరమైన వాతావరణం ఏర్పడుతుంది. దానిని మీరు అధిగమించగలుగుతారు. మీ స్థాయిని, స్థానాన్ని నిలబెట్టుకోగలుగుతారు. దీర్ఘకాలికంగా అపరిష్కృతంగా ఉన్న సమస్యలు పరిష్కారమవుతాయి. సంతాన సంబంధమైన విషయాలు బాగుంటాయి. పోటీ పరీక్షలలో విజయం సాధించి, అధికారం గల ఉద్యోగాన్ని సాధిస్తారు. స్వయంశక్తితో, దైవానుగ్రహంతో పరిస్థితులు అనుకూలంగా ఉండే విధంగా చూసుకుంటారు. ఈ రాశివారు మంచి ఫలితాలు సాధించడానికి 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

**కుంభరాశి వారికి :** వృత్తి, ఉద్యోగ వ్యాపారాలు బాగుంటాయి. ప్రజాసంబంధాలు ఉన్న వ్యాపారాలు, నూనె, లోహపు, వ్యవసాయ ఉత్పత్తి వ్యాపారాలు, ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు బాగుంటాయి. శత్రువర్గం ఏమీ చేయలేరు. చెప్పుకోదగిన స్థాయిలో అభివృద్ధి సాధిస్తారు. సాంకేతికవిద్య, సివిల్ సర్వీస్‌లకు సంబంధించిన విషయాలు, పోటీపరీక్షలకు సంబంధించిన అంశాలు, వ్యాపారాభివృద్ధి ఇవన్నీ లాభిస్తాయి. ప్రజల మద్దతు లభిస్తుంది. బంధువర్గానికి, స్నేహితులకు అంతో, ఇంతో సహాయం చేస్తారు. శుభకార్యాలు మీ చేతుల మీదుగా ఘనంగా జరుగుతాయి. ఉన్నతస్థాయి ఉద్యోగానికి సంబంధించి ఏర్పడిన లిటికేషన్ తొలగిపోతుంది. సంతాన,

కుటుంబ పురోగతి బాగుంటుంది. విదేశీయానం, పాస్‌పోర్ట్, గ్రీన్‌కార్డ్‌లు లభిస్తాయి. స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. మరిన్ని మంచి ఫలితాలు సాధించడానికి 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అమృతమహాపాశుపత హోమం చేయించాలి.

**మీనరాశి వారికి :** కష్టతరమైన ప్రతిష్ఠాత్మకమైన పనులు చేపడతారు. మీ సామర్థ్యాన్ని నిరూపించుకోవడానికి ఒక మంచి అవకాశం లభిస్తుంది. మీ పనితీరు బాగుంటుంది. మంచి గుడ్‌విల్ లభిస్తుంది. ఆర్థికపరమైన లావాదేవీలను అతికష్టం మీద ఓ కొలిక్కి తీసుకువస్తారు. ఆదాయం రాకపోయినా బాధపడరు కానీ, వడ్డీలు కట్టడానికి ఇబ్బందులు పడతారు. రాజకీయ నాయకులను నమ్ముకుని పెట్టిన ఖర్చు, ధనం, శ్రమ అన్నీ గోడలకు కొట్టిన సున్నం మాదిరిగా తయారవుతాయి. రాజకీయపరమైన విషయాలలో స్వయంశక్తితో ఒక మెట్టు ఎక్కుతారు. కుటుంబ తగాదాలు, వివాదాలు, సన్నిహిత, సహోదరవర్గాల విషయాలు అన్నీ ఒకదారికి వస్తాయి. సంతాన పురోగతి బాగుంటుంది. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తలు అవసరం. లిటిగేషన్ వ్యక్తులతో ఇబ్బందులు వస్తాయి. గతంలో చేసిన పాత వ్యాపారాన్నే కొన్ని మార్పులుచేర్పులు చేసి తిరిగి ప్రారంభిస్తారు. మీ నిర్ణయాలు ఫలిస్తాయి. భూసంబంధమైన విషయాల లోనూ, రియల్ ఎస్టేట్ వ్యాపారంలోనూ సానుకూల ఫలితాలు ఉంటాయి. ఈ రాశివారు మంచి ఫలితాలు సాధించడానికి 8 శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం చేయాలి.

శంభోమహాదేవ

# సర్పగండము

జాతకంలో మంచి యోగాలు, చెడు యోగాలు సర్వసాధారణంగా వుంటాయి. వీటిల్లో ఇబ్బంది కలిగించే దోషాలలో సవ్యకాల సర్పదోషము, అపసవ్యకాల సర్పదోషము, అనంతకాల సర్పదోషము, గుళికా కాలసర్పదోషము, వాసుకి కాలసర్పదో,ము, శంఖపాల కాలసర్పదోషము, పద్మకాల సర్పదోషము, మహాపద్మ కాలసర్పదోషం, తక్షక కాలసర్పదోషం, కర్కోటక కాలసర్పదోషం, శంఖచూడ కాలసర్పదోషం, ఘటన కాలసర్పదోషం, విషధార కాలసర్పదోషం, శేషనాగ కాలసర్పదోషం మొదలగు కాలసర్పదోషాలు వున్నాయి. ఇవన్ని జీవితంలో 35 సం॥ల వరకు ప్రభావం కలిగి వుంటాయి. "సర్పదోషము" వీటి కన్నా భిన్నమైనది. దీని ప్రభావం వంశం మీద ఉంటుంది. కుటుంబంలో ఎవరినైనా బాధించగలదు, అనువంశిక ఆస్థులు రాకపోయినా ఈ దోషం మాత్రం వస్తుంది, వ్యాపార నష్టం, వైవాహిక జీవితం విఫలం, మెదడు సంబంధమైన రోగాలు, పిల్లలు కలుగకపోవడం, వివాహం కాకపోవడం, స్థిరాస్తులు అమ్ముకొని దివాళా తీయడం, సామర్థ్యం ఉన్నా గుర్తింపు రాకపోవడం, ఉద్యోగం లేకపోవడం, ఆకస్మికంగా ఉద్యోగం పోవడం, మగపిల్లలకు కూడా పెళ్ళి కాకపోవడం, రాజకీయ దరిద్రం, పిల్లలు భ్రష్టులైపోయి తల్లిదండ్రులను ఏడిపించడం, పిల్లలు ఉద్యోగం, విద్య ఏమీ లేక గాలి తిరుగుళ్ళు తిరగడం, దొంగల వల్ల నష్టం జరగడం, పేకాట, జూదం, అనారోగ్యం, అప్పులు, ఇంట్లో శుభకార్యాలు జరగకపోవడం వంటి దుష్ఫలితాలు వస్తాయి.

శుభగ్రహ దృష్టిలేని సర్పదోషం ఉన్న అట్టివారికి సర్పగండము నిశ్చయమ్మని జ్యోతిషశాస్త్ర ప్రమాణము. అనువంశికమైన ఈ శాస్త్ర పరిశోధనలో కొన్ని వేల జాతకాలు పరిశీలించి ఈ సర్పదోష ప్రభావము సంభవించుచున్నదా ? లేక పుస్తకాల వరకే ఈ యోగాలు పరిమితమా? నిజంగా జాగ్రత్తలు చెప్పవలెనా ? చెప్పి భయపెట్టుట జ్యోతిషశాస్త్ర ధర్మమా ? ఎంతవరకు చెప్పాలి ? ఏది చెప్పకూడదు ? దోషపరిహారం ఏమైనా ఉన్నదా ? ఈ సర్పదోషానికి ప్రాధాన్యత ఇవ్వాలా ? అక్కర్లేదా ? ఇవన్నీ ఆలోచన చేసి పదిమందికి తెలియజేయబోయేముందు శాస్త్ర ప్రమాణాన్ని వాస్తవ దృక్పథంతో పరిశీలించాక నిజనిజాలు నిర్ధారణ చేసుకుని సర్పదోషం గురించి ఒక స్పష్టమైన అభిప్రాయానికి రావచ్చునని భావించాను. అదే దృక్పథంతో కొన్నివేల జాతకాలు పరిశీలించాను. ఈ శాస్త్ర పరిశోధనలో నావంతు కృషి చేశాను. సర్పదోషం యొక్క ప్రాధాన్యత చాలా బలిష్టమైనదని గ్రహించాను.

1987 మే, 14వ తేదీ మధ్యాహ్నం గుంటూరు జిల్లా పేరేచర్ల గేటువద్ద ఓ 25 సం॥ల యువకుడు పాముకాటు వల్ల మరణించాడు. జాతకంలో కేతుగ్రహస్థితిని అనుసరించి ఇతర విషయాలను కూడా పరిశీలించి సర్పగండము గలదని అతని తండ్రికి తెలియజేశాను. వారిది గుంటూరు జిల్లా నర్సారావుపేట ప్రక్కన గ్రామం. వారిది వ్యవసాయ కుటుంబం. ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు వారికి కుమార్తెలిద్దరికి వివాహం జరిగింది. అందువల్ల ఆర్థికస్థితిలో

వెనుకబడి కొడుకు వివాహం చేసిన తరువాత వచ్చే కట్నంతో కొడుకుతో వ్యాపారం పెట్టించాలని అతని ఉద్దేశం. అదే విషయం నాతో కూడా చెప్పినాడు. గొప్ప కుటుంబానికి చెంది, లక్షలు వెచ్చించి గొప్పింటి సంబంధాలు ఆడపిల్లలకు తెచ్చి ఘనంగా వివాహం చేసి వారి గ్రామంలో మంచి పేరు, వంశ ప్రతిష్ఠ కలిగిన ఆ కుటుంబానికి చెందిన యువకునకు ఓ 10 లక్షలు కట్నం రావడం సమస్య కానే కాదు, అంతకంటే ఎక్కువే ఇస్తారు. వారి కుటుంబ పరిస్థితి, వంశప్రతిష్ఠ అలాంటిది. వివాహనంతరం వ్యాపారం పెడితే బాగుంటుందా ? ఏ వ్యాపారంలో కలసి వస్తుంది ? అని ఆ యువకుని తండ్రి నన్ను అడిగాడు. వివాహనంతరం పెట్టే వ్యాపారం గురించి ఇప్పుడెందుకు ? అని అన్నాను. వివాహంలో తీసుకునే కట్నానికి, వ్యాపారానికి సంబంధం ఉంది కనుక ఈ విషయం ముందే చెప్పాలని పట్టుపట్టాడయ్యా మా పూర్వీకులు. వారి పూర్వీకులు సన్నిహితులు కావడంతో జాతక పరిశీలన చేయక తప్పలేదు. జాతకంలో ఆయుర్భంగ సూచన ఉంది. (ప్రాణాపాయం). సూచనను నిశ్చయంగా చెప్పడం పద్ధతి కాదు. తల్లిదండ్రి ఆయుర్ధాయం గురించి కుమారునికి చెప్పవచ్చు కానీ కుమారుని ఆయుర్భంగం గురించి తల్లిదండ్రులకు చెప్పకూడదు, ఇది అనువంశిక ఆజ్ఞ.

మరోసారి జాతకాన్ని పరిశీలించి ఫలితం తేల్చి చెప్పాను. వివాహం ఒక సంవత్సరం వాయిదా వేయమని, వాయిదా వేయటం జరగని పని, ఈ సంవత్సరం వివాహం చేయాల్సిందే అని పట్టుబట్టాడు ఆయన. నేను ఈ సందర్భంగా ఓ ఆడపిల్ల జీవితం అన్యాయం అయిపోతుందనే ఉద్దేశ్యంతో మీ కుమారునికి సర్పగండం ఉంది. వివాహం వాయిదా వేయడం అవసరమని చెప్పాను. జ్యోతిషశాస్త్రం గురించి కొంత తేలికగా మాట్లాడాడు. పొలాలలో తిరిగే మాలాంటి వాళ్ళకు పాముగండం కాక పిల్లిగండం ఉంటుందా ? పాములు కనబడుతుంటాయి, పోతుంటాయి. దీనికోసం పెళ్ళి వాయిదా వేయడం ఏమిటి ? వ్యాపారం గురించి అడిగితే పాముగండం, పిల్లిగండం, పెళ్ళి వాయిదా వేయమంటారేంటి? నేను అడిగింది ఏమిటి ? మీరు చెప్పేది ఏమిటి ? ఇలా చాలాసేపు వాదించాడు. చివరకు నేను కొన్ని ప్రత్యామ్నాయ శాంతి సూత్రాలు చెప్పాను. ఏ శాంతులైనా పెళ్ళి అయిన తర్వాతే చేస్తాను, ఇప్పుడు కాదు, కట్నం వస్తే గాని ఏ పని మొదలుకాదు. వివాహానికి ముందు ఎలాంటి శాంతి క్రతువులు చేయనని కఠినంగా చెప్పేశాడు. 3 నెలల తిరగకముందే వివాహం నిశ్చయం చేశాడు. 12 లక్షల కట్నం, రెండు ఎకరాల మాగాణి భూమి, దుగ్గిరాల మండలంలో సంబంధం కుదిరింది. నేను పెళ్ళి ప్రయత్నాలు వాయిదా వేయమన్నానని అసంతృప్తితో లేక కోపంతో కావచ్చు నాకు శుభలేఖ పంపలేదు. మా బాబాయి గారితో చెప్పలేదు. నేను కూడా ఆ విషయం ప్రస్తావించలేదు. శుభలేఖలో ముహూర్తం పరిశీలించాను. ఆ పెళ్ళి ముహూర్తం దుర్ముహూర్తంలో పెట్టారు (దుర్ముహూర్తం కేతుగ్రహ ఆధీన కాలం) మనం నిమిత్తమాత్రులం. ఈశ్వరేచ్ఛను అనుసరించి ఫలితాలు అమలులోకి వస్తాయి.

"ఫలానే గ్రహచారేణ సూచయన్తి మనీషిణః" అను సూక్తిని మననం చేసుకున్నాను. పెళ్ళి పనులు ముమ్మరంగా సాగుతున్నాయి. గుంటూరు వెళ్ళి పెళ్ళి కుమారుడికి సూట్లు తీసుకుందామని మోటారు సైకిల్‌పైన గుంటూరు వస్తున్నారు తండ్రికొడుకులు. విధి

బలీయమైనది. నిజం నిష్ఠురమైనది. కర్కషే, ధర్మ శృంఖలాబద్ధములైన యముని హస్తములు స్వేచ్ఛలేనివి. కాలం తీరిన వారిని ఉపేక్షించుటకు యముడు స్వతంత్రుడు కాదు. కాలభ్రమణమును అనుసరించి తన ధర్మమును నెరవేర్చాలి. మంత్ర–తంత్ర–ఉపహార–ఉపసంహార–హోమ–భక్తి పూజలకు అతీతుడు యముడు. నిశ్చయమైన నియమములు కలిగినవాడు కనుక యముడు.

మోటారు బైక్‌మీద వస్తూ పేరెచర్ల వద్ద రైలు గేటు వేయడంతో ఆగిపోయారు. రైలు దూరం నుండి వస్తుంది. మోటారు సైకిలు నడుపుతున్న స్థానంలో తండ్రిగారు ఉన్నారు. వెనుకసీటు మీద కుమారుడు కూర్చున్నాడు. రైలు ఇంజను శబ్ధం పెద్దగా వినిపిస్తుంది. కొన్ని నిమిషాల్లో రైలు వెళ్ళిపోవడం, గేటు తెరవడం జరుగబోతుంది. ఇంతలో పైన ఆకాశమార్గంలో ఓ గ్రద్ధ పామును వదిలిందో లేక పాము గ్రద్ద నోటినుండి విడిపించుకుందో మొత్తానికి పాము జారి మోటారు సైకిలు వెనుక భాగంలో కూర్చున్న యువకునిపైన పడింది. పెద్దగా కేకపెట్టి ఆ యువకుడు పామును విదిల్చికొట్టాడు. పాము మోటారు సైకిలుకి కాస్త దూరంలో పడడం జరిగింది. జనం గుమిగూడారు. ఏ జరిగిందో పూర్తిగా అర్థంకాని పరిస్థితి. ఏమైనదని అడిగితే ఆ యువకుడు దూరంగా తాను విదిల్చికొట్టిన పామును చేత్తో చూపించాడు. అప్పటికే ఆపస్మాకరం వచ్చింది. జనం అతడిని వదిలి పామును చూసి తల ఒక దిక్కుకు తప్పుకున్నారు. కొందరు ధైర్యం చేసి పాము దగ్గరకు వెళ్ళే ప్రయత్నం చేస్తున్నారు. ఇతనికి నోరు నుండి నురుగు వస్తుంది. ఇంతలో పైనుండి గ్రద్ధ రావడం పామును నోట పెట్టుకుని వెళ్ళిపోవడం జరిగింది. అప్పుడర్థమైంది జనానికి పాము పైనుండి పడిందని, పాముకోసం గ్రద్ధ చక్కర్లు కొడుతుందని క్యాబిన్‌లోని రైల్వే వాళ్ళు చెప్పారు. అటుగా వస్తున్నా రాళ్ళు రవాణా చేసే ట్రాక్టరులో అతడిని హాస్పటల్‌కి తరలించారు.

హుటాహుటిన హాస్పిటల్ ప్రాంగణంలోనికి చేతుల మీద తీసుకుని వెళ్తున్నప్పుడే తల వాల్చేశాడని చెప్పి అతని తండ్రి దీనాతి దీనంగా విలపించాడు.

యే భూతానా మధిపతయో విసిఖాసః కపర్దినః

యే అన్నేషు వివిధ్యంతి – పాత్రేషుపిబతో జనాన్

సర్వభూతముల యందు కరుణ కలిగిన సర్వేశ్వరుడు ఆ యువకుని ఆత్మకు శాంతి చేకూర్చును గాక, మరుజన్మలో దీర్ఘాయువంతుని చేయుగాక, మరల జన్మపొందిన వానికి సర్ప, వృశ్చిక, తస్కర, విషజ్వరాది భయము లేకుండుగాక, జన్మజన్మాంతర పర్యంతము పరమేశ్వరుడు వానిని కాపాడుగాక.

మీ జాతకంలో సర్పదోషం గురించి తెలుసుకోవాలంటే రాహు–కేతువుల పుస్తక రచయిత, శ్రీకాళహస్తీశ్వర స్వామి వారి ఆస్థాన సిద్ధాంతి ములుగు రామలింగేశ్వర వరప్రసాదు సిద్ధాంతి గారిని అడిగి తెలుసుకోండి.



## నామ నక్షత్రం, రాశి, గణం, జంతువులు, నాడి తెలుసుకొను చక్రము

| పేరు-మొదటి అక్షరం | నక్షత్రం-రాశులు | గణ | జంతువు | నాడి |
|---|---|---|---|---|
| చూ చే చో లా | అశ్విని 4పా మేషం | దేవ | గుర్రం | ఆది |
| లీ లూ లే లో | భరణి 4పా మేషం | మను | ఏనుగు | మధ్య |
| ఆ ఈ ఊ ఏ | కృత్తిక 1పా మేషం<br>2-3-4 పా వృషభం | రాక్షస | మేక | అంత్య |
| ఓ వా వీ వూ | రోహిణి 4పా వృషభం | మను | పాము | అంత్య |
| వే వో కా కీ | మృగశిర 1-2 పా వృషభం<br>3-4 పా మిథునం | దేవ | పాము | మధ్య |
| కూ ఖం జ్ఞ ఛ | ఆరుద్ర 4పా మిథునం | మను | కుక్క | ఆది |
| కే కో హా హి | పునర్వసు 3పా మిథునం<br>4 పా కర్కాటకం | దేవ | పిల్లి | ఆది |
| హూ హే హో డా | పుష్యమి 4పా కర్కాటకం | దేవ | మేక | మధ్య |
| డీ డూ డే డో | ఆశ్లేష 4పా కర్కాటకం | రాక్షస | పిల్లి | అంత్య |
| మా మీ మూ మే | మఘ 4పా సింహం | రాక్షస | ఎలుక | అంత్య |
| మూ టా టీ టూ | పుబ్బ 4పా సింహం | మనుష్య | ఎలుక | మధ్య |
| టే టో పా పి | ఉత్తర 1పా సింహం<br>2-3-4పా కన్య | మను | గోవు | ఆది |
| పూ ష ణ త | హస్త 4పా కన్య | దేవ | దున్న | ఆది |
| పే పో రా రి | చిత్త 1-2పా కన్య<br>3-4పా తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ రె రో తా | స్వాతి 4పా తుల | దేవ | దున్న | అంత్య |
| తీ తూ తే తో | విశాఖ 3పా తుల<br>4పా వృశ్చికం | రాక్షస | పులి | అంత్య |
| నా నీ నూ నె | అనూరాధ 4పా వృశ్చికం | దేవ | లేడి | మధ్య |
| నో యా యీ యు | జ్యేష్ఠ 4పా వృశ్చికం | రాక్షస | లేడి | ఆది |
| యే యో భా భీ | మూల 4పా ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| భూ ధ ప ఢా | పూర్వాషాఢ 4పా ధనుస్సు | మను | కోతి | మధ్య |
| భే భో జా జి | ఉత్తరాషాఢ 1 పా ధనుస్సు<br>2-3-4 పా మకరం | మను | ముంగిస | అంత్య |

| | | | | |
|---|---|---|---|---|
| జూ జె జో జ | అభిజిత్ మకరం | – | – | – |
| ఖ ఖు ఖి ఖో | శ్రవణం 4పా మకరం | దేవ | కోతి | అంత్య |
| గా గీ గూ గే | ధనిష్ఠ 1–2 పా మకర 3–4 పా కుంభం | రాక్షస | గు(రం | ఆది |
| గో సా సీ సూ | శతభిషం 4పా కుంభం | రాక్షస | గు(రం | ఆది |
| సే సో దా ది | పూ॥భాద్ర 1–2–3 పా కుంభం 4వ పా మీనం | మను | సింహ | ఆది |
| దూ ఇ ఝ థా | ఉ॥భాద్ర–4పా మీనం | మను | సింహ | ఆది |
| దే దో చా చి | రేవతి 4పా మీనం | దేవ | ఏనుగు | అంత్య |

## శ్రీ హేవిళంబి నామ సంవత్సరం కర్తరీ నిర్ణయం

రవి భరణీ నక్షత్రము 3వ పాదము నందు ప్రవేశించు కాలమే డొల్లుకర్తరీ ప్రారంభము. దీనిని చిన్న కర్తరీ అని కూడా అందురు. రవి కృత్తికా నక్షత్రము నందు ప్రవేశించు కాలమే నిజకర్తరీ ప్రారంభము. రవి రోహిణీ నక్షత్రము 2వ పాదము నందు ప్రవేశించు కాలమే కర్తరీ త్యాగము. ఈ కర్తరీ దినములలో వాస్తు సంబంధమైన నూతన గృహారంభ, గృహాప్రవేశాదులు చేయరాదు. అందుకే కొందరు పెద్దలు దీనిని వాస్తు కర్తరీ అని కూడా అంటారు.

### కర్తరీలో చేయదగిన కార్యములు

సూర్యుడు భరణి, కృత్తిక నక్షత్రము నందుండు కాలమున వివాహము, యజ్ఞము, మండపాదులు కట్టుట మున్నగునవి చేయవచ్చును.

### కర్తరీలో చేయదగని కార్యములు

కర్తరీలో చెట్లు నరుకుట, నారతీయుట, విత్తనములు వేయుట, భూమిని తవ్వుట, కొత్త గ్రామములు కట్టుట, క్షౌరము చేసుకొనుట, తోటలు వేయుట, చెరువులు, బావులు తవ్వుట, కొత్తబండినెక్కుట ఇట్టి కార్యములు చేయరాదు.

మే 4వ తారీకు నుండీ వాస్తు కర్తరీ ప్రారంభం, మే 28 వాస్తు కర్తరీ త్యాగము.

మే 11వ తారీకు నుండీ అగ్ని కర్తరీ ప్రారంభమయి, మే 24తో అగ్ని కర్తరీ త్యాగము.

### మౌఢ్యమి నిర్ణయం

ఏ గ్రహమైనా నిర్దిష్టమైన కోణంలో సూర్యునకు సమీపముగా వస్తే శక్తిహీనమవుతుంది. ఇది అన్ని గ్రహాలకు ఉంటుంది. కానీ జ్యోతిష్యశాస్త్రము మాత్రము శుభగ్రహాలైన గురువు, శుక్రునకు శక్తిహీనత మాత్రమే దోషముగా పరిగణిస్తుంది. చంద్రుని శక్తిహీనతే ప్రతి మాసంలోనూ వచ్చే అమావాస్య, గురుగ్రహ శక్తిహీనతను గురుమౌఢ్యమి గానూ, శుక్రగ్రహ శక్తిహీనతను శుక్రమౌఢ్యమిగానూ పరిగణిస్తారు. దీనినే వ్యవహారిక భాషలో మౌఢమి అంటారు. మౌఢ్యమి శుభకార్యాలకు అనువుకాదు.

మార్చి 20, 2017 నుండీ ప్రారంభమై మార్చి 30, 2017 త్యాగము అగును. నవంబర్ 28వ తేది 2017 శుక్రమూఢ్యమి ప్రారంభమై, ఫిబ్రవరి 10, 2018 శుక్రమౌఢ్యమి త్యాగము. 12.10.2017 నుండి 9.11.2017 వరకు గురుమౌఢ్యమి.

## గ్రహణాలు

శ్రీ హేవిళంబినామ సంవత్సరం 7.8.2017 శ్రావణ శు. పౌర్ణమి సోమవారం శ్రవణా నక్షత్రయుక్త మేషలగ్నమందు కేతుగ్రస్త పాక్షిక చంద్ర గ్రహణము రా. 10.52-12.48 వ మధ్యకాలం 1.56 ల పాటు గ్రహణకాలము ఉండును.

ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ నక్షత్రములవారు మకర, కుంభ, సింహరాశివారు గ్రహణశాంతి చేసుకొనవలెను.

31.1.2018 పుష్యమి, ఆశ్లేష యుక్త కర్కాటక లగ్నమందు రాహుగ్రస్త సంపూర్ణ చంద్రగ్రహణము సంభవించును. సా. 5-18 మొదలు 8.41 వరకు కన్పించును. పుష్యమి - ఆశ్లేష - మఘ నక్షత్రములవారు, కర్కాటక, మకర రాశులవారు గ్రహణ శాంతిని ఆచరించవలెను.

## కావేరీనది పుష్కర నిర్ణయము

శ్రీ హేవిళంబినామ సంవత్సర భాద్రపద బ. సప్తమి మంగళవారం అనగా 12.09.2017 ఉ. 7.22 ని. లకు కృత్తికా నక్షత్రయుక్త కన్యా లగ్నమునందు గురుడు తులారాశిలోకి ప్రవేశించుటవలన 12.09.2017 నుండి 23.09.2017 తేదీ వరకు 12 రోజులు కావేరీనది పుష్కరములు.

### నాగసింధూరము

పవిత్రత, ఆకర్షణ ఉట్టిపడే కుంకుమ ! స్త్రీలు, పురుషులు, బాలబాలికలు ధరించదగినది. శుభప్రదమైనది. విజయప్రాప్తి కలుగుతుంది. నొసటన ఈ సింధూరం ధరించుట వల్ల శరీరములలోని అయస్కాంత శక్తి బయటకు పోదు. జ్ఞాపకశక్తి వర్చస్సు కలుగుతుంది. భృకుటి మధ్య కంఠభాగమున ధరించవలెను. ఎదుటి వ్యక్తి దృష్టి మన మీద పడినప్పుడు దృష్టిదోషము తగిలిందంటారు. శాస్త్రీయంగా మన పెద్దలు చెప్పిన నరదృష్టికి స్పష్టమైన సమాధానములు లభిస్తాయి. కంటికి శక్తి ఉంది. అలాంటి కళ్ళు కలిగిన మానవుడు కోపం వచ్చినప్పుడు కళ్ళు ఎరుపెక్కుతాయి. సంతోషం కూడా కళ్ళలోనే కనిపిస్తుంది. దుఃఖం కూడా కళ్ళలోనే కనిపిస్తుంది. మానవుని మానసిక భావాలకు కళ్ళు ప్రత్యేక రూపాలు, నిదర్శనాలు. కొందరి కళ్ళు లేక కొందరి దృష్టి ఒకవ్యక్తి మీద పడినపుడు వాళ్ళ భావాలు అసూయపరమైనవా, అభిమానపూర్వకమైనవా అనే విషయం అలా ఉంచండి, కంటి దృష్టికి గల శక్తి చూపబడిన వ్యక్తి ముఖముపై ప్రభావము చూపుతుంది. కంటికి ఈ శక్తి ఉంది. కనుక ఇలాంటి దృష్టి నుండి నాగసింధూరం ధరించిన వారికి రక్షణ కలుగుతుంది, ముఖములో ఆకర్షణ కలుగుతుంది. ఈ నాగసింధూరంలో మారేడు సమిధలు, గంధపు చెక్కలు, సంజీవి చెక్క, భజపత్రి రతపురుషాకు, రుద్రజడ, దేవదారు సమిధలు, మారేడు కాయలు, ఎండు కొబ్బరి, చంద్ర సమిధలు మొదలగునవి ఆవు నెయ్యితో హోమం చేసి నాగసింధూరంలో మిశ్రమం చేస్తారు.

శంభో మహాదేవ

# 2017 - 2018 - దినచర్య

## నైమిత్తిక తిథుల కర్తవ్యం

## మార్చి - 2017

28. ఉగాది సాంప్రదాయ కార్యక్రమాలు, నూనె వ్యవహార ప్రారంభం, ప్రజా సంబంధాలు వృద్ధి చేసుకొనుటకు మంచిరోజు.
29. ప్రభుత్వ అధికారులు, రాజకీయ నాయకుల ద్వారా మీ పనులు సాధించుకోవడానికి అనుకూలమైన రోజు.
30. ఇతరులకు వస్తు, వాహనాలు ఇవ్వవద్దు. చేతికి వచ్చిన కాగితాలను తీసుకోవడానికి వాయిదా వేయవద్దు.
31. గణపతి పూజ చేసి అమ్మవారి ఆలయం దర్శించండి.

## ఏప్రిల్- 2017

1. తామర పువ్వులతో, జాజి పువ్వులతో అమ్మవారి పూజకు విశేషమైన రోజు.
2. అరుణాచలేశ్వరుని తలచి, కాసేపు ధ్యానించి శ్రీ భగవాన్ రమణ మహర్షి గురించి ఏదైనా పుస్తక పఠనం చేయుట మంచిది.
3. మారు బేరాలకు సంబంధించిన లావాదేవీలకు ఉత్తమము.
4. శ్రీరామనవమి పవిత్రదినమున విశేష పూజ జరిపిన శీఘ్ర కళ్యాణం, సంతాన ప్రాప్తి కలుగును. రామాయణ గ్రంథ పారాయణం ప్రారంభించుటకు మంచిరోజు
5. సుందరకాండ పారాయణమునకు మంచిరోజు.
6. గురుచరిత్ర పారాయణమునకు అనువైన రోజు.
7. విష్ణు పూజకు అనుకూలమైన రోజు.
8. శనీశ్వరుని తైలాభిషేకానికి అనుకూలమైన రోజు.
9. ఆదిత్య హృదయం పఠించి ఆరోగ్య సమస్యలకు, ఔషధములను సేవించుటకు అనుకూలమైన రోజు.
10. శుభకార్యాలకు సంబంధించిన చర్చలకు అనుకూలమైన రోజు.
11. సన్నిహితుల ఆంతర్యం తెలుసుకొని జాగ్రత్తపడడానికి అనుకూలమైన రోజు.
12. లక్ష్మీదేవికి పూజచేసి, క్షీరాన్ని, నెయ్యి నైవేద్యం పెట్టినా అష్టలక్ష్మీ వైభవం వరించును.
13. సెంటిమెంట్‌కు వ్యతిరేకంగా ఏ పనీ చేయవద్దు. పెండింగ్‌లో ఉన్న కరస్పాండెన్స్ పై దృష్టి సారించడానికి అనుకూలమైన రోజు.
14. విఘ్నేశ్వరుని పూజించి, సుబ్రమణ్యేశ్వరస్వామికి పాలాభిషేకం చేయుటకు మంచిరోజు.

15. ప్రయాణాలు, రాయబారాలు, రహస్య సంప్రదింపులకు అనుకూలమైన రోజు.
16. కార్యక్రమాలు మీ నిర్ణయాలు సక్రమంగా అమలు జరిగే విధంగా జాగ్రత్త వహించడానికి అనుకూలమైన రోజు.
17. ప్రయోజనం చేకూర్చే దూరప్రాంత లేఖలకు మంచిరోజు.
18. రాజకీయ నాయకులను కలవడానికి, ముఖ్యమైన చర్చలు జరుపడానికి మంచిరోజు.
19. ప్రకటనలకు, ప్రచారానికి, భూవిక్రయ విషయములకు అనుకూలమైన రోజు.
20. శ్రీ వెంకటేశ్వర స్వామివారికి అభిషేకంనకు అనుకూలమైన రోజు.
21. శుభకార్యాలకు సంబంధించిన ప్రయత్నాలకు అనుకూలమైన రోజు.
22. ఏకాదశిరోజున అమ్మవారిని సేవించినచో స్త్రీలు సంపూర్ణ ముత్తయిదువ భాగ్యాన్ని పొందుటకు అనుకూలమైన రోజు.
23. వివాదాస్పద అంశాలకు దూరంగా ఉండుటకు మంచిరోజు.
24. ప్రజాసమీకరణకు, ఉద్యమములకు వాస్తవాలు తెలియజేసే ప్రజా చైతన్యం కలిగించడానికి మంచిరోజు.
25. వైరివర్గాన్ని ఎండగట్టడానికి పరోక్షంగా మీ పరపతిని పెంచుకోవడానికి అనుకూలమైన రోజు.
26. అష్టమూలికా గుగ్గిలంతో ఇంటిలో ధూపం వేయండి.
28. సుబ్రమణ్యేశ్వర స్వామిని పూజించుటకు శ్రేష్ఠమైన రోజు.
28. ఈ అక్షయ తృతీయరోజున మంచినీరు, గొడుగు, దానం, శ్రీకృష్ణునకు చందన లేపనం చేయుటవలన విష్ణుసాహిత్యం పొందుటకు అనుకూలమైన రోజు. ఈ రోజు చేసిన జప, దానం, ధ్యానం అక్షయం అగునని శాస్త్ర వచనం.
29. ప్రభుత్వ సంబంధిత వ్యవహారాలలో న్యాయ పోరాటానికి, నోటీసులు పంపించడానికి మంచిరోజు.
30. శ్రీ ఆదిశంకరులను పూజించుట, పచనము కాని పదార్థములు అనగా జీడిపప్పు, ఎండుద్రాక్ష, పండ్లు నివేదనం చేసి ప్రసాదం పంచుట వలన అఖండ ఐశ్వర్యం లభించును.

## మే - 2017

1. వైరివర్గాన్ని ఎండగట్టడానికి పరోక్షంగా మీ పరపతిని పెంచుకోవడానికి అనుకూలమైన రోజు.
2. ఇష్టం లేని పనులు, ఒత్తిడివల్ల చేయవలసిన పనులు చేయడానికి అనుకూలమైన రోజు.
3. ఉన్నతస్థాయి వ్యక్తుల తోటి ఏ విషయం చర్చించకుండా ఉండటం మంచిది.
4. ఆగిపోయిన కార్యక్రమాలు తిరిగి ప్రారంభించడానికి, పేలాలు, ధాన్యపు గింజలను పక్షులకు ఆహారంగా వేయడానికి మంచిరోజు.
5. అన్య భాషలు నేర్చుకోవడానికి, మీ పట్టు నిలబెట్టుకోవడానికి మాట నెగ్గించుకోవడానికి అనుకూలమైన రోజు.
6. విష్ణు దర్శనమునకు అసలైన రోజు.

7. ప్రయాణాలు వాయిదా వేయవలసిన రోజు, మీ అభిప్రాయాలు స్పష్టంగా కఠినంగా తెలియజేయటం ద్వారా ప్రయోజనం.
8. శివసన్నిధిలో నది పరీవాహక ప్రాంతాలలో స్నానమాచరించిన పిశాచి బాధలు, ఉన్మాదం నశించుటకు అనుకూలమైన రోజు.
9. నృసింహస్వామి దర్శనం చేసి చాలాకాలము పెండింగ్‌లో ఉన్న పనులను పునః ప్రారంభించవలసిన రోజు.
10. వైశాఖ పూర్ణిమకి విష్ణుపూజ తప్పనిసరిగా చేసి జలకుంచ దానాలు ఇచ్చిన విశిష్ఠ ఫలము. మహా వాగ్గేయకారుడు నంద కాంస్యంగా జన్మించిన అన్నమాచార్యుల కీర్తనలు ఆలపించుటకు అనుకూలమైన రోజు.
11. కొనుగోలు తనఖా విడిపించుట, రాయబారానికి అనుకూలమైన రోజు
12. వస్త్ర వ్యాపారులకు సంబంధించి విషయ వ్యవహారాలకు అనుకూలమైన రోజు.
13. ప్రభుత్వ సంబంధిత విషయాలకు, నిర్ణయాలకు మంచిరోజు.
14. గరికతో విఘ్నేశ్వరుని అర్చించుట మంచిది.
15. ఉన్నతస్థాయి వ్యక్తులతోటి ఏ విషయం చర్చించకుండా ఉండటం మంచిది.
16. రహస్య సమాచారం సేకరించడానికి అనుకూలమైన రోజు.
17. పురోగతిలో ఉన్న కార్యక్రమాలను క్షుణ్ణంగా పరిశీలించుటకు అనుకూలమైన రోజు.
18. వాస్తవాలు పరిశీలించి న్యాయం చేయడానికి, ధర్మపోరాటానికి అనుకూలమైన రోజు.
19. లెక్కలలో అంతుపట్టని విషయముల కీలకమును కనుగొనుటకు మంచిరోజు.
20. వ్యాపారపరమైన విషయాలలో నూతన అంశాలను ప్రవేశపెట్టడానికి అనుకూలమైన రోజు.
21. ఆంజనేయస్వామి వారికి వడమాల ధరింపజేసిన, పనులు సానుకూలమగుటకు అనుకూలమైన రోజు.
22. మీకు ఇష్టం లేని వ్యక్తులను వదిలించుకోవడానికి అనుకూలమైన రోజు.
23. ఏకాభిప్రాయం కొరకు బంధువులతో చర్చించడానికి అనుకూలమైన రోజు.
24. సన్నిహిత వర్గానికి సందేశాలు పంపించడానికి అనుకూలమైన రోజు.
25. మీరు చేస్తున్న పనులకు సహాయకారులు కొందరిని తెచ్చుకొనుటకు అనుకూలమైన రోజు.
26. ఆరావళి కుంకుమతో శ్రీమహాలక్ష్మీదేవిని పూజించుటకు మంచిరోజు.
27. నిర్మాణసంబంధమైన విషయాలలో నాణ్యతను పరిశీలించుటకు అనుకూలమైన రోజు.
28. పండ్లతోటలకు సంబంధించిన విషయ వ్యాపారాలపై నిర్ణయాలు చేయడానికి అనుకూలమైన రోజు.
29. వ్యాపారపరమైన విషయాలలో నూతన అంశాలను ప్రవేశపెట్టడానికి అనుకూలమైన రోజు.
30. వీలునామాలు వంటివి రాయించుకోవడానికి అనుకూలమైన రోజు.

31. వాస్తవాలు గ్రహించడానికి అనుకూలమైన రోజు. ఆగ్రహం అదుపుచేసుకోవలసిన రోజు.

## జూన్ - 2017

1. శ్రీసుబ్రహ్మణ్యస్వామి క్షేత్ర దర్శనం మంచిది.
2. విదేశీవ్యవహారాలు, పాస్‌పోర్ట్, వీసాలకు మంచిరోజు.
3. హనుమాన్‌చాలీసా పఠించడానికి, రామకోటి లిఖించడానికి అనుకూలమైన రోజు.
4. భూమి, గృహ సంబంధమైన లావాదేవీలకు సంబంధించిన విషయాలను వాయిదా వేయవలసిన రోజు.
5. ఈ ఏకాదశి ఉపవాసము సంవత్సర ఏకాదశి ఉపవాసమునకు సమానము.
6. ప్రపంచశాంతికై దైవాన్ని ప్రార్థించవలసిన రోజు.
7. త్రయోదశి రోజున తైలాభిషేకం అనుకూలమైనది.
8. మరిచిపోయిన విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొను ప్రయత్నము చేసిన మేలు జరుగుతుంది.
9. వ్యవసాయపనిముట్లు, పశువులకు సంబంధమైన వస్తువులను పూజించి వ్యవసాయ పనులను ప్రారంభించుటకు అనుకూలమైన రోజు.
10. పార్వతీదేవి బంగారు ప్రతిమను పూజించిన అన్యోన్య దాంపత్యము ప్రాప్తించు రోజు.
11. సుదూరప్రాంత విషయ వ్యవహారాలను పరిశీలించుటకు అనుకూలమైన రోజు.
12. ఆత్మీయులకు రహస్యంగా ధన సహాయం చేయడానికి అనుకూలమైన రోజు.
13. వినాయకునికి ఉండ్రాళ్ళు, దోసపండు నివేదన చేయుటకు విశిష్టమైన రోజు.
14. మీ అసమ్మతిని తెలియజేయడానికి అనుకూలమైన రోజు.
15. మీ ఆంతర్యం బయటపడకుండా ఇతరుల నుంచి సమాచారము సేకరించడానికి అనుకూలమైన రోజు.
16. లక్ష్మీనృసింహకరావలంబ స్తోత్రం పఠించి ఇష్టంలేని వాటిని అమ్మకానికి పెట్టుటకు మంచి రోజు.
17. వివాదాస్పద అంశాలకు దూరంగా ఉండుటకు, అనుకూలమైన అంశాలకు దగ్గరగా ఉండుటకు మంచి రోజు.
18. వృత్తి, వ్యాపారాలలో ఇష్టం లేని పద్ధతులకు స్వస్తి చెప్పడానికి అనుకూలమైన రోజు.
19. డిక్లరేషన్స్ ప్రకటనలు ఇవ్వడానికి అనుకూలమైన రోజు.
20. సన్నిహిత వర్గానికి సందేశాలు పంపడానికి అనుకూలమైన రోజు.
21. జలసంబంధిత విషయాలకు, వ్యాపారాలకు అనుకూలమైన రోజు.
22. తైలాభిషేకమునకు అనుకూలమైన రోజు.
23. ధనప్రాప్తికి, అధికార సౌఖ్యానికి .... ఫలితాల కొరకు నూతన ప్రయత్నాలు చేయుటకు మంచిరోజు.

24. ఏ విధమైన కార్యక్రమాలకు అనుకూలమైన రోజు కాదు.
25. విద్యాసంబంధిత విషయాలు పరిశీలించుటకు అనుకూలమైన రోజు.
26. సర్వమత ఐక్యతను పాటించి దేశ సమైక్యతను ప్రకటించవలసిన రోజు.
27. సంకష్టహర చతుర్దశి రోజున శ్రీ విఘ్నేశ్వర పూజ చేయుట మంచిది.
28. శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారికి పాలాభిషేకం చేయుట మంచిది.
29. మినహాయింపులు, రాయితీలు అభ్యర్థించడానికి అనుకూలమైన రోజు.
30. నూతన వ్యాపార ఆర్థిక లావాదేవీలకు అనుకూలమైన రోజు.

## జూలై - 2017

1. ఏ విధమైన కార్యక్రమాలకు అనుకూలమైన రోజు కాదు.
2. మీ అసంతృప్తిని తెలియజేయటానికి అనుకూలమైన రోజు.
3. రుద్రాభిషేకంనకు అనుకూలమైన రోజు.
4. నిర్మాణ సంబంధమైన విషయాలలో నాణ్యతను పరిశీలించుటకు అనుకూలమైన రోజు. ఈ ఏకాదశిన వ్రతం మాచరించినా రోగ విముక్తులవుతారు.
5. సన్నిహిత వర్గానికి సందేశాలు పంపటానికి అనుకూలమైన రోజు.
6. ఈ త్రయోదశి దినమున నూకలు భూతదయకు పక్షులకు చల్లుట వలన విశేషమైన లాభం పొందుటకు అనుకూలమైన రోజు.
7. వ్యాపారపరమైన విషయాలలో నూతన అంశాలను ప్రవేశపెట్టడానికి అనుకూలమైన రోజు.
8. శనికి తైలాభిషేకమునకు, రావి చెట్టును స్పృశించి ధ్యానము చేయుటకు మంచిది.
9. ఈ గురుపూర్ణిమ రోజున యోగులను, గురువులను పూజించినా జ్ఞానవృద్ధి.
10. పొదాస్పద విషయాలను సామరస్యంగా పరిష్కరించుకోవడానికి చేసే ప్రయత్నములకు అనుకూలమైన రోజు.
11. నష్టం కలిగిస్తున్న వ్యక్తుల స్నేహాలను వదులుకొనుటకు మంచిరోజు.
12. విఘ్నేశ్వరుని గరికతో అర్చించవలసిన రోజు.
13. పుణ్యక్షేత్రాలను దర్శించవలసిన రోజు.
14. వివాహపరంగా, శుభకార్యములపరంగా సలహాలు తగు సూచనలు, పెద్దల నుండి గ్రహించుటకు మంచిరోజు.
15. ఆభరణాలు, అలంకరణాలకు సంబంధించిన వస్తువులు కొనుగోలు చేయుటకు మంచిరోజు.
16. మీ దైనందిన కార్యక్రమాలను గోప్యంగా ఉంచుట మంచిది.
17. వస్త్ర వ్యాపారులకు సంబంధించి విషయ వ్యవహారాలకు అనుకూలమైన రోజు.
18. వివాదాస్పద విషయాలకు దూరంగా ఉండుట మంచిది.
19. కొత్త వస్తువుల కొనుగోలుకు మంచిరోజు.
20. ద్వాదశిరోజున ఉయ్యాలలో శ్రీకృష్ణుని దర్శించిన సహస్ర అపరాధములు క్షమించబడును.

20. ఈ శివకామ చతుర్దశి రోజున శివాభిషేకం, రుద్రహోమం చేయించుటకు అనుకూలమైన రోజు.
21. త్రయోదశి రోజున శివాభిషేకం అనుకూలమైనది.
22. ప్రదోషకాల శివార్చన, చండీశ్వర ప్రదక్షిణలకు అనుకూలమైన రోజు.
23. దూర ప్రయాణములు, బంధువులను కలుసుకొనుటకు, విదేశీ ప్రయాణములను వాయిదా వేయుటకు మంచిరోజు.
24. నరఘోషకు, నరదృష్టికి దైవికం పొడితో ఇంటిలో ధూపం వేయుటకు అనుకూలమైన రోజు.
25. పురోగతిలో ఉన్న కార్యక్రమాలను క్షుణ్ణంగా సమీక్షించుటకు, పరిశీలించుటకు అనుకూలమైన రోజు.
26. సామూహిక సమాజ కార్యక్రమాలు, ప్రజలకు ఉపయోగపడే కార్యక్రమాలు చేయుటకు మంచిరోజు.
27. సుబ్రమణ్యేశ్వరస్వామికి, శివపార్వతుల పూజకు అనుకూలమైన రోజు.
28. గరుత్మంతుని జననం, ఆఖ్యానమును చదివిన నాగదోషములు, సర్పదోషములు తొలగును.
29. విఘ్నేశ్వరుని పూజించి, సుబ్రమణ్యేశ్వరస్వామికి పాలాభిషేకం చేయుటకు మంచిరోజు.
30. శుభకార్యాలకు సంబంధించిన చర్చలకు అనుకూలమైన రోజు.
31. మీ అసంతృప్తిని తెలియజేయటానికి అనుకూలమైన రోజు.

## ఆగష్టు-2017

1. పూలమొక్కలను నాటుటకు మంచిరోజు.
2. లెక్కలలో అంతుబట్టని విషయము కీలకమును కనుగొనుటకు మంచిరోజు.
3. ఏకాదశి రోజున నిష్ఠతో ఉపవాసం చేసినా, వేయిగోవుల దానం ఇచ్చిన ఫలితంను పొందవచ్చు.
4. మహాలక్ష్మీ హోమం చేయుటకు సంప్రదాయ ప్రకారము వరలక్ష్మీ వ్రతంను ఆచరించవలసిన రోజు, నిరుద్యోగులు ఉద్యోగ అవకాశమునకు ప్రయత్నించవలసిన రోజు.
5. శని తైలాభిషేకంనకు విశేషమయిన రోజు.
6. జరుగుతున్న అన్యాయమును సంబంధిత అధికారులకు తెలియజేయడానికి మంచిరోజు.
7. గ్రహణ నియమాలు పాటించుట మంచిది.
8. గృహములో దైవికం పొడితో ధూపం వేయుట మంచిది.
9. ధనప్రాప్తికి, అధికార సౌఖ్యానికి అత్యున్నత ఫలితాల కొరకు, నూతన ప్రయత్నాలు చేయుటకు మంచిరోజు.
10. సమాజానికి మేలు కలుగజేసే కార్యక్రమాలను ప్రారంభించడానికి మంచిరోజు.

11. వినాయకునికి పాలాభిషేకం మరియు గరికతో పూజించుట మంచిది.
12. విదేశీ కరెన్సీల యొక్క వ్యవహార చర్చలు చేయుటకు మంచిరోజు.
13. మీ కష్టాలను, ఇబ్బందులను ఏకరువు పెట్టి, మీ ప్రయోజనాలు రక్షించుకోవడానికి అనుకూలమైన రోజు.
14. శ్రీకృష్ణ పరమాత్మ ఆవిర్భవించిన దివ్య తిథి. బాలకృష్ణ రూపం నుండి అన్ని కృష్ణరూపాలకు ఆరాధనలివ్వాలి. ఇది శక్తి ప్రధాన పర్వదినం. రాత్రివేళ అమ్మవారి స్తోత్రాలను పఠించడం ఉపదేశమయిన మంత్రాలను జపించడం మహిమాన్వితము.
15. దేశప్రగతికి దైవప్రార్థన చేయవలసిన రోజు. స్వాతంత్ర్య సమరయోధులకు నివాళులు అర్పించవలసిన రోజు.
16. ఓర్పు, మౌనం, సహనం అవసరమని గ్రహించి వాటిని ఆచరణలో పెట్టడానికి అనుకూలమైన రోజు.
17. అన్నదమ్ములతో భాగస్వామ్య విభేదాలను పరిష్కరించుకొనుటకు, విషయాలు స్పష్టంగా మాట్లాడుకొనుటకు మంచిరోజు.
18. ఉపయుక్తమైన చిన్నచిన్న వస్తువులను కొనుటకు, చిన్నచిన్న వస్తువులను బహుమతిగా నిచ్చుటకు మంచిరోజు.
19. శనికి తైలాభిషేకమునకు మంచిరోజు.
20. స్త్రీలకు సంబంధించిన విషయములలో, స్పెక్యులేషన్ విషయాల్లో తగిన జాగ్రత్తలు తీసుకోండి. ముఖ్య కార్యాల ప్రారంభం వద్దు.
21. పోలాల అమావాస్యరోజు ఎద్దుని నందిగా భావించి పూజించిన వ్యవసాయ పరంగా అభివృద్ధి జరుగును. గ్రహణ నియమాలు పాటించాలి.
22. మీ దైనందిన కార్యక్రమాలను గోప్యంగా ఉంచుటకు మంచిరోజు.
23. సమాజానికి మేలు కలుగజేసే కార్యక్రమాలను ప్రారంభించుటకు మంచిరోజు.
24. నూతన ప్రణాళికను అనుసరించి కలిసి పనిచేసే వాళ్ళను ఎంచుకొనుటకు మంచిరోజు.
25. వినాయకచవితి రోజున ఉపవాసం ఉండి సాయంత్రం వినాయకునికి గరికతో పూజించాలి. దోసకాయ నైవేద్యం ముఖ్యం.
27. వివాదాస్పద విషయాలకు దూరంగా ఉండవలసిన రోజు. తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ అన్నారు.
28. అనవసరమైన వ్యక్తుల దగ్గర మీ కార్యక్రమాలు, మంచిపని అయిననూ సరే గోప్యంగా ఉంచవలసిన రోజు.
29. రహస్యపరమైన నివేదికలను సమర్పించుటకు అనుకూలమైన రోజు.
30. ఆరోగ్యము కొరకు జాగ్రత్తలు తీసుకొనుటకు మంచిరోజు.
31. వృత్తిపరమైన అభివృద్ధికై పలుకుబడిని ఉపయోగించుటకు అనుకూలమైన రోజు.

## శంభో మహాదేవ

# తెలుసుకోవలసిన ప్రాథమిక ఆధ్యాత్మిక విషయాలు

+ సూర్యాస్తమయం తదుపరి తులసి దళాలు, పుష్పాలు కోయరాదు.
+ అర్హతలు తెలుసుకొని తులసిదళాలు కోయాలి. పవిత్రతో కోయాలి.
+ పూలు ఫ్రిజ్‌లో వుంచి మరుసటి రోజుతో పూజించడం అదే విధంగా పాలు ఫ్రిజ్‌లో వుంచి మరుసటి రోజు దైవ కార్యాలకు ఉపయోగించడం పనికి రాదు.
+ స్నానానంతరం తలదువ్వుకొని, పౌడర్ రాసుకొని పూజకు కూర్చోవడం పనికి రాదు.
+ కుంకుమ పూజ చేసేటప్పుడు అమ్మవారి విగ్రహం, ఫోటోమీద కుంకుమ విసిరి విసిరి వేయడం చేయరాదు. (అమ్మవారి పాదాల మీదనే నెమ్మదిగా కుంకుమ పడేటట్లు పూజించాలి.)
+ బంగారు పట్టీలు, మట్టెలు ధరించకూడదు.
+ విష్ణుపూజలో కొండగోపు, జిల్లేడు పూలు, ఉమ్మెత్తపూలు, గిరిమల్లి, ఉమ్మెత్త, దిరిసిన బూరుగు పూలు నిషిద్ధము, గణపతి పూజలో తులసీదళాలు ఉపయోగించరాదు.
+ పూజకు ఉపయోగించబడిన పూలను చెత్త కుండీలలో వేయరాదు. తొక్కని చోట ఉంచాలి.
+ పూలమాలను త్రుంచి సగం దేవుడికి మిగతా సగం తలలో ధరించుట చేయరాదు.
+ సోమవారంనాడు మినహా మిగిలిన రోజులలో కోసిన మారేడు పత్రిని పూజానంతరము కడిగి మరల ఉపయోగించవచ్చును.
+ దేవతా విగ్రహాల ముఖం మీదకు వచ్చే విధంగా దీపారాధన చేయరాదు. ఒక ప్రక్కకు దీపారాధన ఉండాలి.
+ పురుషులు గాని, స్త్రీలు గాని దిగంబర స్నానాలు చేయరాదు.
+ కార్తీక మాసంలో వేడినీళ్ళ స్నానం అమంగళం.
+ ఇంట్లో ఎవరైనా ఊరికి బయలుదేరితే వాళ్ళు వెళ్ళిన వెంటనే స్నానం చేయరాదు. చాలా తప్పు.
+ పర్వదినాలలో సముద్ర స్నానం చేయాలి. మామూలు రోజులలో చేయకూడదు. (రామేశ్వరం ధనుష్కోటికి మినహాయింపు.)
+ గ్రహణం రోజున సంభోగం మిక్కిలి దోషం.
+ మీరు తీసుకున్న తాంబూలంను మరొకరికి ఇచ్చుట మంచిది కాదు.
+ షష్ట్యబ్దిమహము 60 సంవత్సరములు నిండిన దంపతులకు వర్తిస్తుంది. ఇందులో ఉగ్రరథశాంతి ప్రధానమైనది.
+ సప్తతి మహము 70 సంవత్సరములు నిండిన దంపతులకు వర్తించును. సప్తాగ్నుల సహితంగా 60 కలశాలలు స్థాపించి ఉగ్రరథశాంతి ప్రధానాంశము. అధిదేవతా – ప్రత్యధి దేవతాపూజ ముఖ్యమైనది.

+ పంచసప్తతి 75 సంవత్సరములు నిండిన దంపతులకు వర్తించును. మహామృత్యుంజయ మంత్రము, హోమము ప్రధానమైనది.
+ సహస్రమాన చంద్ర దర్శనామహము 81 సంవత్సరములు నిండిన వారికి ఇది వర్తించును. పూర్ణపురుషులని అర్థము. సువర్ణాభిషేకమునకు అర్హత లభించును.
+ శత సంవత్సర మహము 100 సంవత్సరాలు నిండిన వారు అర్హులు. శతపత్రపద్మము వేసి పూర్ణకుంభం సమంత్రకంగా ఉంచాలి. ఇందులో శ్రీరామచరిత్ర – శ్రవణం ప్రధానమైనది.
+ చంద్ర, కుజులు కలిసిన ముహూర్తము పనికి రాదు.
+ అష్టమంలో చంద్రుడున్న ముహూర్తము నైదనతార ఫలము. (వ్యతిరేక ఫలితము అని అర్థము.)
+ శత్రువులను ఓడించడానికి సక్రమమైన ముహూర్తంలో కార్యం ప్రారంభించవచ్చు. శాస్త్రాన్ని దుర్వినియోగం చేయడం ద్వారా ఓడించకూడదు.
+ తన గోత్రం గలిగిన స్త్రీని వివాహం చేసుకొన్న ఎడ ప్రాయశ్చిత్త క్రతువు చేయాలి.
+ పూజ చేసే సమయంలో మంచి కుంకుమనే ధరించాలి. (బొట్టు బిళ్లలు పనికి రావు.)
+ దుర్గాదేవిని గరికతో, తులసీ దళాలలతో పూజించరాదు.
+ నందీశ్వరుని తండ్రిపేరు శిలాధ మహర్షి.
+ శివార్చనలో మొగలిపూవు వాడకూడదు.
+ భైరవ పూజలో మల్లెపూలు ఉపయోగించరాదు.
+ శ్రీవేంకటేశ్వర స్వామి వారిని సిద్ధ గంధంతో అర్చించడం – అనంతఫలం.
+ అమ్మవారి పూజకు బంతిపూలు నిషిద్ధం.
+ సువాసన లేనివి, మరుసటి దినమే కోసినవి, పురుగు తొలిచినవి, వాడినవి పూర్తిగా విచ్చనివి అయిన పూలు ఉపయోగించరాదు.
+ లక్ష్మీతామర పూలు పూజకు సర్వశ్రేష్టం. (అందరు దేవతలకు)
+ తెల్లని పూలతో పూజించడం వలన మనః శాంతి కలుగుతుంది.
+ బ్రహ్మచారి, సన్యాసి, పూర్వ సువాసిని తాంబూల చర్వణం చేయరాదు.
+ ఆసనములో సర్వశ్రేష్ఠమైనది దర్భాసనము.
+ గృహస్తువు, పతివ్రతా సదా తాంబూల చర్వణం చేయాలి.
+ బియ్యం పిండితోనే ముగ్గు వేయాలి. (రాతి ముగ్గు వాడరాదు.)
+ మొగ్గలు కోయకూడదు. భ్రూణ హత్య చేసిన పాపం కలుగుతుంది.
+ అగరవత్తులు వెలిగించి దేవుడి చుట్టూ తిప్పకూడదు. ధూపం మాత్రం చేతితో చూపించాలి.
+ ప్రదక్షిణ చేయునప్పుడు చాలా నిదానముగా అడుగులో అడుగు వేస్తూ ప్రదక్షిణం చేయాలి.

+ రావణబ్రహ్మ నివాసమైన లంక – త్రికూటాది పర్వతం మీద వుంది.
+ రావణబ్రహ్మ అసలు పేరు పౌలస్త్య బ్రహ్మ రావణ బిరుదము ఇచ్చినది శివుడు.
+ శివుడి త్రిశూలం పేరు – విజయం.
+ శివుడి ధనుస్సు పేరు – పినాకము.
+ శివుడికి ఇష్టమైన వాద్యములలో ముఖ్యమైనది మృదంగం.
+ వ్యాకరణము – శివప్రసాదం.
+ వ్యాఘ్రపాద మహర్షి, పతంజలి మహర్షి కోరికపై శివుడు ఉమా సమేతంగా ఆనంద తాండవం చేసిన చోటు చిదంబర మహా పుణ్యక్షేత్రం. అందుకే అక్కడ నటరాజా స్వామివారికి నిత్య పూజలు జరుగుచున్నాయి. దీనినే శివ నాట్య సభ అని కూడా అంటారు.
+ పార్వతీదేవి పులివాహనం – శ్వేతనంది.
+ పార్వతీ అమ్మవారి ముఖ్యపరిచారికల పేర్లు జయ, విజయ.
+ పార్వతీదేవికి గల మరో పేరే అపరాజిత. (ఓటమి లేనిది అని అర్థం.)
+ పార్వతీదేవి అమ్మవారి జన్మనక్షత్రము ఆరుద్ర నక్షత్రము.
+ విష్ణువు చక్రము – సుదర్శనము.
+ విష్ణువు శంఖము – పాంచజన్యము.
+ విష్ణువు గద – కౌముది.
+ విష్ణువు ఖడ్గము – నందకము.
+ విష్ణువు ధనుస్సు – శారఙ్గం
+ శ్రీమన్నారాయణుని సేనాధిపతి – విష్వక్సేనుడు.
+ ధర్మరాజు జన్మించినది అభిజిత్ లగ్నం – ఉత్తరాషాఢ శ్రవణా నక్షత్రం మధ్యలో వుంటుంది. అభిజిత్ లగ్నం.
+ ధర్మరాజు జన్మించినది – సింహరాశి.
+ అర్జునుడు ఉత్తరఫల్గుణి నక్షత్రమందు జన్మించాడు.
+ దుర్యోధనుడు, జరాసంధుడు, కీచకుడు, బకాసురుడు, భీమసేనుడు జన్మించినది – మూలా నక్షత్రంలో.
+ శ్రీ ఆదిశంకరాచార్యుల వారి జన్మలగ్నం కర్కాటక లగ్నం – ఆరుద్ర నక్షత్రం.
+ శ్రీ రామచంద్రస్వామివారు పునర్వసు నక్షత్రంలో కర్కాటక లగ్నం కర్కాటక రాశిలో జన్మించారు.
+ శ్రీ వేంకటేశ్వరస్వామి వారి వక్షస్థలములో నివాసమున్నది – కలియుగ లక్ష్మి.
+ శ్రీ వేంకటేశ్వర స్వామివారు కుబేరుని వద్ద చేసిన అప్పు– పధ్నాలుగు లక్షల రామనిష్కముద్రలు.
+ మన్మథుడు భార్యపేరు – రతి.
+ మన్మథుడి మంత్రి – వసంతుడు (ఋతువు).
+ మన్మథుడికి ఐదే ఐదు పుష్పబాణాలు. అవి : ద్రావణ బాణము, తాపన బాణము, శోషణ బాణము, మోహన బాణము, ఉన్మాదన బాణము.

+ మన్మథుడి వాహనం – చిలుక.
+ మన్మథుడి రథం – మలయమారుతం.
+ సరస్వతీదేవి వీణ పేరు – కచ్ఛపము.
+ నారద మహర్షి వీణ పేరు – మహతి.
+ శ్రీ కృష్ణపరమాత్మకు నీడనిచ్చినది – కదంబ వృక్షము.
+ భీష్ముడి అసలు పేరు – దేవవ్రతుడు.
+ భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు కనుక భీష్ముడు.
+ గంధర్వ రాజు పేరు – విశ్వావసువు.
+ మాతృభక్తిలో అగ్రగణ్యుడు గరుత్మంతుడు.
+ అయ్యప్పస్వామి వారు కూర్చునే ఆసన భంగిమ – సుధాసనము.
+ విభాండక మహర్షి తనయుడు ఋష్యశృంగమహర్షి. నాటి ఋష్యశృంగమహర్షి ఆశ్రమమే నేటి (శంగగిరి) శృంగేరీ పుణ్యక్షేత్రం.
+ వాల్మీకి మహర్షి పూర్వనామం రత్నాకరుడు.
+ బ్రహ్మ విష్ణువులకు జ్ఞాన బోధ చేయడానికి పరమేశ్వరుడు అగ్నిస్తంభంగా అవతరించిన ప్రదేశమే అరుణాచలం.
+ చిత్తవృత్తులను నిరోధించడమే యోగము.
+ వేద విహిత కర్మాచరణమే ధర్మము.
+ మార్కండేయ మహర్షి తపోభూమి సప్తశృంగి (అక్కడి శక్తి పీఠం ఎంతో ప్రసిద్ధమైనది.)
+ సృష్టి విజ్ఞానం కొరకు బ్రహ్మ తపస్సు చేసి పరాంబను కాంచిన, (దర్శించిన) చోటు కాంచీపురం. (నేటికంచి).
+ దుర్గాదేవి చేతిలోని కపాలం పేరు విశ్వభక్షణం.
+ గాయత్రిదేవి చేతిలోని కపాలం పేరు బ్రహ్మ కపాలం.
+ లౌకిక ప్రపంచానికి ఉపకరించేది చదువు. ఇహపరాల రెండింటికీ ఉపకరించేది విద్య.
+ విభీషణునికి శ్రీరాముడు ప్రసాదించిన అర్చా విగ్రహమే శ్రీరంగంలోని శ్రీ రంగనాథ స్వామివారు.
+ కలిపురుషుడు అడుగిడలేని ప్రదేశం నైమిశారణ్యం.
+ తొమ్మిది రాత్రులు కాశీలో ఉండిన వారికి గర్భవాస నరకముండదు.
+ తిరుమల గోవింద వరదరాజ స్వామివారి విగ్రహం సైకత నిర్మితం – అభిషేకముండదు.
+ కంచి ఏకామ్రేశ్వర స్వామివారికి మల్లెనూనెతో అభిషేకం చేస్తారు.
+ నరనారాయణుల తపోభూమి బదరికాశ్రమం.
+ మాతృభక్తి వల్ల ఇహలోక సౌఖ్యము, పితృభక్తి వల్ల స్వర్గాది సుఖాలు, గురుభక్తి వల్ల మోక్షము కలుగుతాయి.
+ మననము చేయుట ద్వారా రక్షించేది మంత్రము.
+ మంత్రక్రియలను విస్తరించి చెప్పేది తంత్రము.
+ పన్నెండు సంవత్సరముల దీర్ఘకాల యాగమునకు సత్రమని పేరు.
+ పరమేశ్వరుడు త్రిపురాసురులను సంహరించినది కార్తీక పౌర్ణమినాడు. కృతయుగం నాటి దీపావళి పండుగ ఇదే.

+ యక్షులకు రాజు కుబేరుడు. పురాణాలలో గాజుకన్ను గలవాడు ఇతడు.
+ అగ్ని దేవుడి పేరు వైశ్వానరుడు. పరమేశ్వర అనుగ్రహము వలన ఆగ్నేయ దిక్పాలకుడై అగ్ని అయినాడు.
+ గానకళలో అగ్రగణ్యుడు గంధర్వుడు. ఆహా, ఊహూ అనే పేర్లు కలిగిన గంధర్వులు గంధర్వ గానంలో మరింత దిట్టలు.
+ తూర్పు దిక్కుకు అభిముఖంగా చేసే జపధ్యాన పూజా దానాది సత్కర్మలు విశేష ఫలవంతాలు.
+ మారేడు చెట్టు శివ స్వరూపము.
+ రావిచెట్టు ఆది నారాయణ స్వరూపము.
+ శనివారం తప్ప ఇతర వారములలో రావి చెట్టును తాకరాదు.
+ కదంబ వృక్షము శ్రీదేవి స్వరూపము.
+ మేడి చెట్టు మేధాదక్షిణామూర్తి స్వరూపము.
+ వేప చెట్టు దుర్గాదేవి ప్రతిరూపము.
+ గండకీ నది ఒడ్డున లభించే శిలలే సాలగ్రామ శిలలు. విష్ణుమూర్తికి ప్రతిరూపాలు.
+ చంద్రుడు మృత్యుంజయ మంత్రము జపించి క్షయ వ్యాధి పోగొట్టుకున్న ప్రదేశమే సౌరాష్ట్రలోని సోమనాథ ప్రభాస క్షేత్రము.
+ మహిషాసుర సంహారము చేసిన పిదప అమ్మవారు నెలవైన చోటే కొల్హాపురం.
+ కంసునికి శ్రీ కృష్ణ జననము గూర్చి తెలిపిన యోగమాయయే వింధ్యపర్వతాగ్రమున వింధ్యవాసినీదేవిగా వెలిసింది.
+ నరకాసురుని రాజధాని ప్రాగ్జ్యోతిషపురం. నాటి ప్రాగ్జ్యోతిషపురమే నేటి అస్సాంలోని గౌహతి.
+ నరకాసురుని పురదేవతే శక్తి పీఠములలోని కామాఖ్యాదేవి.
+ సామవేదంలోని ఉదాత్తస్వరం నుండి ని, గ, అనుదాత్త స్వరం నుండి రి, ద, స్వరితం నుండి స, మ, ప అనే ఏడు స్వరాలు పుట్టి సంగీత మూలమయినాయి.
+ చతుస్సాగర పర్యంతం లేక సాగర పర్యంతం (సముద్రం) భూభాగానికి అధిపతి అయిన వారు పూర్ణ కుంభ స్వాగతానికి అర్హుడు.
+ చతపరంగ దళాధిపతి పూర్ణ కుంభ స్వాగతానికి (దేవాలయంలో) అర్హుడు. సన్యాసి, పరివ్రాజకులు కూడా అర్హులే.
+ మహనీయుల్ని అనుసరించాలి అనుకరించకూడదు.
+ అష్టదిక్‌బంధన – ఆకర్షణ – లక్ష్మీస్థాపన, సరస్వతి స్థితం గృహ వాస్తులో – ప్రధానమైనది.
+ ఆధ్యాత్మిక విషయాల్లో అపశృతులను – ప్రోత్సహించవద్దు.
+ ఎక్కువ మందికి జాతకాలు చూపించడం వల్ల – ఎక్కువ కష్టాలు వినాల్సి వస్తుంది.
+ ఎంతో అవసరం అయితేనే జాతకాలు పరిశీలనకు ఇవ్వాలి.
+ పెద్ద సిద్ధాంతులు, చిన్న సిద్ధాంతులు లేరు అందరూ విద్యార్థులే. పెద్ద సిద్ధాంతి–పరమేశ్వరుడొక్కడే.
+ విభూదిరేఖలు భక్తితో పెట్టుకోవాలి. మేకప్ జోడించకూడదు
+ గంధం స్వచ్ఛమైనది ఉపయోగించాలి. ధరించాలి ఇదే శుభప్రదం.

+ సప్తమితో కూడిన సూర్యషష్ఠినాడు–సూర్యుని పూజించి పంచగవ్యప్రాశనము చేసిన అనంత శుభయోగము.
+ సప్తమితో కూడిన సూర్యషష్ఠినాడు కుమారస్వామిని పూజించి, వస్త్రములు సమర్పించిన జీవితంలో మహత్తర కార్యజయం సొంతమగుతుంది.
+ ఋషిపంచమినాడు అడవిలో కాసిన పండ్లు, ఫలాలు తిని మీ గోత్రీకులైన ఋషులను, సప్తర్షులను పూజించిన అనంత అదృష్టము సంప్రాప్తించును.
+ జ్యేష్ఠాదేవి పూజ అష్టమి ప్రాధాన్యత గలది. అనూరాధ నక్షత్రంలో జ్యేష్ఠ దేవిని ఆహ్వానించి జ్యేష్ఠా నక్షత్రం ఉన్న రోజున పూజించి మూలా నక్షత్రం రోజున ఉద్వాసన చెప్పాలి. స్త్రీలు ఈ పూజ చేసిన అరిష్టములు పోవును.
+ మహాలయ పక్షములలో (వినాయక చవితి, ఋషి పంచమి తదుపరి ఈ పక్షాలు వస్త్రాలు) భరణీ నక్షత్రం ఉన్న రోజున శ్రాద్ధ కర్మలు చేస్తే గయాశ్రాద్ధ ఫలితము. ఇది అధికారం ఉన్నవాళ్ళు నిర్వహించవలసిన పితృకర్మలు.
+ భార్య రజస్వల అయిన – మహాలయ శ్రాద్ధము కూడదు. అమావాస్యయందు (మహాలయ పక్షంలో) అశ్వీయుజ మాసము శుక్లపంచమిలోపు కార్యక్రమం పూర్తి చేయాలి.
+ గయాశ్రాద్ధము చేసినవారు కూడా మహాలయ పక్షములో పితృకర్మలు చేయవలెను.– ఇందులో ఏవిధమైన మినహాయింపు లేదు.
+ పితృ పితామహా ప్రపితామహా, మాతృ పితామహి, ప్రపితా, మహి, మాతా మహామాతృ పితామహ మాతృ ప్రపితామహులను ఇతర బంధుగణ, రక్తసంబంధీకులకు, మహాలయ పక్షములలో తర్పణాదులు చేసి శుభంబులు పొందెదరు గాక.
+ అపరాహ్ణం – (మధ్యాహ్నం) శస్త్రహతునికి (మహాలయం) శ్రాద్ధ కర్మలు చేయవలెను. ఇందుకు చతుర్దశి తిథి శ్రాద్ధ సాగరమందు నిర్ణయించబడినది.
+ రవిచంద్రులు హస్తానక్షత్రము నందు ఉండగా ఏర్పడే అమావాస్యనాడు చేసే శ్రాద్ధకర్మలు. యమాగజచ్ఛాయ అందురు. వీటిని నిర్వర్తించాలి.
+ వడగండ్ల వాన – ఆంధ్రప్రదేశ్‌కు నష్టాల వాన.
+ ఉపాంగ లలితావ్రతము దేవీ నవరాత్రులలో పంచమి తిథినాడు చేయవలెను. పంచమి మధ్యాహ్నం ఉండాలి.
+ విష్కంభ యోగమున్న సమయములో కార్యసిద్ధి – అర్ధఫలితము వ్యతీపాత యోగకాలములో సర్వకార్య విఘ్నములు కలుగును.
+ అంధకార నక్షత్రమందున్న గ్రహదిశయందు ఆటంకాలు సంభవిస్తాయి.
+ భూమికి జీవశక్తి ఉంది – కట్టడానికి లేదు.
+ స్థలం లోపభూయిష్టమైనప్పుడు – వాస్తు మార్పులు నిష్ఫలం.
+ జ్యోతిశాస్త్రంలో 22 లక్షలకు పైగా శ్లోకాలు (అధ్యాయాలు) తెలిసినవారు – బృహస్పతి (గురుగ్రహం)
+ 44 లక్షల శ్లోకములు (అధ్యాయాలు) తెలిసినవారు శుక్రుడు.
+ నవకోటి (9 కోట్లు) శ్లోకాలు తెలిసిన పార్వతీదేవి జ్యోతిష శాస్త్రంలో అగ్రస్థానం.



| | |
|---|---|
| అశ్విని, మఖ, మూల నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | భరణి, పుబ్బ, పూర్వాషాఢ, రోహిణి, హస్త, శ్రవణం, ఆరుద్ర, శతభిషం, పుష్యమి, జ్యేష్ఠ, అనూరాధ, ఉత్తరాభాద్ర, ఆశ్లేష, స్వాతి, రేవతి. |
| భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, మృగశిర, శ్రవణం, పునర్వసు, విశాఖ, అశ్విని, మూల, చిత్త, పూర్వాభాద్ర, ఆశ్లేష, రేవతి, మఖ, ధనిష్ఠ, పూర్వాషాఢ, జ్యేష్ఠ, అశ్విని. |
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | రోహిణి, శ్రవణం, హస్త, ఆరుద్ర, మూల, పుష్యమి, ఉత్తరాభాద్ర, మఖ, భరణి, పుబ్బ, అశ్విని, స్వాతి, శతభిషం, అనూరాధ, పూర్వాషాడ, పూర్వాభాద్ర. |
| రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | మృగశిర, చిత్త, ధనిష్ఠ, ఆశ్లేష, జ్యేష్ఠ, పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర, రోహిణి, పుబ్బ, రేవతి, పూర్వాషాడ, భరణి ఉత్తర, ఉత్తరాషాఢ, కృత్తిక. |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | ఆరుద్ర, శతభిషం, స్వాతి, పుష్యమి, మూల, మఖ, అశ్విని, కృత్తిక, అనూరాధ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రోహిణి, ఉత్తరాషాఢ, ఉత్తర, శ్రవణం. |
| ఆరుద్ర, స్వాతి, శతభిషం నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | పునర్వసు, విశాఖ, ధనిష్ఠ, పూర్వాభాద్ర, ఆరుద్ర, రేవతి, పుబ్బ, పూర్వాషాఢ, ఆశ్లేష, జ్యేష్ఠ, భరణి, హస్త, శ్రవణం, రోహిణి, చిత్త, మృగశిర, |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, మఖ, మూల, కృత్తిక, ఉత్తర, చిత్త, ఉత్తరాషాఢ, అశ్విని, శతభిషం, మృగశిర, ధనిష్ఠ, స్వాతి, ఆరుద్ర. |
| పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి, పుబ్బ, భరణి, హస్త శ్రవణం, రోహిణి, స్వాతి, పుష్యమి, ఆరుద్ర, విశాఖ, పూర్వాభాద్ర, పునర్వసు, పూర్వాషాడ, శతభిషం |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | మఖ, అశ్విని, కృత్తిక, ఉత్తర, మూల, ఉత్తరాషాఢ, చిత్త, ధనిష్ఠ, మృగశిర, విశాఖ, పూర్వాభాద్ర, పునర్వసు, అనూరాధ, పుష్యమి, ఉత్తరాభాద్ర. |

శంభో మహాదేవ

# శ్రీ హేవిళంబినామ సంవత్సర శుభ ముహూర్తాలు

## 2017 - 2018

## చైత్రమాసం

| | |
|---|---|
| 7-04-2017 శుక్రవారం, శు.ద్వాదశి | మఖ నక్షత్రం వృషభ లగ్నం, ఉ.గం. 9.55 ని.లకు, వివాహం/గృహప్రవేశం, శంఖుస్థాపన, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, కేశఖండన, దేవతా ప్రతిష్ఠ దస్త్రము. |
| 10-04-2017 సోమవారం, పౌర్ణమి | హస్త నక్షత్రం, వృశ్చిలగ్నం రాత్రి 9.03 ని., గృహప్రవేశం, గర్భాదానం, విదేశీ ప్రయాణం |
| 12-04-2017 బుధవారం, పాడ్యమి | స్వాతి నక్షత్రం, మిథునలగ్నం, ఉ.గం. 8.44 ని.లకు దస్త్రము, అక్షరాభ్యాసం, కేశఖండన, అన్నప్రాశన, నూతన వస్త్రాలంకరణ. |
| 14-04-17 శుక్రవారం, బ.తదియ | అనూరాధ నక్షత్రం, కర్కాటకలగ్నం, మ. 12.14, నూతన దస్త్రము, నూతన కార్యాలయం, ప్రయాణాలు, క్రయవిక్రయాలు. |
| 19-04-17 బుధవారం, నవమి | శ్రవణ నక్షత్రం, మీనలగ్నం, తె. 4.18 ని., గృహ ప్రవేశము, సింహద్వారము, విదేశీయానము. |
| 21-04-17 శుక్రవారం, దశమి | ధనిష్ఠ నక్షత్రం, కటకం/సప్తమ చంద్రః లగ్నం ఉ. 11.54 ని., వివాహం, అన్నప్రాశన, అక్షర స్వీకారం, కేశఖండన. |
| 22-04-17 శనివారం, ఏకాదశి | శతభిష నక్షత్రం, కన్యాలగ్నం, సా. 4.28ని., ఉయ్యాలలో వేయుట, నిశ్చితాంబూలాలు, వ్యాపారాదులు, క్రయ విక్రయములు. |
| 23-04-2017 ఆదివారం, ద్వాదశి | రోహిణీ నక్షత్రం, మకరలగ్నం, రా. 1.02 ని.లకు, గృహప్రవేశం, వివాహం, విదేశీ ప్రయాణం. |
| 24-04-17 సోమవారం, త్రయోదశి | ఉత్తరాభాద్ర నక్షత్రం, కర్కాటకలగ్నం, ఉ. 9.15ని., క్రయ విక్రయాదులు, వ్యాపారాలు. |

## వైశాఖమాసం

**04-05-17 నుండి 11వ తారీఖు వరకు చిన్నకర్తరి (డోలుకర్తరి) వాస్తుపనులు చేయరాదు.**

| | |
|---|---|
| 28-04-17 శుక్రవారం, శు.తదియ | రోహిణి నక్షత్రం, మీనలగ్నం, తె. 3.35 ని., వివాహం, గృహ ప్రవేశము, శంఖుస్థాపన. |
| 29-04-17 శనివారం, శు.చవితి | మృగశిర నక్షత్రం, కర్కాటకలగ్నం, ఉ. 11.12 ని., వ్యాపారం, ఉయ్యాల, సీమంతం, క్రయవిక్రయ. |

వెనుకబడి కొడుకు వివాహం చేసిన తరువాత వచ్చే కట్నంతో కొడుకుతో వ్యాపారం పెట్టించాలని అతని ఉద్దేశం. అదే విషయం నాతో కూడా చెప్పినాడు. గొప్ప కుటుంబానికి చెంది, లక్షలు వెచ్చించి గొప్పింటి సంబంధాలు ఆడపిల్లలకు తెచ్చి ఘనంగా వివాహం చేసి వారి గ్రామంలో మంచి పేరు, వంశ ప్రతిష్ఠ కలిగిన ఆ కుటుంబానికి చెందిన యువకునకు ఓ 10 లక్షలు కట్నం రావడం సమస్య కానే కాదు, అంతకంటే ఎక్కువే ఇస్తారు. వారి కుటుంబ పరిస్థితి, వంశప్రతిష్ఠ అలాంటిది. వివాహనంతరం వ్యాపారం పెడితే బాగుంటుందా ? ఏ వ్యాపారంలో కలసి వస్తుంది ? అని ఆ యువకుని తండ్రి నన్ను అడిగాడు. వివాహనంతరం పెట్టే వ్యాపారం గురించి ఇప్పుడెందుకు ? అని అన్నాను. వివాహంలో తీసుకునే కట్నానికి, వ్యాపారానికి సంబంధం ఉంది కనుక ఈ విషయం ముందే చెప్పాలని పట్టుపట్టాడయ్యా మా పూర్వీకులు. వారి పూర్వీకులు సన్నిహితులు కావడంతో జాతక పరిశీలన చేయక తప్పలేదు. జాతకంలో ఆయుర్భంగ సూచన ఉంది. (ప్రాణాపాయం). సూచనను నిశ్చయంగా చెప్పడం పద్ధతి కాదు. తల్లిదండ్రి ఆయుర్ధాయం గురించి కుమారునికి చెప్పవచ్చు కానీ కుమారుని ఆయుర్భంగం గురించి తల్లిదండ్రులకు చెప్పకూడదు, ఇది అనువంశిక ఆజ్ఞ.

మరోసారి జాతకాన్ని పరిశీలించి ఫలితం తేల్చి చెప్పాను. వివాహం ఒక సంవత్సరం వాయిదా వేయమని, వాయిదా వేయటం జరగని పని, ఈ సంవత్సరం వివాహం చేయాల్సిందే అని పట్టుబట్టాడు ఆయన. నేను ఈ సందర్భంగా ఓ ఆడపిల్ల జీవితం అన్యాయం అయిపోతుందనే ఉద్దేశ్యంతో మీ కుమారునికి సర్పగండం ఉంది. వివాహం వాయిదా వేయడం అవసరమని చెప్పాను. జ్యోతిషశాస్త్రం గురించి కొంత తేలికగా మాట్లాడాడు. పొలాలలో తిరిగే మాలాంటి వాళ్ళకు పాముగండం కాక పిల్లిగండం ఉంటుందా ? పాములు కనబడుతుంటాయి, పోతుంటాయి. దీనికోసం పెళ్ళి వాయిదా వేయడం ఏమిటి ? వ్యాపారం గురించి అడిగితే పాముగండం, పిల్లిగండం, పెళ్ళి వాయిదా వేయమంటారేంటి? నేను అడిగింది ఏమిటి ? మీరు చెప్పేది ఏమిటి ? ఇలా చాలాసేపు వాదించాడు. చివరకు నేను కొన్ని ప్రత్యామ్నాయ శాంతి సూత్రాలు చెప్పాను. ఏ శాంతులైనా పెళ్ళి అయిన తర్వాతే చేస్తాను, ఇప్పుడు కాదు, కట్నం వస్తే గాని ఏ పని మొదలుకాదు. వివాహానికి ముందు ఎలాంటి శాంతి క్రతువులు చేయనని కఠినంగా చెప్పేశాడు. 3 నెలల తిరగకముందే వివాహం నిశ్చయం చేశాడు. 12 లక్షల కట్నం, రెండు ఎకరాల మాగాణి భూమి, దుగ్గిరాల మండలంలో సంబంధం కుదిరింది. నేను పెళ్ళి ప్రయత్నాలు వాయిదా వేయమన్నానని అసంతృప్తితో లేక కోపంతో కావచ్చు నాకు శుభలేఖ పంపలేదు. మా బాబాయి గారితో చెప్పలేదు. నేను కూడా ఆ విషయం ప్రస్తావించలేదు. శుభలేఖలో ముహూర్తం పరిశీలించాను. ఆ పెళ్ళి ముహూర్తం దుర్ముహూర్తంలో పెట్టారు (దుర్ముహూర్తం కేతుగ్రహ ఆధీన కాలం) మనం నిమిత్తమాత్రులం. ఈశ్వరేచ్ఛను అనుసరించి ఫలితాలు అమలులోకి వస్తాయి.

"ఫలానే గ్రహచారేణ సూచయన్తి మనీషిణః" అను సూక్తిని మననం చేసుకున్నాను. పెళ్ళి పనులు ముమ్మరంగా సాగుతున్నాయి. గుంటూరు వెళ్ళి పెళ్ళి కుమారుడికి సూట్లు తీసుకుందామని మోటారు సైకిల్‌పైన గుంటూరు వస్తున్నారు తండ్రికొడుకులు. విధి

బలీయమైనది. నిజం నిష్ఠురమైనది. కర్కషే, ధర్మ శృంఖలాబద్ధములైన యముని హస్తములు స్వేచ్ఛలేనివి. కాలం తీరిన వారిని ఉపేక్షించుటకు యముడు స్వతంత్రుడు కాదు. కాలభ్రమణమును అనుసరించి తన ధర్మమును నెరవేర్చాలి. మంత్ర–తంత్ర–ఉపహార–ఉపసంహార–హోమ–భక్తి పూజలకు అతీతుడు యముడు. నిశ్చయమైన నియమములు కలిగినవాడు కనుక యముడు.

మోటారు బైక్‌మీద వస్తూ పేరెచర్ల వద్ద రైలు గేటు వేయడంతో ఆగిపోయారు. రైలు దూరం నుండి వస్తుంది. మోటారు సైకిలు నడుపుతున్న స్థానంలో తండ్రిగారు ఉన్నారు. వెనుకసీటు మీద కుమారుడు కూర్చున్నాడు. రైలు ఇంజను శబ్దం పెద్దగా వినిపిస్తుంది. కొన్ని నిమిషాల్లో రైలు వెళ్ళిపోవడం, గేటు తెరవడం జరుగబోతుంది. ఇంతలో పైన ఆకాశమార్గంలో ఓ గ్రద్ధ పామును వదిలిందో లేక పాము గ్రద్ద నోటినుండి విడిపించుకుందో మొత్తానికి పాము జారి మోటారు సైకిలు వెనుక భాగంలో కూర్చున్న యువకునిపైన పడింది. పెద్దగా కేకపెట్టి ఆ యువకుడు పామును విదిల్చికొట్టాడు. పాము మోటారు సైకిలుకి కాస్త దూరంలో పడడం జరిగింది. జనం గుమిగూడారు. ఏ జరిగిందో పూర్తిగా అర్థంకాని పరిస్థితి. ఏమైనదని అడిగితే ఆ యువకుడు దూరంగా తాను విదిల్చికొట్టిన పామును చేత్తో చూపించాడు. అప్పటికే ఆపస్మాకరం వచ్చింది. జనం అతడిని వదిలి పామును చూసి తల ఒక దిక్కుకు తప్పుకున్నారు. కొందరు ధైర్యం చేసి పాము దగ్గరకు వెళ్ళే ప్రయత్నం చేస్తున్నారు. ఇతనికి నోరు నుండి నురుగు వస్తుంది. ఇంతలో పైనుండి గ్రద్ధ రావడం పామును నోట పెట్టుకుని వెళ్ళిపోవడం జరిగింది. అప్పుడర్థమైంది జనానికి పాము పైనుండి పడిందని, పాముకోసం గ్రద్ధ చక్కర్లు కొడుతుందని క్యాబిన్‌లోని రైల్వే వాళ్ళు చెప్పారు. అటుగా వస్తున్నా రాళ్ళు రవాణా చేసే ట్రాక్టరులో అతడిని హాస్పటల్‌కి తరలించారు.

హుటాహుటిన హాస్పిటల్ ప్రాంగణంలోనికి చేతుల మీద తీసుకుని వెళ్తున్నప్పుడే తల వాల్చేశాడని చెప్పి అతని తండ్రి దీనాతి దీనంగా విలపించాడు.

యే భూతానా మధిపతయో విసిఖాసః కపర్దినః

యే అన్నేషు వివిధ్యంతి – పాత్రేషుపిబతో జనాన్

సర్వభూతముల యందు కరుణ కలిగిన సర్వేశ్వరుడు ఆ యువకుని ఆత్మకు శాంతి చేకూర్చును గాక, మరుజన్మలో దీర్ఘాయువంతుని చేయుగాక, మరల జన్మపొందిన వానికి సర్ప, వృశ్చిక, తస్కర, విషజ్వరాది భయము లేకుండుగాక, జన్మజన్మాంతర పర్యంతము పరమేశ్వరుడు వానిని కాపాడుగాక.

మీ జాతకంలో సర్పదోషం గురించి తెలుసుకోవాలంటే రాహు–కేతువుల పుస్తక రచయిత, శ్రీకాళహస్తీశ్వర స్వామి వారి ఆస్థాన సిద్ధాంతి ములుగు రామలింగేశ్వర వరప్రసాదు సిద్ధాంతి గారిని అడిగి తెలుసుకోండి.



# నవనాయక ఫలితాలు

## భవిష్య భారతం (2017-18)

**1. రాజు - కుజుడు :** కుజుడికి రాజ్యాధిపత్యం రావడం మంచిది కాదు. "యుద్ధ కారకో కుజః" అన్నారు. ఈ సూత్రాన్ని అనుసరించి ప్రపంచ దేశాల మధ్య భేదాభిప్రాయాలు ఎక్కువవుతాయి. దేశాల మధ్య ఆధిపత్య పోరు అధికమవుతుంది. భారతదేశం కొన్ని సంచలనాత్మక, కఠినమైన నిర్ణయాలను తీసుకొనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కందులు, మిరప వినియోగదారులకు ధర కలిగి ఉంటాయి. రైతులకు సామాన్య ఫలితాలు మాత్రమే వస్తాయి. వ్యవసాయం లాభసాటిగా ఉండదు. శ్రమకు తగిన ఫలితం లభించడం కష్టమవుతుంది. భారత్, పాక్ దేశాల మధ్య నెలకొన్న పరిస్థితులు ప్రజలకు తీవ్రమైన సంకటంగా మారుతుంది. శాంతికాముకుల మనసులు రోదిస్తాయి. ప్రతి విషయాన్ని రాజకీయ ప్రయోజనాలకు వాడుకోవడం మనం చూసిన చరిత్ర. ఎర్ర రేగడి భూములు వ్యవసాయానికి జీవం పోస్తాయి. సైబర్ నేరాలు, దొంగతనాలు, హత్యలు, కిడ్నాప్‌లు, రౌడీయిజం ఎక్కువవుతుంది. ప్రజలకు రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కులకు అడ్డంకులు ఏర్పడతాయి. కులం ప్రాతిపదిక దిశగా అన్ని పనులు నడుస్తాయి. తెలంగాణ అభివృద్ధి సాధిస్తుంది. అన్ని రకాల నిత్యవసర వస్తువుల ధరలు పెరుగుతాయి. కొన్ని రోజులు బాగా తగ్గి ఉంటాయి. ధరల సమతుల్యత ఉండదు.బ్లాక్ మార్కెట్ అధికమవుతుంది. నేర రంగాలలో బాలబాలికల పాత్ర ఎక్కువవుతుంది. బహిరంగ దోపిడిలను అడ్డుకునే నాథుడు ఉండదు. కిడ్నాప్‌లు, స్త్రీలపై అత్యాచారాలు, దుశ్శాసన పర్వాన్ని గుర్తుకు తెస్తాయి. విద్యారంగం పూర్తిగా కలుషితమవుతుంది. డబ్బులేని పేదవారు చదువుకోవాలనుకునే భావజాలం కలిగి ఉంటే అట్లాంటి వాళ్ళను విద్యాసంస్థలు తరిమికొడతాయి. తెల్లకోటు వేసుకోవాలంటే కోట్లు ఖర్చు పెట్టాలి. కుల, మత, వర్గ, ప్రాంతీయ అసమానతలే నిస్సిగ్గుగా రాజ్యమేలుతాయి.



**2. మంత్రి - గురువు :** బ్రాహ్మణ గ్రహమైన బృహస్పతికి మంత్రిత్వం రావడం మంచిది. కీలకమైన విషయాల్లో మేధావుల సలహాలు ప్రజలకు, ప్రభుత్వానికి మంచి చేస్తాయి. ఆర్థిక, రక్షణ, తీవ్రవాద విషయాల్లో మంచి వ్యూహాలు, మంచి ఫలితాలనిస్తాయి. ఆర్థిక సంస్కరణలు కొంత ఆలస్యంగానే మంచి ఫలితాలనిస్తాయి. బంగారం ధర పెరుగుతుంది – నిలకడగా. మేధావుల సూచనలను రాజకీయ నాయకులు, అధికారులు పెడచెవిన పెట్టి వినాశనాన్ని కొనితెచ్చుకుంటారు. సభ్యసమాజం సిగ్గుపడే విధంగా ప్రభుత్వాలు కొన్ని రాజకీయ పార్టీలు ప్రవర్తిస్తాయి. మారుతున్న సామాజిక విషయాలవల్ల – సామాన్య మానవుడు బతికి బట్టకట్టడం కష్టమే అవుతుంది. అనేక విషయాల్లో బ్రాహ్మణులు తమ శక్తిసామర్థ్యాలతో పేరు తెచ్చుకుంటారు. వారు కష్టకాలంలో ప్రభుత్వాలకు అండగా ఉండి, ఆపదలు రాకుండా కాపాడుతారు. ఆర్థిక సంస్కరణల ఫలితం ఎలా ఉంటుందో గానీ, సామాన్యుడి మాడు పగులుతుంది. తప్పుడు సలహాలు ఇచ్చేవాళ్ళ వల్ల దేశం అతలాకుతలమవుతుంది. ముఖ్య నాయకులు ప్రతిష్టను కోల్పోతారు.



**3. సేనాధిపతి - బుధుడు :** దేశసేవకు బలం దృఢంగా ఉంటుంది. వ్యూహ ప్రతివ్యూహాలతో పెద్ద నష్టాలు రాకుండా కాపాడుతారు. కొత్త వ్యాపారాలు విజయవంతం అవుతాయి. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు మందకొడిగా సాగుతాయి. పరిస్థితుల ప్రభావం, ఘర్షణలు మొదలైన వాటికన్నా రాజకీయ ప్రయోజనాలే ప్రాతిపదికగా, దురదృష్ట ఘటనలు జరుగుతాయి. యుద్ధం చేయడానికి సమయాను కూలమైన నిర్ణయాలు ఉండవు. మహా విధ్వంసక ఆయుధాలను ఉపయోగించవలసి వస్తుంది, భరించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. రక్షణ వ్యయం అధికమై రహస్యంగా అప్పులు తేవాల్సి వస్తుంది. దేశ రహస్యాలు అమ్ముకునే ప్రబుద్ధులు పట్టుబడతారు. దేశం ఈ సంవత్సరం కఠినమైన సవాళ్ళను ఎదుర్కోవలసి వస్తుంది. రౌడీలు టీచర్లుగా మారి విద్యార్థినీ, విద్యార్థులను డబ్బు కోసం వేధిస్తారు. పిల్లలపై అత్యాచారాలు చేస్తారు. ఈ సంవత్సరం కూడా అనుమానాస్పద మృతులు, కిడ్నాప్‌లు, నీళ్ళలో పడి చనిపోయేవాళ్ళు ఎక్కువవుతారు. ఈతలు, పిక్నిక్‌లు నూటికి 90% విషాదాన్నే మిగులుస్తాయి. స్నేహాలు, పరిచయాలు, బంధుత్వాలు ఇతరత్రా అనుబంధాలన్నీ గాలికి కొట్టుకుపోతాయి. డబ్బులు ఖర్చుపెడితే కాని పని ఉండదు. మనుషులకు మనుషులకు మధ్య వాణిజ్య సంభాషణలు తప్ప ఇతర సంబంధాలు లేవని స్పష్టంగా నిరూపితమవుతుంది. ప్రశ్నాపత్రాల లీకేజీ మళ్ళీ తప్పదు.



**4. సస్యాధిపతి - రవి :** నకిలి విత్తనాలు రైతుల పాలిట పెనుశాపంగా పరిణమిస్తుంది. ఎన్ని రకాల చర్యలు తీసుకున్న రైతులకి చేతిదాక వచ్చిన పంట నోటికి అందదు. తుపానుల వల్ల ఈ సంవత్సరం పంట నష్టం జరుగుతుంది. ప్రాజెక్టులకు నీళ్ళు వస్తాయి. అకాల వర్షాలే ప్రధాన సమస్య అవుతుంది. సకాల వర్షాలు ప్రశ్నార్థకం. వ్యవసాయ సంబంధమైన ఖర్చులు అధికమవుతాయి. సూర్యుడు – అంటే రవికి సస్యాధిపత్యం రావడం వల్ల రైతులను పట్టించుకునే వారు ఉండరు. రైతులు నూటికి తొంభైశాతం అడుగడుగునా మోసపోతారు. కోర్టు నోటీసులు వస్తాయి.



**5. ధాన్యాధిపతి - శుక్రుడు :** ధాన్యం, అపరాలు ధర కలిగి ఉంటాయి. ధాన్యం ఉత్పత్తి మధ్యస్తంగా ఉంటుంది. ప్రతి విషయంలోను స్త్రీల ఆధిపత్యం ఎక్కువవుతుంది. నల్ల నువ్వులు, తెల్ల నువ్వులు, సుగంధ ద్రవ్యాలు ధర కలిగి ఉంటాయి. అన్నదాన సత్రాలు కళకళలాడుతాయి. తుపాను వల్ల ధాన్యానికి నష్టం. ధాన్యం వ్యాపారులకు అనుకూలంగా ఉంది. అపరాల వ్యాపారులకు కూడా కాలం అనుకూలంగా ఉంది. వ్యాపారులు సందర్భానుసారంగా నిర్ణయాలు తీసుకొని లాభపడతారు. శుక్రునకు ధాన్యాధిపత్యం వచ్చిన కారణంగా స్త్రీలు వ్యాపార రంగంలో బాగా రాణిస్తారు. వృద్ధ స్త్రీలకు, వితంతువులకు ఇప్పుడు వస్తున్న పెన్షన్ డబ్బులు పెంచబడతాయి. స్త్రీల వల్ల దేశానికి అంతర్జాతీయ ఖ్యాతి లభిస్తుంది. (నాయకత్వ లక్షణాలు కలిగి ఎంతో ప్రజాదరణ కలిగిన స్త్రీ శాశ్వతంగా కనుమరుగు అవడం దేశానికి తీరని దుఃఖం కలిగిస్తుంది.)



**6. అర్ఘ్యాధిపతి - బుధుడు :** వైశ్యుల ఆధిపత్యం బాగా పెరుగుతుంది. సామాజిక, ఆధ్యాత్మిక కార్యక్రమాలలో వైశ్యులు చురుకుగా పాల్గొంటారు. అనారోగ్యకరమైన ఆహారపదార్థాలు ఆదరించబడతాయి. నిర్జన ప్రదేశాలలో, పట్టణాలలో అధిక వర్షపాతం. సముద్రగర్భ అగ్నిపర్వతాలు వంటివి విస్ఫోటనం చెందుతాయి. సముద్రంలో వచ్చే మార్పుల వల్ల అలలు ఎగిసిపడతాయి. సముద్ర మధ్య దీవులకు ప్రతికూల కాలం. సముద్ర ఉగ్రస్వరూపం వల్ల ధననష్టం, విశేష జననష్టం కలుగుతుంది. సునామీ వచ్చే అవకాశాలు ఉన్నాయి.



**7. మేఘాధిపతి - రవి :** వాతావరణం అస్తవ్యస్తంగా ఉంటుంది. పట్టణాలలో మేఘాలు బాగా వర్షిస్తాయి. రెండుసార్లు ఎండాకాలం ఋతుపవనాల దయ నామమాత్రమే. పిడుగుపాట్ల వల్ల జననష్టం, అకాల వర్షాల వల్ల పంటనష్టం సంభవిస్తుంది. సహాయ కార్యక్రమాలలో అవినీతి తాండవిస్తుంది. ముఖ్యంగా ప్రకృతి భయంకరమైన విలయతాండవం చేస్తుంది. వ్యవసాయ సంబంధిత ప్రకటనలు నమ్మి రైతులు నష్టపోతారు. పొగాకు పరిశ్రమలో తీవ్ర సంక్షోభం ఏర్పడుతుంది. కొన్ని సందర్భాలలో వ్యవసాయ ఖర్చులు కూడా రావు. కొన్ని రకాల పంటలను రైతులే వద్దనుకుంటారు. రైతులను ఆదుకుంటామనే ప్రకటనలు, భరోసాలు నీటి మూటలుగానే మిగిలిపోతాయి. దౌర్జన్యంగా రైతుల పొలాలను లాక్కుంటారు.



**8. రసాధిపతి - కుజుడు :** రక్షణ కోసం ఏర్పరచుకున్న ఆయుధాలు, మందుగుండు సామాగ్రి నేరస్థులకు ఆయుధాలుగా మారుతాయి. సైనికులు, పోలీసుల వద్దనున్న ఆయుధాల కన్నా ఉగ్రవాదుల దగ్గర శక్తివంతమైన ఆయుధాలు ఉంటాయి. ముఖ్యమైన పదవుల్లో ఉన్నవారు తప్పుడు పనులు చేసి ఇక్కట్లకు గురి అవుతారు. కంచే చేను మేస్తుంది. సమాజంలో స్త్రీల మీద అత్యాచారాలు అధికమవుతాయి. వివిధ రకాల పుష్పజాతులు అభివృద్ధి చెందుతాయి. గంజాయి వనాలు వృద్ధి చెందుతాయి. ఎక్కువ శాతం జనులు ఏదో ఒక మత్తులో తూగుతుంటారు. మద్యపానమనే మహాసముద్రాన్ని అవలీలగా తాగేస్తారు. అవినీతిపరులకు అరదండాలు పడతాయి. కొంతమందికి చట్టాలు – రాజ్యాంగం వర్తించవు. ధర్మానికి కానికాలం దాపురించింది. న్యాయం గాఢ నిద్రలో ఉంటుంది. అనేక సమస్యలను అవలీలగా పరిష్కరించిన భారతీయ మేధావులు మత్తులో చిక్కుకున్న ప్రజలకు ఏమీ చేయలేక క్రుంగిన రథచక్రాల చెంత నిస్సహాయుడైన కర్ణునివలె భరతమాత దీనవదన అవుతుంది.



**9. నీరసాధిపతి - రవి :** యువతీ యువకులు అద్భుత విజయాలు సాధిస్తారు. మేధారంగంలో అంతర్జాతీయ ఖ్యాతి తెస్తారు. దేశకాలమాన పరిస్థితుల వల్ల యువశక్తి నిరాశకు గురి అవుతుంది. వ్యసనాలకు బానిసవుతుంది. కుల, మత, ప్రాంతీయ ద్వేషాలు, పేదరికం యువతకు ఆటంకం అవుతాయి. మంచి అవకాశాలు లభించినవాళ్ళు వాటిని దుర్వినియోగం చేస్తారు. ఎర్రబారిన మబ్బులతో పడమటి సూర్యాస్తమయం కర్ణుని మరణానంతరం అస్తమించిన సూర్యుడుని గుర్తు చేస్తుంది.



## హనుమాన్ వత్తులు

ఇది సుగంధ ద్రవ్యము. జువ్వాది వాసన చాలా బాగుంటుంది. పూజలలో ఉపయోగించ దగినది. పసుపు, కుంకుమలతో జువ్వాదిని కలిపి పూజించవచ్చు. ఇది సర్వదేవతా ప్రీతికరమైనది. జువ్వాది పొడితో కూడా కుంకుమార్చన చేసినట్లుగా చేయవచ్చు. భగవంతుని అనుగ్రహము లభిస్తుంది. అమ్మవారిని ఈ జువ్వాదితో పూజిస్తే మంచి ఫలితాలు ఉంటాయి. అభిషేకంలో ఈ జువ్వాది పొడిని ఉపయోగించవచ్చు. శక్తి కలిగినవారు కస్తూరి, పునుగు, జువ్వాది వీటన్నిటితో దేవతార్చన చేయవచ్చు.

## ఎరుపు, పసుపు వత్తులు

ఎరుపు, పసుపు వత్తులతో దీపారాధన శ్రేష్ఠమైనది. ఎరుపు కుంకుమరాళ్ళతో ప్రత్తి మేళవించి రాట్నంతో వడికి వత్తులు చేయాలి. పసుపు చెట్టు ఆకులు, కొమ్మలతో ప్రత్తిని సాంగసాతలం చేసి తదుపరి వడకాలి. పసుపు చెట్టును పీకి ఈ పని చేయకూడదు. అన్ని రకముల దైవ కార్యక్రమములకు ఈ వత్తులు ఎంతో శ్రేష్ఠమైనవి.

## సిద్ధగంధం

ఇది గంధములలో శ్రేష్ఠమైనది. సిద్ధగంధము పూజకు విశేషమైనది. ఇది ధరించుటకు ఉత్తమమైనది. ఈ సిద్ధ గంధములో విశేషమైన మూలికల మిశ్రమం కలుస్తుంది. కృత్రిమమైన సువాసన ద్రవ్యాలు కలువవు.

## అష్టమూలికా గుగ్గిలం

పూజా కార్యక్రమాలలోనూ, శుక్ర, శని, మంగళవారాలలో ఇంట్లో గుగ్గిలం పొగవేయటం ఉత్తమము. ఇది దుష్టశక్తుల ఉద్వాసన, అపకారం చేసే క్రిమికీటకాదులు నశిస్తాయని సైంటిస్టులు కూడా తెలిపారు. సాధారణంగా ఉపయోగించే గుగ్గిలం కన్నా అష్టమూలికలతో మేళవించిన అష్టమూలికా గుగ్గిలం శ్రేష్ఠమైనది. వ్యాపార సంస్థలలోనూ, వాస్తు దోష పరిహారానికి ఈ గుగ్గిలం పొగ శ్రేష్ఠమైనది. తేడా స్పష్టంగా తెలుస్తుంది. ఇందులో ఆవుపేడ మిశ్రితం కలుస్తుంది. ఇందువల్ల రేడియేషన్ నుండి రక్షణ లభిస్తుంది. ఇందులో విశిష్టత ఇది.

## నల్ల వత్తులు

శని మహర్దశ, శని అంతర్దశ నడుస్తున్నవాళ్ళు ఈ వత్తులు ఉపయోగించవచ్చును. శనివారం పూజ, శని దగ్గర వెలిగించడం వలన మంచి ఫలితం ఉంటుంది. ఈ వత్తులు శ్రీ వేంకటేశ్వర స్వామి వారి సన్నిధిలో, శ్రీ అయ్యప్ప స్వామివారి సన్నిధిలో కూడా వెలిగించవచ్చును. ఈ వత్తులు ఇంట్లో గానీ, దేవాలయాలలో గానీ ఉపయోగించవచ్చును.

శంభోమహాదేవ

# నవగ్రహ సంచార భాష్యాలు - 2017-2018

## జరగబోవు సంఘటనలు

❖ శ్రీ వేంకటేశ్వరస్వామి వారి మహాత్యాలు మరిన్ని చూడబోతున్నాము.
❖ హిమాలయ పర్వత ప్రాంతమునకు ప్రతికూల కాలము, దుస్సంఘటనలు
❖ బంగ్లాదేశ్ గ్రహగతులు ప్రతికూలంగా ఉన్నాయి.
❖ సెల్ఫీల మీద మోజు ఎక్కువవుతుంది. దీనివల్ల అనేక కష్టాలు సంభవిస్తాయి.
❖ డబ్బింగ్ సీరియల్స్‌కు జనాదరణ.
❖ తెలుగు సీరియల్స్‌కు గడ్డుకాలం.
❖ మామిడికాయలకు చేదుకాలం.
❖ ఉగ్రవాద చర్యలు ఎక్కడ జరిగినా మూలం జంటనగరాలే.
❖ పాకిస్థాన్ వంకరబుద్ధిమారదు – శత్రుత్వం తారాస్థాయికి చేరుతుంది.
❖ చైనా వంకరబుద్ధి మారదు – పాకిస్థాన్‌ను దాటిపోతుంది.
❖ చైనాలో ప్రకృతి బీభత్సాలు, భూకంపం మొదలైనవి.
❖ చైనా ఆర్థిక పరిస్థితి దిగజారుతుంది.
❖ దక్షిణ చైనా సముద్ర వివాదాలు అన్ని హద్దులను దాటిపోతాయి.
❖ చైనాపై సర్వత్రా విమర్శలు.
❖ క్రికెట్‌లో కుళ్ళు రాజకీయాలకు తెరపడుతుంది.
❖ ప్రతిభా, సామర్థ్యాలకు 75 పాళ్ళు గుర్తింపు లభిస్తుంది.
❖ శ్రీ నరేంద్రమోదీ విదేశీపర్యటనలపై విమర్శల వెల్లువ.
❖ కోల్‌కతాలో ప్రకృతి బీభత్సం.
❖ డ్రగ్స్ దిగుమతి పెరుగుతుంది. వక్రమార్గంలో భారతయువత.
❖ ఆయుధాల కొనుగోలులో విమర్శలు చర్చనీయాంశమవుతుంది.
❖ ఆంధ్రప్రదేశ్‌లో, కర్ణటకలో కరువుకాటకాలు సంభవిస్తాయి.
❖ హిమాలయ పర్వత సమీపప్రాంత దేశాలకు ఉత్తర భారతదేశానికి ప్రతికూల కాలం (భూకంపం).
❖ బిజెపికి గడ్డుకాలం..
❖ సైనా నెహ్వాల్ రాణిస్తుంది.

- ❖ సెక్యూరిటీ కల్చర్ అధికమవుతుంది.
- ❖ క్రేజివాల్ నిర్ణయాలు సంచలనం సృష్టిస్తాయి.
- ❖ బ్యాంక్ రుణాలు ఎగ్గొట్టేవాళ్ళు అధికమవుతారు.
- ❖ బంగారం ధర పెరుగుతుంది.
- ❖ ఈ సంవత్సరము నీటిగండాలు ఎక్కువ – జాగ్రత్తగా ఉండండి.
- ❖ కాశ్మీర్ ఆరని రావణాకాష్టం.
- ❖ సమాజ్‌వాద్ పార్టీలో ముసలం – బజారున పడనున్న నేతలు.
- ❖ చైనా పాశవిక చర్యలు బహిరంగంగా బైటపడతాయి. ఎవ్వరినీ లక్ష్యపెట్టని చైనా.
- ❖ జంటనగరాల్లో గన్ కల్చర్ ఎక్కువవుతుంది. (గతంలో కూడా తెలియజేసాను)
- ❖ ఆర్మీ దుస్తులలో ఉగ్రవాదుల హల్‌చల్.
- ❖ పెంచిపోషించిన ఉగ్రవాదమే పాకిస్థాన్ పాలిట బ్రహ్మరాక్షసి అవుతుంది.
- ❖ పెళ్ళిగాని మగపిల్లల సంఖ్య పెరుగుతుంది.
- ❖ బియ్యం ధర పెరుగుతుంది.
- ❖ ఈ సంవత్సరం కూడా ఇండోనేషియా, సుమిత్రాదీవులకు ప్రతికూల కాలం.
- ❖ నేతలు మారినా అమెరికా పద్ధతుల్లోమాత్రం మార్పురాదు.
- ❖ తెలుగుభాషకు మంచి రోజులు రానున్నాయి.
- ❖ చమురు కంపెనీల దివాలా – నిరుద్యోగసమస్య మరింత పెరుగుతుంది.
- ❖ ప్రవాస భారతీయులకు అష్టకష్టాలు, ఆకలికేకలు.
- ❖ బంగ్లాదేశ్‌కు గడ్డుకాలం – ప్రకృతి బీభత్సాలు అనేక కష్టాలకు దారితీస్తుంది.
- ❖ పాత చలనచిత్రాలకు – సంగీతానికి జనాధరణ.
- ❖ ఆకాశ ప్రమాదంలో ప్రముఖవ్యక్తి మృతి.
- ❖ నౌకా, విమాన, రైలు ప్రయాణాలు ప్రపంచవ్యాప్తంగా అధికమవుతాయి.
- ❖ ప్రేమపెళ్ళిళ్ళు – ఆత్మహత్యలు – అనుమానస్పద మృతులు ఎక్కువవుతాయి.
- ❖ క్రీడాకారుల భద్రతపై గట్టిజాగ్రత్తలు తీసుకోవాలి – అపశృతి సంభవించే అవకాశం ఉంది.
- ❖ ఇస్రో ఘనవిజయాల పరంపర కొనసాగుతుంది. (చిన్న అపశృతి చోటుచేసుకుంటుంది).
- ❖ గోధుమలు, పంచదార రేట్లు పెరుగుతాయి.

- నిత్యావసర వస్తువులు ధరకలిగి ఉంటాయి.
- కూరగాయల ధర హెచ్చుగా ఉంటుంది.
- పూజాసామాగ్రి ధరలు, ఆవు నెయ్యి, మాములు నెయ్యి ధరలు పెరుగుతాయి.
- నిషేధిత గుట్కా వ్యాపారం మూడు పూలు - ఆరు కాయలు
- కల్తీకి కాదేది అనర్హం - సర్వం కల్తీమయం.
- పి.వి. సింధూ విజయయాత్ర కొనసాగుతుంది. ( గత సంవత్సరం చెప్పిన ఈ జోస్యంలో మార్పులేదు.)
- 2019 ఎన్నికల్లో బి.జె.పి. విజయం సాధించాలంటే యుద్ధం చేయకతప్పదు. ఇదే బి.జె.పి. ముందస్తు వ్యూహం.
- ఎడారి రాజ్యాలకు ప్రతికూల కాలం.
- ఆకలికేకలు, నిరుద్యోగం, కల్తీమద్యం వలన మరణాలు, విషాదాలు సంభవిస్తాయి.
- క్రికెట్‌తో పాటు ఇతర క్రీడలకు ప్రోత్సాహం లభిస్తుంది.
- క్రికెట్ ఫీవర్ తగ్గుతుంది.
- శ్రీ నరేంద్రమోదీ ప్రజలలో పరపతి కోల్పోతారు (2016 మార్చి నుండి)
- మనం - మనం - జనం - పచ్చదనం హరిత విప్లవం - ఇవన్నీ కాగితాల వరకే పరిమితం.
- ఎన్ని చీపురుకట్టలు పట్టుకున్నా స్వచ్ఛభారత్ ఎండమావులే.
- కీలకమైన ఉగ్రవాదులు హైదరాబాద్‌లో పట్టుబడతారు. - ఒక పెద్ద అపశృతి తప్పుతుంది.
- రౌడీల రాజ్యం మళ్ళీ వృద్ధి చెందుతుంది.
- భారత విదేశాంగ నిర్ణయాలలో భారీమార్పులు.
- పాకిస్థాన్‌ను లెక్కచేయని విధంగా మాటలు - చేతలు.
- ఎడారి దేశాల్లో సంక్షోభం - ఆకలికేకలు, నిరుద్యోగం.
- సినీ యాక్టర్ల అభిమాన సంఘాల మధ్య అవాంఛనీయ ఘటనలు.
- ఈ సంవత్సరం కొత్త సినిమాలకు చిన్న హీరోలప్రోత్సాహం, జనాదరణ లభిస్తుంది.
- అన్ని రకాల కూరగాయలు లభ్యం తక్కువ - ధర ఎక్కువ.
- ఉత్తర భారతదేశంలో భూకంపాలు.

- దేశద్రోహుల రహస్యాలు బైటపడతాయి.
- హైదరాబాద్‌కు పెట్టుబడులు – నూతన కంపెనీలు.
- జ్యోతిరాదిత్య సింధియా జాతకంలో రాజయోగం నడుస్తుంది.
- భారత్ – అమెరికా సంబంధాలు మరింత బలపడతాయి.
- ప్రకృతి పగబట్టినట్లు ప్రపంచంలో చాలా విషాధ సంఘటనలు జరుగుతాయి.
- కంబోడియా, లావోస్, థాయ్‌లాండ్, మొజాంబిక్, న్యూజీలాండ్, జింబాబ్వే, ఆస్ట్రేలియా, ఫోర్ట్‌మెక్ ముర్రె (కెనడా ప్రాంతం) బ్రెజిల్, ఆఫ్రికా ఖండానికి తీవ్ర అరిష్టకాలం.
- స్టేషనరీ, ప్రింటింగ్ పుస్తకాలు, ఇంటికి వేసే రంగులు వీటి ధర ఎక్కువగా ఉంటుంది.
- ఇల్లు కట్టుకోవాలనే సామాన్యుడి కల కలగానే మిగిలిపోతుంది.
- ఇసుక మాఫియా దందాలు మరింత ఎక్కువవుతాయి.
- మిర్చి ఘూటు తగ్గుతుంది. (ధర తగ్గుతుంది) (రైతులకు)
- ఎన్నడూలేని విధంగా ఆంధ్రప్రదేశ్ ఆర్ధికపరిస్థితి దిగజారుతుంది.
- ఆహార ధాన్యాల ధరపెరుగుతుంది.
- జపాన్‌లో మారణాయుధాల తయారీ.
- ఇటలీ ఆర్ధిక పరిస్థితి దివాళా.
- పత్తి బంగారం అవుతుంది. (పండించిన రైతులకు).
- జర్మనీలో కరువుకాటకాలు.
- జంటనగరాలకు పొంచిఉన్న ఉగ్రవాద దాడి.
- కోల్‌కతాకు జలబీభత్సం, భూకంపం.
- ఢిల్లీలో భూకంపం.
- భాగ్యనగరానికి మళ్ళీ వైభోగం.
- హోమియోపతి వైద్యానికి జనాధరణ.
- ప్రైవేటు బస్సుల ప్రమాదాలు ఈ సంవత్సరం అధికం.
- దేశద్రోహులు – నమ్మకద్రోహులు ఈ సంవత్సరం పట్టుబడతారు.
- పాకిస్థాన్ రక్షణ వ్యవస్థ, రహస్యాలను ఉగ్రవాదులు చేజిక్కించుకుంటారు.
- ఐటి రంగానికి ఒడిదుడుకులు.
- ఇన్‌ఫోసిస్ వంటి బడా కంపెనీలకు కూడా కష్టకాలం.

❖ టాటా మోటార్స్‌కు గడ్డుకాలం.
❖ ప్రఖ్యాత ప్రపంచ పర్యాటకుడు శ్రీ నరేంద్రమోదీ.
❖ ప్రజలకు నచ్చని స్వచ్ఛభారత్.
❖ పాకిస్థాన్‌తో, చైనాతో సంబంధబాంధవ్యాలు తెగతెంపులు.
❖ ప్రత్యేక హెూదా విషయం ప్రాధాన్యతను సంతరించుకుంటుంది.
❖ విరాట్ కోహ్లీ శకం ప్రారంభమవుతుందని గతంలో చెప్పిన జోస్యంలో మార్పు లేదు.
❖ నకిలీ యూనిఫామ్‌లో ఉగ్రవాదుల దాడులు.
❖ పసుపు ధర కలిగి ఉంటుంది.
❖ పేదలకు కిరోసిన్ అందుబాటులో ఉండదు.
❖ కిరోసిన్‌ను డీజిల్‌గా మార్చే కొత్త ప్రక్రియను మన వాళ్ళు కనుగొన్నారు – గర్వించు భారతీయుడా?
❖ మన్మోహన్‌సింగ్ జాతకం బాగాలేదు.
❖ దేశ ఆర్థికస్థితి దివాలా తీస్తుంది.
❖ మనదేశ రహస్యాలు చేరకూడని వారికి చేరుతాయి.
❖ క్రికెట్‌లో ఇంగ్లాండ్ టీమ్ బలం పుంజుకుంటుంది.
❖ ఉల్లిధర తగ్గిందని సంతోషపడకండి–మీ సంతోషం ఎక్కువకాలం ఉండదు.
❖ మహేంద్రసింగ్ ధోని గ్రహగతులు బాగాలేవని గతసంవత్సరం చెప్పిన జోస్యంలో మార్పులేదు.
❖ మహ్మద్ బిన్‌తుగ్లక్ గొప్పవాడుగా కొనియాడబడతాడు. ( ప్రస్తుత పరిపాలన వలన)
❖ ఫిలిప్పీన్‌లో ఆగని అరాచకం – ప్రాణనష్టం – విమర్శలను లెక్కజేయని రోడిగ్రో.
❖ క్రైమ్ రేటు పెరుగుతుంది.
❖ కేజ్రీవాల్‌కు ప్రఖ్యాతి – విమర్శలు – మిశ్రమఫలితాలు.
❖ ఈ సంవత్సరం సైబర్‌నేరాలు అధికం.
❖ శ్రీమతి సోనియా కుటుంబానికి – కేంద్ర ప్రభుత్వ వేధింపులు.
❖ రాష్ట్రంలోనూ, హైదరాబాద్‌లోనూ పెరగనున్న గన్‌కల్చర్.
❖ కొలీజియం వ్యవస్థపై విమర్శలు.

- చైనా అధినేత జంపింగ్ వక్ర వ్యాఖ్యలు – వివాదస్పద వ్యాఖ్యలు – పాకిస్థాన్‌పై అమిత ప్రేమ.
- అమెరికాను, ఇతరదేశాల అభిప్రాయాలను లెక్కజేయని జంపింగ్.
- ఉత్తర కొరియా అధ్యక్షుడి వల్ల ప్రపంచశాంతికి విఘాతం. (క్రూరమైన పనులచే )
- సజ్జలు, జొన్నలు, రాగులు, ఉలవలు మంచి ధరకలిగి ఉంటాయి.
- ఆంధ్రా – తెలంగాణాల మధ్య ఎవరూ ఊహించనంత జలయుద్ధం జరుగుతుంది.
- బి.జె.పికి ప్రజాబలం తగ్గుతుంది.
- చైనాలో ప్రకృతి బీభత్సాలు జననష్టం – భూకంపం.
- కేంద్రం నుండి ఎంత సాయం అందినా ఆంధ్రప్రదేశ్ ఆర్థికపరిస్థితి దివాలా.
- పెసరపప్పుకు మద్దతు ధర రాదు.
- సిరియాలో ఆగని విధ్వంసాలు.
- మిర్చి రైతులకు అగ్నిపరీక్షా కాలం.
- డమాస్కస్‌లో శవాల గుట్టలు.
- మూడో ప్రపంచ యుద్ధానికిక బీజం పడుతుంది.
- వాతావరణంలో మంచి మార్పులేవీ రావు.
- ధోనీ వారసుడు విరాట్ కోహ్లీ.
- అమెరికాకు ప్రతికూల కాలం, ఆర్థికపరిస్థితి – స్థిరత్వం తప్పుతుంది.
- జలబీభత్సాలు – వాయుబీభత్సాలు – టోరంటోల వంటి సంఘటనలు ఈ సంవత్సరం కూడా బాదిస్తాయి.
- దక్షిణ అమెరికా బాగా దెబ్బతింటుంది.
- అమెరికాలో ఉన్మాదుల అఘాయిత్యాలు కొనసాగుతాయి.
- దక్షిణ చైనాలో వరదలు, ప్రకృతివైపరీత్యాలు.
- మయన్మార్‌కు ప్రతికూల కాలమని గత సం ॥ చెప్పిన ఫలితంలో మార్పులేదు.
- సజ్జలు, రాగులు ధరకలిగి ఉంటాయి.
- జింబాబ్వేకు పూర్తి ప్రతికూల కాలం.
- దౌర్జన్యమే బలం, కులమే సామర్థ్యం.
- ఇదే చరిత్ర – నడుస్తుంది – నడవబోతుంది.

- ❖ కావేరీ జలాల వివాదం ముదిరిపాకాన పడుతుంది. తమిళనాడు ప్రజలు లబ్ధి పొందుతారు.
- ❖ ప్రపంచదేశాలకు ముప్పుగా పరిణమించనున్న ఉత్తర కొరయా అధ్యక్షుడు.
- ❖ ముఖేష్ అంబాని విడుదల చేసిన 4జి సెల్‌ఫోన్ ఘనవిజయం.
- ❖ భారతీయ యువతను నిర్వర్యం చేయనున్న డేంజర్ డ్రగ్స్. ఇవి గ్రామాలకు పాకుతాయి.
- ❖ బలుచిస్థాన్ ఓ రావణకాష్టం.
- ❖ ఉగ్రవాదానికి కేరాఫ్ అడ్రస్ పాకిస్థాన్.
- ❖ నీటి కరువువల్ల వలసలు అధికం అవుతాయి.
- ❖ పవన్‌కళ్యాణ్ మాటలు – ఆలోచింపజేస్తాయి.
- ❖ ఐ.టి. రంగానికి కొన్ని సమస్యలు రాబోతున్నాయి.
- ❖ రెండుసార్లు ఎండాకాలం. ( గత సం॥ తెల్పిన దానిలో మార్పులేదు.)
- ❖ సీమాంధ్రలో బంద్, ధర్నాలు, విద్యాసంస్థలకు, వ్యాపారులకు గడ్డుకాలం.
- ❖ మాయావతి జాతకం బాగుంది.
- ❖ రక్షణశాఖ రహస్యంగా బలపడుతుంది. ఇదే దేశానికి బలం.
- ❖ వాణిజ్య పంటలలో మిరప, పత్తి, శనగ రైతులకు అనుకూలంగా ఉంది. (దళారుల పరిస్థితి రైతులకంటే బాగుంది. పంట చేతికి అందివస్తే).
- ❖ పొగాకు పంటలు తీవ్రనష్టంలో ఉంటాయి. (గత సం॥ చెప్పిన ఈ జోస్యంలో మార్పులేదు.)
- ❖ మార్కెట్‌లో అపరాల ధర ఏమీ తగ్గదు.
- ❖ ప్రైవేట్ డిటెక్టివ్‌లు – ప్రైవేట్ సెక్యూరిటీ కల్చర్ పెరుగుతుంది.
- ❖ సామాన్య జనానికి మిర్చిధర అందుబాటులో ఉండదు.
- ❖ యురీ, పూంఛ్ సెక్టార్లలో ఆగని పాకిస్థాన్ ఆక్రమాలు.
- ❖ ప్రముఖ కవి, ఇంగ్లీష్ రచయిత, షేక్స్‌పియర్ వార్తలలోని వ్యక్తి అవుతారు.
- ❖ అవకాయ మరింత ఘూటు.
- ❖ పశుదాణా ధర కలిగి ఉంటుంది. పశుసంతతికి కష్టకాలం.
- ❖ పొగాకు పరిశ్రమ తీవ్రసంక్షభంలో పడుతుంది.
- ❖ కాశ్మీర్ అల్లకల్లోలం – నిత్యం రావణకాష్టం – అదుపులోకి రాదు.
- ❖ యుద్ధం అనివార్యమని భగవంతుడుసంకల్పిస్తే ఎవరుమాత్రం ఏం చేయగలరు.

- ❖ రక్షణ నిధికి మీకు చేతనైన సాయం చేయండి. భారతీయులారా మంచి కార్యానికి నడుం కట్టండి.
- ❖ ఈ సంవత్సరం ప్రళయంలాంటిది సంభవిస్తుంది – జననష్టం.
- ❖ మనకు నమ్మదగిన మిత్రుడు రష్యా. ఇది చెరిగిపోని స్నేహం.
- ❖ పసుపుధర, సుగంధ ద్రవ్యాల ధరలు పెరుగుతాయి.
- ❖ అర్హత, విశేష పరిజ్ఞానము కలిగిన వారికి ఉన్నత పదవులు లభించవు (న్యాయవాదులకు).
- ❖ ఆధునిక పోకడలు – మనసాంప్రదాయలకు తూట్లు పొడుస్తాయి.
- ❖ మత్తెక్కిపోయిన యువత – దేశభద్రతకు గొడ్డలివేటు.
- ❖ సీమాంధ్రలో భూప్రకంపనలు.
- ❖ ఆయుర్వేదిక్ ఫోబియా విజృంభిస్తుంది.
- ❖ టెన్నిస్‌లో కుళ్ళు రాజకీయాలు.
- ❖ ఉత్తరవాయువ్య బంగాళాఖాతంలో, దక్షిణ చైనా సముద్రంలోను – విలువైన సహజ సంపద – గ్యాస్, ముడిచమురు నిక్షిప్తం.
- ❖ ఓ ఉగ్రవాద దాడి తప్పుతుంది. ముంబాయి, హైదరాబాద్ పోలీసుల జాగ్రత్తల వల్ల.
- ❖ ఉత్తరప్రదేశ్‌లో అఖిలేష్ వెనుకంజ, వెన్నుపోట్లు.
- ❖ యుద్ధం, యుద్ధంలాంటి సంఘటనలు సంభవిస్తే ఎన్నికల ఫలితాలలో మార్పులు వస్తాయి.
- ❖ పంజాబ్‌లో బి.జె.పి కూటమికి చేదు అనుభవాలు.
- ❖ పెసర్లు సామాన్యమైన ధరకలిగి ఉంటాయి.
- ❖ పట్టణాలలో పడవ ప్రయాణం.
- ❖ యుద్ధం సంభవిస్తే కొన్ని జ్యోతిష ఫలితాలు మారుతాయి.
- ❖ చైనాతో సంబంధాలు పూర్తిగా దెబ్బతింటాయి.
- ❖ ప్రముఖ హాస్యనటుడు చిల్లరచేష్టలతో గబ్బుపడతాడు.
- ❖ డిజాస్టర్, ఫ్లాప్ సినిమాలకు సూపర్‌హిట్ అని ప్రచారం. (చలనచిత్ర పరిశ్రమకు గడ్డురోజులు )
- ❖ రైతులకు పంట చేతికి వచ్చినా నోటికి అందదు.
- ❖ తెలంగాణలో వ్యవసాయం బాగుంటుంది.

❖ రైతులు పడ్డ కష్టం ఎంత ? - వారికి దక్కింది ఎంత ?
❖ వినియోగదారులకు ధరలు అందుబాటులో ఉండవు – రైతులకు ఆశించిన ధనం రాదు.
❖ సూపర్‌హిట్ అను దిక్కుమాలిన సినిమా.
❖ యుద్ధం, యుద్ధంలాంటి ప్రక్రియలు జరిగినప్పుడు పైనచెప్పిన జ్యోతిష ఫలితాలలో మార్పులు వస్తాయి.
❖ అమెరికాలో రాజ్యాంగ సంక్షోభం.
❖ శ్రీమతి నిర్మలా సీతారామన్‌కు మరిన్ని మంచిరోజులు.
❖ భారతసైన్యం శక్తిసామర్థ్యాలు, త్యాగాలు బిజెపికి లాభిస్తాయి.
❖ రాహుగ్రహ దోషప్రభావం వల్ల ఆఫ్రికాఖండం 3వ వంతులు నాశనం అవుతుంది.
❖ క్రికెటర్ భువనేశ్వర కుమార్ చక్కగా రాణిస్తాడు.
❖ బిజెపి పార్టీకి ఏలినాటి శని నడుస్తోంది (2017 ఫిబ్రవరి నుండి)
❖ శనగపప్పు ధర బాగా పెరుగుతుంది.
❖ సంగీత ప్రియులకు ఈ సంవత్సరం చెవులకు విందు.
❖ క్రికెట్ మినహా అన్ని రంగాలలో విషతుల్య ఫలితాలు, కష్టాల కడలిలో ఆస్ట్రేలియా.
❖ విషాదాల బ్రెజిల్
❖ రైతులకు అసలైన పెద్దసమస్య నకిలి విత్తనాలు.
❖ బిజెపికి ఓట్లు పడాలంటే యుద్ధం చేయకతప్పదు (పవర్ ఫార్ములా)
❖ దివాలా తీసిందని చెబుతున్న అగ్రిగోల్డ్ సంస్థకు అండగా బలవత్తరమైన శక్తులున్నాయి.
❖ అగ్రిగోల్డ్ బాధితులకు కోర్టుద్వారా కొద్దిమందికి కొద్దిగా ఉపశమనం కలుగుతుంది.
❖ కోల్‌కతా *X* టెర్రరిస్టులు.
❖ ఉగ్రవాదం జడలు విప్పుతుంది.
❖ చైనా రకరకాలుగా భారత్‌ను వేధిస్తుంది.
❖ పాకిస్థాన్‌లో తీవ్ర భూకంపం.
❖ తప్పుడు ప్రశ్నాపత్రాలు – విద్యార్థుల పాలిట శాపాలు.

- ఇటలీ ఆర్థికంగా దివాలా తీస్తుంది.
- జపాన్‌లో మారణాయుధాల తయారీ.
- దేవాలయాలు రాజకీయ నిరుద్యోగులకు పునరావాస కేంద్రాలు - విచక్షణారహితమైన దోపిడివాదుల కోట్ల అవినీతి (సీమాంధ్ర)
- కర్ణాటకలో అనావృష్టి, నీళ్ళ కరువు. కరువుకాటకాలు సంభవించవచ్చు.
- బ్రాహ్మణద్వేషం కలిగిన వారికి వేధించడానికి తగిన పదవులు - అధికారాలు లభిస్తాయి.
- సెల్ఫీ పిచ్చి ముదిరతే అదే ఆఖరిఫోటో.
- ప్రేమ వ్యవహారాలు ఈ సంవత్సరం మరింత భ్రష్టుపడతాయి.
- మత్తులో తూలుతున్న మహానగరం.
- బెంగళూరులో బైటపడనున్న నమ్మలేని నిజాలు.
- సిగ్గు, శరం, చీము, నెత్తురు, ఆత్మగౌరవం లేకపోయినా ఫర్వాలేదు మంత్రి పదవి ఉంటే చాలు.
- తెలంగాణా ప్రభుత్వ పథకాలు నూటికి 80% ప్రజాదరణకు నోచుకుంటాయి.
- మిషన్ భగీరథ, మిషన్ కాకతీయ భవిష్యత్ తరాల వారికి మంచి శకునం.
- వారసులొస్తున్నారు - భరించండి.
- చైనా అంతటి సిగ్గులేని దేశం మూడులోకాలలో లేదు - ఉండదు.
- ఉగ్రవాదానికి చైనా పూర్తి సహాయసహకారాలు.
- అన్నా డి.ఎమ్.కె. రాజకీయ చరిత్ర పరిసమాప్తం.
- ఒలింపిక్స్‌లో మెడల్‌వచ్చిందా నజరానాలు రావాలంటే ఈ మెడల్ సరిపోదు. కులం, మతం, వర్గం, కేంద్రమంత్రుల అండదండలు కావాలి నాయానా !
- క్రికెట్ క్రీడాకారులు అశ్విన్, షమీ, రవీంద్రజడేజాలు బాగా రాణిస్తారు.
- విరాట్ కోహ్లీ శకం ప్రారంభమవుతుందని 2 సంవత్సరాల క్రితమే వ్రాయడం జరిగింది అందులో మార్పులేదు.
- రహనే, మురళీవిజయ్ రాణిస్తారు.
- క్రీడాకారుల మధ్య విబేధాలు రోడ్డెక్కుతాయి.
- పిచ్చోడి చేతిలో తుపాకి - ఎటు కాలుస్తాడో భగవంతుడా (అమెరికా)
- చెరువుల్లోకి, నదుల్లోకి దిగవద్దు - ఈతలు ప్రాణాంతకం - ఇంజనీరింగ్ విద్యార్థులకు మరింత ప్రమాదం.

- విశాఖ, ఆర్.కె.బీచ్, గుంటూరు జిల్లా సూర్యలంక బీచ్ బలికోరే ప్రదేశాలు రాహువు ప్రభావం అక్కడ ఎక్కువగాఉంది. సముద్రంలోకి దిగద్దు – ఈతలు కొట్టవద్దు – దూరం నుండి చూసి ఆనందించండి. (2 సంవత్సరాల క్రితమే ఇది వ్రాయబడింది.)
- ఆస్థులకోసం – తల్లిని నరికిన కొడుకు – మందు డబ్బుల కోసం తండ్రిని పైలోకానికి పంపిన మరో తనయుడు – ఆస్థికోసం పిల్లల్ని చంపిన తల్లి – ప్రియురాలి కోసం భార్యను హత్యచేసిన భర్త – కలియుగంలో పాపం పరాకాష్టకు చేరుతుంది. ఈ సంవత్సరం ఇదే పంచాంగం నడుస్తుంది.
- రెండు చక్రాలబండి యముడి వాహనం – తస్మాత్ జాగ్రత్త !
- చమురు కంపెనీలు దివాళా – అస్తవ్యస్తం నిరుద్యోగం.
- బి.సి.సి.ఐ అధ్యక్షుడు అనురాగ్ ఠాకూర్ పరువు పోతుంది.
- భోపాల్‌కు ప్రతికూల కాలం.
- బి.సి.సి.ఐ కి అత్యంత గడ్డుకాలం.
- మినుములు, కందిపప్పు ధర కలిగి ఉంటుంది.
- ప్రతి పట్టణంలో డ్రగ్స్ ముఠా – డెంగ్యూవ్యాధిలా వ్యాపిస్తుంది.
- క్రికెట్‌లో ప్రాంతీయ విద్వేషాలు – రాజకీయాలు కోర్టుకెక్కుతాయి.
- ఏకకుల సామ్రాజ్యం – ఇష్టారాజ్యం భరతుడి పట్టం.
- ఆస్ట్రేలియాలో లేబర్‌పార్టీకి ఆదరణ.
- దేశంలో పలుమార్లు హైఅలర్ట్స్.
- ఫ్లోరిడా, జార్జియా, సౌత్ కరోలినా ప్రాంతాలకు, పట్టణాలకు ముప్పు (తీవ్ర జలబీభత్సం).
- పంచదార చేదు ఎక్కుతుంది.
- కేంద్రమంత్రి స్మృతీఇరాని గ్రహగతులు బాగాలేవు.
- తమిళనాడులో మధ్యంతర ఎన్నికలు.
- అగ్రిగోల్డ్ సంస్థ మీద ప్రభుత్వపరంగా ఎలాంటి చర్యలు తీసుకోబడవు.
- ప్రతి సమస్యకూ పరిష్కారం కోర్టులే.
- 50% పరిపాలనా భారం కోర్టులపై పడుతుంది.
- కోర్టు ఉత్తర్వులను లెక్కచేయని అధికారులు.
- పశ్చిమ గోదావరిజిల్లాలో రొయ్యల, చేపల చెరువుల వ్యాపారం బాగుంటుంది.

- సీమాంధ్రలో, భూదందాలు, భూమి కుంభకోణాలు వెల్లువెత్తుతాయి.
- ఆక్రమించుకో – దోచుకో కొన్ని పట్టణాలలో రౌడీయిజం మళ్ళీ జీవం పోసుకుంటుంది.
- దౌర్జన్యంతో డబ్బు, ఆస్థిపాస్థులు, ప్రాణాలు తీయడం వంటి ఆటవిక రాజ్యం ఆవిష్కరణ మనం చూడబోతున్నాము.
- న్యాయవ్యవస్థలో ముఖ్యనియామకాలు నిందితులే పర్యవేక్షిస్తారు.
- బిజెపి నాయకులు గౌ॥మురళీ మనోహర్ జోషి జాతకంలో గ్రహగతులు బాగున్నాయి.
- బి.జె.పిలో అంతర్గత ఎమర్జెన్సీ.
- భర్త మంత్రి పదవిలో ఉంటే భార్య అధికారానికి ఇబ్బంది ఏముంది?
- పాకిస్థాన్ ప్రజాస్వామ్యానికి మిలటరీ ముప్పుపొంచి ఉంది.
- అన్ని విధాలుగా అమెరికా పతనం – అపఖ్యాతి.
- రంగం ఏదైనాకావచ్చు లక్షలాదిమంది ఉద్యోగాలు పోతాయి.
- ప్రభుత్వ ఉత్తర్వులకు వక్రభాష్యం చెప్పి అక్రమంగా ధనం దోపిడి చేయనున్న ట్రెజరీలు.
- క్రికెట్ టెస్ట్ మ్యాచ్‌లలో కూడా విరాట్ పర్వం కొనసాగుతుంది.
- కర్ణాటక రాష్ట్రానికి గడ్డుకాలం.
- అమెరికా విదేశాంగ విధానాల్లో చాలామార్పులు వస్తాయి. భారతదేశానికి నష్టం.
- పత్తిధర కలిగి ఉంటుంది. ఇది కొంతవరకు ఊరట.
- ప్రాజెక్టుల వల్ల ఎక్కువ లాభాలు కాంట్రాక్టర్లకే.
- ప్రాజెక్టుల కాంట్రాక్టర్లుపై ప్రభుత్వాలు విశేషమైన దయ చూపిస్తాయి.
- పాకిస్థాన్ ప్రధాని నవాజ్‌షరీఫ్ జాతకం బాగాలేదు, గ్రహగతులు వ్యతిరేకంగా ఉన్నాయి.
- డి.ఎమ్.కె. నాయకుడు స్టాలిన్ జాతకంలో గ్రహగతులు బాగున్నాయి.
- చీపురుకట్ట పనిచేయదు – తుపాకీయే శరణ్యం.
- కోహ్లీ, రోహిత్ శర్మ, సురేష్ రైనా, రవీంద్ర జడేజా, రవిచంద్రన్ అశ్విన్, భువనేశ్వర్ కుమార్, మహ్మద్ షమీ, ఉమేష్ యాదవ్, అంబటిరాయుడు, మురళీ విజయ్, పూజారా లు రాణిస్తారు.

- ❖ అట్టర్‌ఫ్లాప్ సినిమాలకు – టీవీల్లో సూపర్ హిట్ టాక్.
- ❖ స్వచ్ఛభారత్ కాన్నా – యుద్ధభారత్ మిన్న.
- ❖ సైన్యం చుట్టూ రాజకీయాలు.
- ❖ సైనిక చర్యలే ఓట్ బ్యాంక్ – కార్గిల్ ఫార్ములా! మళ్ళీమళ్ళీ వర్ధిల్లు !!
- ❖ సినిమా చెత్తగా ఉన్నా పరవాలేదు – పబ్లిసిటీ ఉంటే అదే సూపర్‌హిట్.
- ❖ ఛాటింగ్‌వల్ల అనర్థాలు మరిన్ని పెరుగుతాయి – యువతా జాగ్రత్తసుమా !
- ❖ సిరియాను వీడని దాడుల దరిద్రం.
- ❖ అమెరికాలో నిరుద్యోగం తాండవిస్తుంది. – ఆర్థిక కుంభకోణాలు.
- ❖ బాలీవుడ్ పరిశ్రమకు అగ్నిపరీక్షా కాలం.
- ❖ పంజాబ్ అసెంబ్లీ ఎన్నికల్లో బిజెపి కి చేదు అనుభవాలు.
- ❖ కాంగ్రెస్ బలం పుంజుకుంటుంది, గౌరవం పెరుగుతుంది.
- ❖ ఎమ్.ఐ.ఎమ్ బాగా విస్తరిస్తుంది.
- ❖ సిరియా – టర్కీ – ఢాకాలలో ఆగని రక్తాధ్యాయము. ప్రేక్షక పాత్రలో పెద్దన్న అమెరికా.
- ❖ పంజాబ్‌ఎన్నికల్లో ఆమ్‌ఆద్మీపార్టీ గౌరవప్రదమైన స్థానాలు గెలుచుకుంటుంది.
- ❖ అమెరికా మనకు నమ్మదగిన మిత్రుడు కాదు.
- ❖ బంగ్లాదేశ్ – వెన్నుపోటుకు వెనకాడదు.
- ❖ కత్తులు నూరుతున్న చైనా, ఆయుధాలకు పదును పెడుతున్న వైనం.
- ❖ రాహుగ్రహ దుష్ప్రభావం వల్ల పేకాట జూదం విస్తరిస్తుంది.
- ❖ వరిపంటకు అత్యంత గడ్డుకాలం.
- ❖ వెంకన్న , యాదన్నల దయ ఇరు రాష్ట్రాలపై ఉంటుంది.
- ❖ మంచు రాష్ట్రాలకు (హిమాలయాలు) పొంచిఉన్న భూకంప పెనుముప్పు.
- ❖ టర్కీలో కీలకప్రదేశాలలో ఆత్మాహుతి దాడులు వందల సంఖ్యలో జననష్టం.
- ❖ సైబర్ సాంకేతికతతో ఉగ్రవాదానికి సంకెళ్ళు. (కొంతవరకు).
- ❖ ఐసిస్(ఐ.ఎస్.ఐ.ఎస్) పన్నాగాలను కనిపెట్టలేని నిఘూవర్గాలు.
- ❖ అత్యంత శీతల ప్రదేశాలలో శ్రీనగర్, జమ్మూకాశ్మీర్ అత్యధికవేడి ఉష్ణోగ్రతలు – ప్రకృతి వైపరిత్యాలు.
- ❖ రైతన్న నెత్తిమీద " రాయి'తీ " అన్నీ వట్టి రాయితీలే.
- ❖ ఢాకాలో నిత్య మారణహోమం – ఆపలేని రక్షణ దళాలు ( ఆర్మీ ).

- ప్రపంచం మొత్తం ఉగ్రనీడలోనే. దుర్ముఖి దురదృష్టం హేవిళంబిలోనూ వెంటాడుతుంది.
- ముంబాయి, చెన్నై, కోల్‌కత్తాలలో రసాయన పరిశ్రమలలో పేళుళ్ళు, కార్మికుల ప్రాణనష్టం.
- బంగ్లాదేశ్ ప్రధాని షేక్ హసీనాకు ఉగ్రవాద ముప్పు – రక్షణ కల్పించుకోవాలి.
- రిలయన్స్ జియో దెబ్బకు హెూరెత్తనున్న ఇతర టెలికం కంపెనీలు.
- బంగ్లాదేశ్ అల్‌హనీఫ్ ఉగ్రవాద నాయకుడు షాయక్ అబు ఇబ్రహీంకు అమెరికా రక్షణ దళాల చేతిలో ముప్పు.
- హిమాచల్‌ప్రదేశ్, ఉత్తరాఖండ్‌లలో భూకంపప్రళయాలు, వేలాదిగామృతులు.
- భాగ్యనగరంలో " షి " బృందాలకు ప్రజలలో మంచి పేరు.
- దేశంలో మళ్ళీ తృతీయ ఫ్రంట్ ముచ్చట్ల కళకళలు.
- పెద్దనోట్లు రద్దైనా నేతలు సేఫ్.
- పంజాబ్‌లో అకాలీదళ్ – బిజెపిలకు ఎన్నికలలో గట్టిదెబ్బలు.
- పంజాబ్ రాజకీయాలలో నవజ్యోతిసింగ్ సిక్సర్ వర్సెస్ అమితాషా బౌండరీలు.
- కేరళలో అంతుబట్టని ఆర్.ఎస్.ఎస్., బిజెపి కార్యకర్తల హత్యలు.
- లండన్ పర్యాటకులకు నల్లజాతి వారి చేతిలో ముప్పు. తస్మాత్ జాగ్రత్త.
- పశుగ్రాసం సైతం కొరవడి ప్రాణాలు వదలనున్న పశువులు.
- పశువుల అక్రమరవాణాను ఆపలేని ప్రభుత్వాలు – జీవాల మూగరోదన.
- అవినీది కోరల్లో ఇరుక్కోనున్న కొందరు దేశాధ్యక్షులు.
- శరపరంపరగా ఉత్తర కొరియా అణు పరీక్షలు, అమెరికా ఆందోళన.
- మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శివరాజ్‌సింగ్ చౌహాన్‌పై ప్రజలలో వ్యతిరేకత.
- చాపక్రింద నీరులా వ్యాపించనున్న సుఖవ్యాధులు – యువతా మేలుకో.
- గుజరాత్‌లో వికటించనున్న కేంద్రం ఎత్తుగడలు – రాజకీయ అనిశ్చత.
- 2 సం॥రాల దాకా వెంటాడనున్న నయీం అరాచక జాడలు.
- ఈసారి యు.పి.లో ములాయంకు దూరంకానున్న ముస్లిం ఓటర్లు.
- మితిమీరిన ఆత్మవిశ్వాసంతో ఎదురుదెబ్బ తగిలించుకోనున్న కేజ్రీవాల్.
- కర్ణాటకలో సిద్ధరామయ్యకు పెద్ద చిక్కులు – గడ్డుకాలం.
- ఉత్తర్‌ప్రదేశ్ పి.సి.సి. నేత రీటాబహుగుణ త్వరలో జంప్‌జిలానీ.
- అమెరికాలోని ప్రధాన నగరాలలో విచ్చలవిడి గన్‌కల్చర్ – ప్రేలుళ్ళు.

- ❖ ఉగ్రవాద కార్యకలాపాలకు ప్రధాన పాత్ర లష్కరేతోయిబా, జైషేమహమద్‌లదే.
- ❖ నల్లకుబేరుల విషయంలో మోదీ ఉదాసీనత బయటపడుతుంది.
- ❖ బిజెపికి మరో కొరకరాని కొయ్యగా మారనున్న జమ్మూకాశ్మీర్ ముఖ్యమంత్రి మహబూబ్ మిస్త్రీ.
- ❖ ఐ.టి. దిగ్గజం శామ్ పిట్రోడాకు తప్పని కోర్టు చిక్కులు.
- ❖ చిలుకూరు బాలాజీ మహిమ సరిహద్దులు దాటుతుంది.
- ❖ సిరియాలో జరుగుతున్న పరిణామాలు అమెరికా పాపమే. అమెరికా, ఫ్రాన్స్ దేశాలపై రష్యా మండిపాటు. మూడవ ప్రపంచ యుద్ధానికి ఇక్కడే బీజం పడుతుంది.
- ❖ రాయలసీమలో బంగారు గని బయల్పడుతుంది.
- ❖ హెలికాప్టర్ లేదా విమాన ప్రయాణంలో ప్రముఖ వ్యక్తి దుర్మరణం.
- ❖ కొంతమంది గవర్నర్లు రాష్ట్రాలకు పట్టిన దారిద్ర్యాలు.
- ❖ చైనా ఆర్థికపరిస్థితి దివాళా తీస్తుంది.
- ❖ కందిపప్పు ధర సామాన్యులకు అందుబాటులో ఉంటుంది.
- ❖ తెలుగు రాష్ట్రాల్లో తెలుగు భాషకు గ్రహణం.
- ❖ సమాజ్‌వాది పార్టీలో ముసలం.
- ❖ చెరుకు చేదుగా ఉంటుంది.
- ❖ ముఖ్యనాయకుడి దుర్మరణం - భద్రతా వైఫల్యం.
- ❖ సెక్యూరిటీ నీడలో క్రీడాకారులు ఉండాలి - నీడ తప్పిందా ముప్పు తప్పదు.
- ❖ రైల్వే కాంట్రాక్టు పనుల్లో భారీ కుంభకోణాలు.
- ❖ బౌలర్లు అమిత్ మిశ్రా, అక్షర్ పటేల్ చక్కగా రాణిస్తారు.
- ❖ తాగుబోతు మైనర్లు డ్రైవింగ్‌లు-విషాదాలు ఈ సంవత్సరం మరింత అధికం.
- ❖ చైనా వస్తువులను తరిమికొట్టండి. (ఇదే జరుగబోతుంది).
- ❖ దేశంలో అప్రకటిత ఎమర్జెన్సీ.
- ❖ రియల్ ఎస్టేట్ కుదేలవుతుంది.
- ❖ అన్నివిధాలుగా అమెరికా నాశనం.
- ❖ 2017 నుండి ఉత్తర కొరియా అధ్యక్షుడు కిమ్‌జోన్‌కు ప్రతికూల కాలం ప్రారంభం.
- ❖ సరిహద్దు కాల్పులు అనర్థానికి దారితీస్తాయి. భారత్ సహనం కోల్పోతుంది.

- ఆటవికరాజ్యం పరాకాష్టకు చేరుతుంది.
- ఎంతోమంది పిచ్చివాళ్ళు (అమెరికాలో)
- ఆకలికేకలతో వెనిజులా దద్ధరిల్లుతుంది. ఆదుకునే నాధుడే లేడు. 2014లో చెప్పిన జోస్యంలో మార్పు లేదు.
- శనగలు, శనగపిండి అధికధర కలిగి ఉంటాయి.
- తెలుగు చలనచిత్ర పరిశ్రమకు ఇబ్బందులు.
- ఈ సంవత్సరం కూడా సానియామీర్జాకు తిరుగులేదు.
- ఇరాన్, టర్కీలలో రక్తాధ్యాయం కొనసాగుతుంది.
- ఈ సంవత్సరం కూడా నీటి గండాలు అధికమే.
- దైవ, గో, బ్రాహ్మణ, మాన్యములతో సహా సమస్త భూమిని ప్రైవేటు సంస్థలకు ధారాదత్తం " సంప్రదతేనమమ"
- భక్తులు మన:పూర్వకంగా ఇచ్చిన భూములను, ధనాన్ని కాపాడుకోలేని నువ్వు దైవానివా !
- తెలుసుకో సోదరా ! సైనికుల భజన వల్ల ఉపయోగం ఉంటుంది.
- భారత సైనికులు సాధించిన విజయం భారతీయులందరిదీ – సైనికులు అమరులైనప్పుడు భారతీయులందరిదీ – ఆ విషాదం దీనికి సంబంధించిన పేటెంట్ హక్కులు ఎవ్వరికీ లేవు.
- బలహీనమైన, కలుషితమైన ఆహారం – గ్యాస్ట్రో అంట్రాలజిస్ట్‌లకు చేతినిండా పని.
- విదేశీ పెళ్ళి సంబంధాలు కనిపించని ఊబి. – కొంపదీస్తాయి. జాగ్రత్తగా ఉండాలి సుమా !
- టి.టి.డి. కి మరింత ప్రచారం లభిస్తుంది. వెంకన్న ప్రతిభ దేశవిదేశాలలో మార్మోగుతుంది.
- ఐ.ఎస్.ఐ జాడలు వీడని హైదరాబాద్.
- మంత్రుల ఎడతెరిపిలేని విదేశీపర్యటనలే ప్రజలకు ఊరట, ఫలితం నాస్తి.
- మంచుపోరల్లో దాగిఉన్న భూకంపం ముప్పు 9–10 దాటనున్న రిక్టర్‌స్కేల్, మీరట్, జలంధర్, అమృత్‌సర్, జమ్ము, కాశ్మీర్‌లలో అధికం.
- చార్‌ధామ్ యాత్రలో ఆటంకాలు, యాత్రికులకు ఇబ్బందులు.
- హైదరాబాద్‌లో ఆగని ఉగ్రవాదుల అలజడులు.

- ❖ విందువినోదాలలో వికృతచేష్టలు, వికటింపులు, భారీగా మృతులు. తోపులాటలు, తొక్కిసలాటలు.
- ❖ జమ్ముకాశ్మీర్ ఉగ్రవాదుల చేతిలో పోలీసుల హతం, వార్తలు ఆలస్యంగా తెలుస్తాయి.
- ❖ కూలడానికి సిద్ధంగా ఉన్న వంతెనలు శతం(100) అయితే కూలే వంతెనలు దశకం(1000).
- ❖ ప్రపంచవ్యాప్తంగా ఐ.ఎస్.ఐ.ఎస్ (ఐసీస్) దారుణాలు – అంతులేని మారణకాండ, ఆత్మహుతిదాడులు.
- ❖ ప్రమాదాలు జరిగితే ఆసుపత్రి – ఆసుపత్రిలోనే ప్రమాదాలు.. అదే విచిత్రం.
- ❖ ఉపాధ్యాయుల కీచకపాత్రలు బయల్పడుతాయి.
- ❖ టోల్‌గేట్ల వద్ద ప్రమాదాలు నిత్యకృత్యాలు.
- ❖ కూలేందుకు సిద్ధంగా 100 పురాతన భవనాలు భాగ్యనగరంలో ఉన్నాయి – ముందుజాగ్రత్త అవసరం.
- ❖ ఎన్ని కళ్ళేలు వేసినా ఉగ్రవాదులకు ఆగని ధనప్రవాహాలు.
- ❖ భాగ్యదేవతా భాగ్యనగరంలో కొలువుంటావా ? సెలవంటావా ?
- ❖ వారణాశి పట్టణంలో వరదలు (ఉత్తరకాశి)
- ❖ ఇతర దేశాలలో హిందు పూజారులపై ఆగని దాడులు – మారణకాండ.
- ❖ భవిష్యత్తులో రంగురంగుల వరిధాన్యం తినవలసివస్తుంది.
- ❖ జంటనగరాలకు కలరా రోగం దాపురిస్తుంది.
- ❖ సతి వీడిన పెద్దమనిషి దేశానికి పతి అవుతాడా ?
- ❖ భారత్ పాక్‌ల మధ్య ఈ సం॥ దాదాపు యుద్ధ వాతావరణం ఖరారవుతుంది.
- ❖ ఈసారి పంజాబ్ ఎన్నికలలో సిక్సర్ సిద్ధు బలపడతాడు.
- ❖ తృటిలో తప్పనున్న ఆకాశ ప్రమాదాలు (చేరువగా విమానాలు)
- ❖ శవాలకు వైద్య చికిత్స – కార్పోరేట్ హాస్పిటల్స్ మాయాజాలం (సభ్యసమాజం తలదించుకునే పరస్థితి)
- ❖ వైద్యం ఖర్చు ఆకాశంలోకి – ఆరోగ్యం అధ:పాతాళానికి.
- ❖ మళ్ళీ బయటపడనున్న గ్రహంతరవాసుల ఉనికి ప్రశ్నార్థకం !
- ❖ చిన్నారులపై (బాలకలపై) లైంగిక దాడులు పెరుగుతాయి.
- ❖ తలరాతలు కాదు తలలు మార్చే వైద్యం కూడా వస్తుంది.

- బంగ్లాదేశ్ అల్‌హనీఫ్ ఉగ్రవాద నాయకుడు షాయక్ అబు ఇబ్రహీంకు అమెరికా రక్షణ దళాల చేతిలో ముప్పు.
- సిరియా ఉగ్రవాద దళంలో భారతీయ సోదరులు
- టర్కీ, బాగ్దాద్‌లలో రక్తపాతం.
- ఉగ్రవాదానికి పసిపిల్లలే మారణాయుధాలు, బాల్యమా వర్ధిల్లు ! ఉగ్రవాదమా నశించు !
- హిమాచల్‌ప్రదేశ్, ఉత్తరాఖండ్‌లలో భూకంప ప్రళయాలు, మృతుల సంఖ్య అధికం.
- ప్రమాదాలకు గురికానున్న ఆస్పత్రులు – వైద్యమా వర్ధిల్లు !
- ఎల్.యస్.డి. లాంటి మత్తుమందుల వాడకంలో విద్యార్థులదే పైచేయి – భారీగా పట్టుబడనున్న పెద్దల తనయులు
- భాగ్యనగరంలో కీలక సమయంలో పనిచేయని నిఘూ నేత్రాలు.
- గుంతలు ప్రాణసంకటం. తస్మాత్ జాగ్రత్త.
- అక్రమరవాణాకు ఆవులు కూడా ఆలంబనమే.
- అవస్థల చట్రంలో భాగ్యనగర అరకొర మెట్రో.
- పర్యాటక ప్రదేశాలలో ఘోరప్రమాదాలు ముఖ్యంగా ఉత్తరాఖండ్, ఉత్తరబెంగాల్.
- కుర్రకారు వేగానికి పోలీసుల అధునాతన అడ్డుకట్టలు.
- మధ్యతరగతి మరింత శక్తివంతమవుతుంది.
- కేరళరాష్ట్ర సి.పి.ఎం లో తప్పని వర్గపోరు వీధికెక్కనుంది.
- బీహార్‌లో సతీష్‌కుమార్ పీఠానికి లాలూ వల్ల తప్పని చిక్కులు.
- మహారాష్ట్రలోతప్పని బిజెపి వర్సెస్ శివసేన స్పర్ధలు పతాకస్థాయికి చేరుతాయి.
- అప్పుల ఊబిలో కూరకుపోనున్న కొన్ని ప్రభుత్వాలు (తమిళనాడు – పంజాబ్)
- కాంగ్రెస్ పార్టీలో ఇంటి దొంగలు బయటపడతారు.
- నకిలీ ఎన్‌కౌంటర్‌లలో చిక్కుల్లోపడనున్న పోలీసు అధికారులు.
- పోలీసులకు అంతుచిక్కని అధునాతన నేరాలు భాగ్యనగరంలో నిత్యకృత్యం.
- కర్కశ తల్లుల కథనాలు ఈ సంవత్సరపు వింతలలో ఒకటి.
- పరిమితులు మించి ఉద్యమించి చిక్కులలో పడనున్న విశ్వవిద్యాలయ విద్యాదర్థులు.

- 2 అంకెలు దాటని బలం, యు.పి. ముఖ్యమంత్రిగా షీలాదీక్షిత్‌ను ముందుకు నెట్టి చోద్యం చూడనున్న కాంగ్రెస్ పార్టీ.
- వరుస సక్సెస్‌లతో కొండక్కనున్న దర్శకుడు “రాజ”
- కాంగ్రెస్ పార్టీలో మరో శకుని పాత్ర “ జయరామ్ ”
- తమిళ తంబీలు కర్ణాటక కజిన్స్ మధ్య ఆరని కావేరీ జగడం.
- షేర్స్ పేరుతో పెద్ద కంపెనీల కుచ్చుటోపీలు ప్రజలు ఇరుక్కుంటారు. డబ్బు మాయం.
- నదులలో “పుట్టి మునిగి ” మృత్యువాత పడనున్న తీరప్రజలు.
- ముంబాయి, కోల్‌కత్తా కీలక ప్రాంతాలలో పేలుళ్ళ మృత్యుఘోష.
- నూతన రాజకీయపార్టీలు ఇబ్బడిముబ్బడిగా పుట్టుకొస్తాయి.
- మిషన్ భగీరథ పూర్తి కావడానికి భగీరథ ప్రయత్నాలు సఫలమవుతాయి.
- కరుడుగట్టిన దాదాల అనుచరులుగా పోలీసుశాఖలో కొందరు వ్యక్తులు బయటపడతారు.
- పెద్దల రాతలలో బయటపడనున్న కాంగ్రెస్ ఛిద్ర చరిత్ర.
- భాగ్యనగరంలో భారీ అగ్నిప్రమాదాలు – ప్రాణనష్టం.
- అగ్రస్థానంలో అగ్రసేన్ బ్యాంకు (ప్రభుత్వ బ్యాంకులతో పోటాపోటీ)
- మరికొందరు అధోజగత్తు నాయకులకు ఈ సంవత్సరం మూడింది. (అండర్‌వరల్డ్ డాన్‌లు ).
- పాత సాంఘీక దురాచారాలు తిరిగి వెలుగులోకి వస్తాయి.
- అరాచకాలకు నిలయంగా “ అనంత ” – ఆపలేని శ్రీనగర్ ప్రభుత్వం.
- స్వయంకృతాపరాధాలతో సతమతమవుతున్న వామపక్ష పార్టీ సి.పి.ఎం.
- రసాయన దాడులకు కేంద్రంగా సిరియా నిలుస్తుంది.
- కాంగ్రెస్‌పార్టీలో ‘స్వామి’ భక్తులుంటారు.
- అతితెలివితేటలతో నెట్టుకొస్తున్న తెలుగు కేంద్రమంత్రికి చుక్కెదురవుతుంది.
- ప్రజల ప్రాణాలు తీయటంలో పోటీపడనున్న సోన్ – గంగానదులు.
- ప్రచారంలో గ్లోబెల్స్‌తో పోటీపడనున్న తెలుగుబాబులు.
- హోర్డింగ్‌లు కూడా హార్ట్‌ఎటాక్‌లు తెప్పిస్తాయి. దూరంగా ఉండండి.
- బంగ్లాదేశ్, మయన్మార్‌లలో భయంకర భూకంపాలు, ప్రాణనష్టం.
- మంచినీళ్ళు సైతం ఆన్‌లైన్‌లోనే – టెక్నాలజీ వర్ధిల్లు !

❖ కాశ్మీర్‌లో భారత్‌కు వ్యతిరేకత ఇంకా పెరుగుతుంది. పాకిస్థాన్ అనుకూలత బలపడుతుంది.
❖ పినరయివిజయన్ నేతృత్వంలో ప్రజాస్వామ్యంగా అభివృద్ధి పథంలో కేరళ.
❖ ప్రజల ఆరోగ్యం పట్టని పాలకులు. ఒకేరోజు 5000 మంది ఫీవర్ ఆస్పత్రిలో చేరిక.
❖ దేవాలయాలలో చోరీలు అధికమవుతాయి. దేవుడే దిక్కు.
❖ వెంటాడనున్న విత్తనాల కొరత రైతన్నా ముందుగా జాగ్రత్తపడు.
❖ నీళ్ళకోసం నిప్పులు – నిప్పుల కోసం నీళ్ళు, రాష్ట్రాల మధ్య కుంపట్లు.
❖ ఆమ్ ఆద్మీ పార్టీకి ఎడాపెడా ఎదురుదెబ్బలు కాస్కో కేజ్రీవాల్.
❖ యూ.పి. ఎన్నికలలో అన్ని పార్టీలలో కుల కలకలమే – కులమా రాజ్యమేలు.
❖ గవర్నర్ పదవికి వన్నెదేనున్న పాండిచ్చేరి గవర్నర్ కిరణ్‌బేడి – గవర్నర్ దెబ్బ ముఖ్యమంత్రి అబ్బ.
❖ తమపేర్లు ప్రభుత్వ పథకాలకు పెట్టాలంటూ పోటా పోటీ.
❖ మెట్రో ప్రమాదాలకు నిలయం అవుతుంది. చాలా జాగ్రత్తలు తీసుకోవాలి.
❖ కేరళలో వామపక్ష ప్రభుత్వాల విచిత్ర, వింత ధోరణులు ప్రజలలో నవ్వులు పూయిస్తాయి.
❖ యు.పి.లో – యస్.పి, బిజెపి, కాంగ్రెస్ పార్టీల సంగతి పక్కనపెడితే ఎన్నికల యుద్ధం. బిసి/ యస్.సి/ఓ.సి.ల మధ్య జరుగుతుంది.
❖ అత్యుత్సాహంలో పక్కదారి పట్టనున్న టెక్నాలజీ (యువతదే ప్రధానపాత్ర)
❖ హైకోర్టుల సుప్రీమ్ కోర్టులతీర్పులపై ప్రజలే కాదు ప్రభుత్వాలు కూడా నిర్లక్ష్యం వహిస్తాయి.( రాజ్యాంగానికి చేటు).
❖ హిమాలయ పర్వతారోహకులకు పొంచిఉన్న పెనుముప్పు.
❖ త్వరలో టిడిపి పగ్గాలన్నీ యువబాబు చేతికే, కీలకపాత్ర పోషిస్తాడు.
❖ చిన్నచిన్న రాళ్ళన్నీ ఇక సి.బి.ఐ. మీదకే... ఇవే చిల్లరి దేవుళ్ళు అడే నాటకాలు.
❖ మందిరాలు, మసీదులలో ఆత్మాహుతి దాడులు – భక్తుల మృతి (వందల్లో).
❖ యు.పి.లో ఘర్షణలు – కాల్పులు – మృతులలో ఎక్కువమంది విద్యార్థులు.
❖ కార్బైడ్ వాడకం దారులకు గట్టి శిక్షలుపడే రోజులు వస్తాయి.
❖ మిస్టరీగా మారనున్న వైద్యుల ఆత్మహత్యలు – హత్యలు.
❖ గుళ్ళల్లో బేజారెత్తించనున్న గూడుపుఠాణిలు.

- ❖ భూమి మీద జరిగే అనేక మార్పులకు నవగ్రహాలే కారణం – ముఖ్యంగా చంద్రగ్రహం.
- ❖ ఉదంపూర్ (జె అండ్ కె) లో ఎక్కువకానున్న ఆత్మాహుతి దాడులు.
- ❖ విశ్వవిద్యాలయాలలో అక్రమార్కులు – విద్యార్థులూ జాగ్రత్త.
- ❖ తెలంగాణా ముఖ్యమంత్రి కె.సి.ఆర్ గారి పాలనలో బ్రాహ్మణులకు స్వర్ణయుగం.
- ❖ యు.పి. ఎన్నికలలో లారీలతో పట్టుబడనున్న నల్లధనం. ఎవరిది చెప్మా ?
- ❖ అనాధాశ్రమాలలో గురుకులాలలో కామాంధుల చేతిలో నివసించే వారికి ప్రమాదాలు – తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.
- ❖ ఆక్రమణలను ఆపలేని విధంగా కోర్టుకేసులకు అడ్డంకులు.
- ❖ దుబాయ్, గల్ఫ్ దేశాలలో ఉద్యోగాల పేరిట మోసాలు ఎక్కువవుతాయి.
- ❖ బాలికలపై అత్యాచారాలు – హత్యలు హెచ్చుమీరుతాయి.
- ❖ మట్కా జూదాన్ని / మల్టిలెవల్ మార్కెటింగ్‌ను ఆపలేని పోలీసులు.
- ❖ ఫామ్‌హౌస్‌లో పెరగనున్న విషసంస్కృతి పెద్దల పిల్లలే దోషులు – చేష్టలుడిగిన పోలీసులు.
- ❖ గోపూజకు విశేష ప్రచారం లభిస్తుంది. బడా సంస్థలు ముందుకు వస్తాయి. గోవులు రక్షించబడతాయి.
- ❖ స్త్రీలలో రొమ్ము క్యాన్సర్ / గర్భాశయ క్యాన్సర్లు ఎక్కువవుతాయి. ముందు జాగ్రత్తలు మేలు చేస్తాయి.
- ❖ ఆరోగ్యశ్రీ అన్ని వేళలా క్రిందామీదా – రోగీ ఆయుష్మాన్ భవ.
- ❖ రాష్ట్ర ప్రభుత్వాలకు నకిలీ విత్తనాలు – కేంద్ర ప్రభుత్వాలకు నల్లధనం బెడద తప్పనిసరి.
- ❖ వైద్యానికి చికిత్స అవసరం – వైద్యో నారాయణో హరీ.
- ❖ ఇనుమేకాదు చట్టాలు కూడా తుప్పు పడతాయి.
- ❖ జాతీయ రహదారిపై బాంబుల మోతలు – వందల్లో మృతులు.
- ❖ మంటగలవనున్న అనేక ఆలయాలు – పవిత్రత ప్రశ్నార్థకమే.
- ❖ జమ్మూకాశ్మీర్‌లో 24/7-365 తుపాకుల మోతలే – పౌరుడా జాగ్రత్త !
- ❖ పాలకులకు జ్వరం వస్తే దేశానికే రోగం – పేదవాడికొస్తే వాడి ఖర్మ.
- ❖ విశ్వనగరాలలో విలయాలు సృష్టించేందుకు విఫలయత్నాలు

- రైతులను ఆదుకునేది ప్రభుత్వాలు కాదు – కేవలం దేవుడే కాపాడాలి.
- పురోభివృద్ధి దిశగా ఎయిడ్స్ చికిత్సా విధానం ఆవిష్కరణ.
- భాగ్యనగర్‌లో మెట్రో ప్రారంభం ఆ బ్రహ్మకు కూడా తెలియని రహస్యం.
- విద్యార్థుల వసతిగృహాలలో విషాహారంతో విషాదాలు గుంపులుగా ఆసుపత్రిపాలు.
- ఇద్దరు చంద్రులు ఒకరిది తూర్పు – ఇంకొకరిది పడమర.
- నీటికి భద్రత లేని తుంగభద్ర.
- నకిలీ పత్రాలతో భూదందాలు భాగ్యనగరంలో పెచ్చుమీరుతాయి.
- రాష్ట్రంలో విద్యార్థినీవిద్యార్థుల అదృశ్యం ప్రశ్నార్థకం కానుంది.
- పురాతన ఆలయాలలో చోరీలు ఇరు రాష్ట్రాలలో పెరిగిపోతాయి.
- రోగానికి గురికానున్న ప్రభుత్వ ఆసుపత్రులు.
- న్యాయస్థానాలలో గట్టి బందోబస్తు అవసరం – అల్లరిమూకల ఆగడాలకు అడ్డుకట్టలు వేయాలి.
- ఈ సంవత్సరం కూడా ప్రబలనున్న డెంగ్యూ, చికెన్‌గున్యా, మలేరియా.
- పొంతనలేని వైద్యుల సలహాలు – ఆయోమయంలో రోగులు.
- "ఉరి" వంటి ఘటనలు – ఇరుదేశాల మధ్య పునరావృతమవుతాయి.(భారత్ వర్సెస్ పాక్)
- వాతావరణంలో కార్బన్ నియంత్రణ చెయ్యలేని పి.సి.బి. లు.
- ఇక అంతటా ఎల్.ఇ.డి. వెలుగులే (కొన్ని కుటుంబాలకే ఆర్థికయోగం).
- ఉత్తరప్రదేశ్‌లో కోల్డ్‌వార్ బజారుకెక్కుతుంది.
- దోమలకు దండిగా రక్తాహారం – వైద్యులకు డెంగ్యూ ఆహారం.
- భాగ్యనగరంలో నకిలీ నోట్ల చలామణి చేసే దందా ఎక్కువవుతుంది.
- యు.పి. ఎన్నికలలో అందరికీ ఒకే బాణం అదే రామ బాణం.
- కోర్టుల వ్యతిరేక తీర్పులతో అధికారపార్టీలు ఉక్కిరిబిక్కిరి (కర్ణాటక, తమిళనాడు, ఎ.పి, తెలంగాణ )
- కోడిపుంజుల కొట్లాటలో చనిపోయేది మనుషులే సుమా !
- బెంగాల్‌లో ముస్లింల ఓట్ల కోసం, చట్టాలను తమచేతిలోకి తీసుకోనున్న పోలీసులు, ప్రభుత్వాలు.
- మాజీమంత్రి చిదంబరం టోటల్ ఫ్యామిలీకి సిబిఐ వల్ల తప్పని చిక్కులు.

- ❖ టి.ఆర్.ఎస్.లోకి అడుగుపెట్టనున్న సికింద్రాబాద్ " సుధ ".
- ❖ తమగోతులు తమపుస్తకాల ద్వారా తామే తవ్వుకోనున్న కాంగ్రెస్ నేతలు.
- ❖ ఎవరికి వారు వారి నక్షత్రాల రోజున పంచామృతాలతో శివాలయంలో అభిషేకం చేయించండి. సంక్షేమం, దేశ క్షేమానికి దోహదపడండి.
- ❖ అపరచాణుక్యుడిగా పేరు ప్రఖ్యాతలు తెచ్చుకున్న అమిత్"షాక్".
- ❖ స్విస్‌బ్యాంక్ నుండి ఎవరో వస్తారని ఏదో తెస్తారని ఎదురు చూసి మోసపోకుమా, నిజాయితిగా నడుచుకో సుమా !
- ❖ నల్ల కుబేరులకు 2000 నోట్లు అప్రసాదిత వరం, బలం.
- ❖ కమలం వైపు అకర్షింపబడనున్న బాలివుడ్ కండలఖాన్.
- ❖ నేతన్న బతుకులు బరువెక్కుతాయి. రైతన్న ఆవేదన ఆటకెక్కుతుంది.
- ❖ ప్రభుత్వ మొక్కు"బడులు" నానాటికి తీసికట్టు – ప్రభుత్వ పాఠశాలలో చేరే వారి సంఖ్య తగ్గిపోతుంది.
- ❖ మున్సిపల్ నల్లాలలోనీళ్ళేకాదు అప్పుడప్పుడు విషంకూడా వస్తుంది. చూడండి.
- ❖ ఠాణా సరిహద్దుల విషయంలో భాగ్యనగర పోలీసుల వాగ్వాదం రివాల్వర్‌కు పని.
- ❖ నిబంధనలు పాటించకుండా ప్రమాదాలు కొనితెచ్చుకునేవారు ఎక్కువవుతారు.
- ❖ ఆధికలాభాలు ఆశ చూపి ప్రజలకు టోపీ పెట్టేవారు అధికమవుతారు.
- ❖ ఆరోగ్యశ్రీ చికిత్స చేయడానికి ప్రభుత్వం శ్రీకారంచుట్టాలి – లేకపోతే పడకేస్తుంది.
- ❖ రిజర్వేషన్లకు చట్టాల చిక్కులు – అయోమయంలో ఇద్దరు చంద్రులు.
- ❖ షేర్ మార్కెట్లో మోనోపలీ కంపెనీల షేర్లు రయ్‌రయ్.
- ❖ యువతా మేలుకో కె.ఎఫ్.సి. లాంటి విదేశీ తిండ్లు మానుకో !
- ❖ ఎదురుగా వచ్చే వాహనాల కన్నా వెనుక నుండి వచ్చే వాహనాల ప్రమాదాలే ఎక్కువ.
- ❖ పిడుగుపాటు మరణాలు ఇరు రాష్ట్రాలలో ఎక్కువవుతాయి.
- ❖ గోడలకి, చెట్లకే కాదు నీటికి కూడా నిచ్చెనలు వేయాల్సివస్తుంది.
- ❖ ఐ.టి.శాఖ కేంద్రమంత్రి రవిశంకర్ ప్రసాద్‌కు పేరుప్రఖ్యాతలు.
- ❖ సెల్‌ఫోన్ల కంపెనీల మధ్య అవాంఛనీయ పోరు – ఒకరిపై ఒకరు బురద.
- ❖ మిస్టరీగా మారనున్న పోలీసుల ఆత్మహత్యలు.

- ❖ క్యాబ్ మరియు ఆటో డ్రైవర్లనుండి ప్రయాణికులు తగుజాగ్రత్తగా ఉండాలి.
- ❖ మనుషుల అక్రమరవాణాలో తెలంగాణ అస్సాంతో పోటీపడుతుంది.
- ❖ మామతో తీసే అల్లుడి సినిమా మటాష్, ధనాధన్.
- ❖ పత్తిపండించి, పంట చేతికివచ్చిన రైతులకు బంగారమే (పత్తి డిసెంబర్ 2017 వరకు).
- ❖ దక్షిణాదిన ఒక పీఠాధిపతి ఆరోగ్య విషయంలో అప్రమత్తంగా ఉండాలి.
- ❖ మారుమూల గ్రామాల ప్రజలకు సకాలంలో వైద్యం అందేలా చూడు వెంకన్న స్వామీ, యాదాద్రి స్వామీ.
- ❖ సీమాంధ్రలో గడ ఎక్కనున్న ముద్ర పోరు.
- ❖ నిత్యవసర వస్తువులు, రవాణా చార్జీలు పెరుగుతాయి.
- ❖ సినీ రంగానికి అష్టకష్టాలు.
- ❖ చట్ట సభలకు – న్యాయవ్యవస్థకు మధ్య విభేదాలు పరాకాష్టకు చేరుతాయి.
- ❖ దక్షిణ కొరియాలో ఉప్పు – ఉత్తర కొరియాలో నిప్పు.
- ❖ పెద్దనోట్లరద్దు వెనుక భారీ కుంభకోణం.
- ❖ తమిళనాడులో రాజకీయ సంక్షోభం.
- ❖ అన్నా డి.ఎం.కె.లో అంతర్గత రాజకీయాలు కొంపదీస్తాయి.
- ❖ పన్నీరు సెల్వం అధికారస్వీకరణ ముహూర్తం బాగాలేదు –అధికార వియోగం.
- ❖ తమిళనాడులో రాజకీయ అనిశ్చిత స్థితి.
- ❖ సైబర్‌నేరాలు సంచలనం కోటానుకోట్లు దోపిడి.
- ❖ నిరక్ష్యరాస్యతను సొమ్ముచేసుకుంటారు.
- ❖ ట్రంప్ దుర్మార్గాలకు కేరాఫ్ అడ్రస్.
- ❖ భారతీయులను ట్రంప్ తరిమి కొడతారు.
- ❖ పెద్దనోట్ల రద్దు దేశానికి పెద్ద దురదృష్టం.
- ❖ కశ్యప్ రాణింపు.
- ❖ ఆంధ్రప్రదేశ్‌లో నూతన ప్రజా సంక్షేమ కార్యక్రమాలు.
- ❖ శ్రీమతి సోనియాగాంధి గ్రహగతులు బాగాలేవు.
- ❖ ఇండోనేషియాలో తిరిగి భూకంపం.
- ❖ సైనికులశవాలమీదఎక్కి అధికారపీఠాన్నిఎక్కాలని ప్రయత్నించేవారు ఉన్నారు.
- ❖ అన్ని విధాలుగా అమెరికా పతనం, అపఖ్యాతి.

- అమెరికా విదేశాంగ విధానాల్లో చాలామార్పులు వస్తాయి. భారతదేశానికి నష్టం.
- దేశభక్తి ముసుగులో కొంపలు తీస్తారు, జాగ్రత్త.
- న్యాయవ్యవస్థ పట్ల ప్రజలకు నమ్మకం పోయేప్రమాదం ఉంది.
- ప్రజలు మైండ్‌సెట్ మార్చుకోవాలి.?
- ఆక్వా రంగంలో కొన్ని ఒడిదుడుకులు ఏర్పడినా మొత్తంమీద బాగుంటుంది.
- బ్యాంకులలో డబ్బులు డిపాజిట్ చేయడం అంతబుద్ధి తక్కువపని లేదు అని ఋజువవుతుంది.
- కాంగ్రెస్ నాయకుడు శ్రీ మల్లిఖార్జున ఖర్గేకు రాజయోగం.
- ప్రత్యర్థి జట్టులకు వణుకు – అశ్విన్, జడేజాల ఆటతీరు.
- ప్రజలలో క్రికెట్‌తో పాటు ఇతర క్రీడలకు కూడా ఆదరణ పెరుగుతుంది.
- ఇతర క్రీడలలో భారత్ రాణిస్తుంది.
- రాబోయే రోజుల్లో అన్నా డి.ఎం.కె. తన ప్రాబల్యాన్ని కోల్పోతుంది.
- సమాజ్‌వాది పార్టీకి చేదు అనుభవాలు.
- నార్త్ కొరియా అధ్యక్షుడికి ప్రతికూల కాలం.
- దేశలో బ్యాంకిగ్ వ్యవస్థలు చిన్నాభిన్నమవుతాయి. బ్యాకింగ్ వ్యవస్థ దెబ్బతింటుంది.
- బ్యాంకింగ్ వ్యవస్థపై ప్రజలకు నమ్మకం పోతుంది.
- చాలా బ్యాంకులు నష్టాలను చవిచూస్తాయి.
- నగదురహిత లావాదేవీలు విఫలమవుతాయి.
- చాలామంది జాతకాల కంటే మాయవతి జాతకం బాగుంది.
- అంతర్జాతీయ పరిణామాలు భారత్‌కు నష్టం, కష్టం – పాకిస్థాన్‌కు లాభం – అండదండలు.
- హేవిళంబినామ సంవత్సరం భారతదేశానికి అగ్నిపరీక్ష, దురదృష్ట సంఘటనలు.
- అమెరికా – చైనా సంబంధాలు బాగా క్షీణిస్తాయి.
- ఆన్‌లైన్ ఛాటింగ్ – పరిచయాలు, పెళ్ళిళ్ళు – ప్రేమలు 99% అట్టర్‌ఫ్లాప& – పచ్చిమోసం.
- కవిచంద్రుడు – చంద్రబోస్‌కు అవార్డు.

- ❖ వెయ్యి, 500 రూపాయల నోట్లరద్దు వల్ల ఏమీ ప్రయోజనం లేదు. దేశ ఆర్థికవ్యవస్థ గాడితప్పుతుంది.
- ❖ బంగారం, షేర్స్, డాలర్లు, స్విస్‌బ్యాంకులు, కార్పోరేట్లపై పట్టుబిగిస్తే, ముక్కు పిండితే ప్రయోజనం ఉంటుంది.
- ❖ నోట్లరద్దువల్ల సామాన్యులకు ఎలాంటి ప్రయోజనం లేదు. ప్రచారం తప్ప.
- ❖ కేజ్రీవాల్ చేతికి వజ్రాయుధం.
- ❖ ఉభయ రాష్ట్రాల గవర్నర్ గౌ॥శ్రీ నరసింహన్‌గారి జాతకంలో రాజయోగం ఇంకా కొనసాగుతుంది. జాతకం బాగుంది.
- ❖ నీ కష్టార్జితం బ్యాంకులలో దాచుకుంటే దానిమీద నీకు హక్కులేదు. – ఇదేమి ఆటవిక న్యాయం – దేశంలో అప్రకటిత ఎమర్జెన్సీ ఉందా?
- ❖ తెలుగు రాష్ట్రాల రైతులకు అరిష్టకాలం, గండకాలం.
- ❖ సినీ అభిమానుల మధ్య వివాదాలు తారాస్థాయికి చేరుతాయి. (అపశృతులు, దుస్సంఘటనలు).
- ❖ భారతప్రభుత్వం తీసుకునే తక్షణ నిర్ణయాల కారణంగా ఇతర దేశాల దాడులు, ఆక్రమణలు ధీటుగా నిలువరించే సూచన.
- ❖ జలవిద్యుత్ కేంద్రాలు నిర్మాణ త్వరితగతిన ప్రారంభించే అవకాశం.
- ❖ ఆర్థికమాంద్యం క్షీణత – ఆర్థిక అభివృద్ధి పతనం.
- ❖ అంగారక గ్రహస్థితి కారణంగా రెండు అతిపెద్ద విమాన ప్రమాదాల సూచన లేదా విపత్తుల సూచన.
- ❖ గ్రహణాల రోజులు, ఇతర ప్రతికూల రోజులలో ప్రయాణం వాయిదా చెప్పదగిన సూచన.
- ❖ విశ్వవిద్యాలయాల్లో, విద్యాసంస్థలలో ఉద్రిక్తత వాతావరణంలో తిరోగమన పరిస్థితులు – ఆరోగ్యకర వాతావరణం.
- ❖ డోనాల్డ్‌ట్రంప్ పూర్తికాలం పదవిలో ఉండదు.
- ❖ మిరియాల ధరలు మంట ఎక్కుతాయి.
- ❖ ప్రభుత్వంలో కీలకనేత లేదా రాజకీయ ప్రముఖుడి లేదా జాతీయస్థాయిలో రక్షణ సలహాదారుస్థాయిలో ఉన్న వ్యక్తికి ప్రమాదం లేదా అపాయం, తీవ్రవాదుల చర్య లేదా అపాయం, తీవ్రవాదుల చర్య లేదా విషప్రయోగపు చర్య జరిగే అవకాశం.

